# క్రిజ్లర్ ఆత్మకథ

వాల్టర్ పి. క్రిజ్లర్

అనువాదం :

కొమ్మూరి ఉషారాణి

వెల : ఎనిమిది అణాలు

పబ్లిషర్సు :

విదేశ సాహితీ గ్రంథమాల

మద్రాసు 17.

# పీఠిక

వాల్టర్ క్రిజ్లర్ జీవితచరిత్ర చాలా అపూర్వమైనది. మహత్తర సంఘటనలతో కూడుకున్న ఆ జీవిత కథను మరి దేనితోనూ పోల్చలేము. కాని అడుగడుగునా కష్టాలనెదుర్కొని, శ్రమించి, విశేష నైపుణ్యం ప్రదర్శించిన సామాన్య అమెరికను కార్మికుల జీవితాలకి అతని జీవితకథనం ప్రతిబింబము. అమెరికాదేశంలో ప్రజలు దాస్యవిముక్తులై ప్రజాప్రభుత్వము ఏర్పడిన తొలిరోజులలో ఆ దేశ సౌభాగ్యానికి పునాది వేసినవి అమెరికను ప్రజల ధైర్యసాహసం, నిజాయితీ, నాయకత్వ ప్రతిభ. అమెరికాలో పారంపర్యంగా వస్తున్న ఈ లక్షణాలన్నీ గత అర్థ శతాబ్దంలోనూ క్రిజ్లర్‌లో మూర్తీభవించాయి _ ఊహాగానంలోనై తేనేం, ప్రజ్ఞా విశేషాల్లోనైతేనేం, క్రిజ్లర్ తన వ్యక్తిత్వాన్ని నిరూపించాడు. కాని అన్నిటికంటె ఎక్కువగా సమిష్టి కృషియొక్క ఆవశ్యకతని అతను విశ్వసించాడు. తోటి కార్మికులని అతను ఎంతో జాగ్రత్తతో ఎంచుకొనేవాడు. వారిపట్ల అతను చూపిన స్నేహభావమూ, విశ్వాసమూ ఉత్తేజ పూరితమైనవి. ప్రజల కోరికలకి అనుగుణంగా, ఎప్పటికప్పుడు మార్పులు చేయటమే ఏకైక లక్ష్యంగా నడిచింది క్రిజ్లర్ సంస్థ. తన సహచరులలో గూడా క్రిజ్లర్ ఈ భావాన్నే ప్రోత్సహించాడు. ఈ పుస్తకం క్రిజ్లర్ జీవితచరిత్ర. ఇది చదివిన పఠిత తన జీవితంలో సాధించిన వాటితో సంబంధంలేకుండా ఆలోచిస్తే ఒక విషయంమాత్రము తెలుసుకుంటాడు. క్రిజ్లర్‌కిపున్న "అవకాశం" అందరికీ వున్నంతకాలమూ, "అవకాశం" అనేది వారసత్వంగా వచ్చినంతకాలమూ, మన పిల్లలకీ, పిల్లల పిల్లలకీ ఈ దేశం నివాసయోగ్యమైనదిగా వుంటుంది.

కె. టి. కెల్లర్.

# క్రిజ్లర్ ఆత్మకథ

—:o:—

## నా బాల్యం

యంత్ర శాస్త్రజ్ఞుడను కావటం వల్ల వస్తువులు ఏవిధంగా పని చేస్తాయో తెలుసుకోవాలనే ఔత్సుక్యం నాలో ఎప్పుడూ కలుగుతూ ఉండేది. నా తండ్రి ఒక ధూమశకటాన్ని నడుపుతుండేవాడు. నా తల్లి దండ్రులు నన్ను పెంచి పెద్ద చేయటానికి తోడ్పడిందీ ఒక శకటమే. బాల్యంలో నాకు లభించిన శిక్షణా, నా భావాలూ, ఆశయాలూ, యంత్ర నిర్మాణంలో నా ఆసక్తిని పెంపొందించాయి. కొందరు అమెరికనులు యంత్రాలంటే చూపిన నిరసన భావం చిన్నతనంలో నా మనస్సులో బాగా నాటుకుపోయింది. అది ఇప్పటికీ జ్ఞాపకం వుండటం విచిత్రమే. అమ్మ వంటయింటి గోడకి ఆనించి వున్న ఇత్తడి సెమ్మెను బాగుచేసే పని నాకు అప్పగించింది. నేను అయిదారు సంవత్సరాల బాలుడిగా వున్నప్పుడు, రొట్టె, పంచదార కావాలని యేడిపిస్తూవుంటే, "ఆ దీపం చూడు పాపం ఎలా వుందో? దీపంలో నూనె లేదు. దానికీ ఆకలేస్తోంది. దాని నోట్లోనూ కొంత నూనెపోసి దాహం తీర్చకుంటే ఈ రాత్రి మనల్ని చీకట్లో ముంచేస్తుంది." అనేది అమ్మ. ఆ దీపాన్ని గురించి అమ్మ నా కనేక కథలు చెప్పేది. ఆ కథలు వింటుంటే, అదేదో సజీవమైనదిగా నాకు కనుపించేది. నేనూ అమ్మా రోజూ దాన్ని తుడవటం ఏదో జగ్గను కట్టుకథ జ్ఞప్తికి వచ్చి సరదాగా వుండేది.

ఆ నూనె డబ్బాకి మూత వుండేదికాదు. మూత బదులు నల్లగా వడిలిపోయిన ఉర్లగడ్డని పెట్టేవాళ్లం. మా నాన్నకి జీతమువచ్చే

ఆపదలో వున్నామని పిల్లల్ని ఆటపాటలు కట్టిపెట్టమన్నారు. అక్కడున్న ప్రతిఒక్కడూ చేతిలో ఏదో ఒక ఆయుధాన్ని పట్టుకొనిఉన్నాడు. ఎక్కువ మందికి తుపాకీలున్నాయి. కొంతమంది యువకులుమట్టుకు గొడ్డళ్ళనీ, చెట్టుకొమ్మలనీ పట్టుకున్నారు. నాప్రక్కనే గోడకానుకుని ఒక వృద్ధుడు కూర్చున్నాడు. ముడతలుపడిన అతని నల్ల బూట్లమీద గుజ్జుంపెంట పడివుంది. అతను ఒక ఖడ్గాన్ని బొమ్మకిమల్లే చేతిలో పట్టుకొన్నాడు.

రెడ్ ఇండియన్లు వస్తున్నారని మేము.బాగా జడుసుకున్న సమయాల్లో అదొకటి. అదంతా 1880 లేక 1881 వ సం॥లో జరిగిందనుకుంటాను. ఎల్లాగైనా, అమ్మ చెప్పినట్లుగానే రెడ్ ఇండియన్లు నన్ను పట్టుకోలేదు. రాత్రిళ్ళు ఒంటరిగా పడకగదిలోకి వెళ్ళటానికి జంకినప్పుడల్లా అమ్మ నాకు మళ్ళీ మళ్ళీ ధైర్యంచెప్పేది. ఒక్కొక్కప్పుడు బలవంతంగాకూడా లోపలికి తోసేది.

1871 వ సం॥లో నా తండ్రి ఒక మిసౌరీ కన్యను వివాహమాడాడు. ఎఱ్ఱని శరీరచ్ఛాయ, లేత పెదవులు, నిండైన విగ్రహం ఆమె సౌందర్యానికి మెఱుగులు దిద్దాయి. అమ్మ పూర్వీకులు జర్మను దేశస్థులు. మసౌరీలోని తన పుట్టింటినీ, ఆ యింటిలోని జర్మను సంస్కృతినీ వదిలి అత్తవారింటికి వచ్చేనాటికి అమ్మ చాలా అందమైంది. తర్వాత సరిహద్దు ప్రాంతంలో చెలరేగిన అలజడి ఫలితంగా కలిగిన కొన్ని కష్టాలు ఆమె రూపంలో బాగా మార్పులు తెచ్చాయి. కొంసాస్ పట్టణంలో పచ్చికబయలు సాగుచేయక ముందే ఆమె నలుగురి పిల్లల తల్లి అయింది. నేను మూడవవాణ్ణి. పిల్లల పోషణకోసం ఆమె దున్నపోతు మాంసం తినేది. ఇప్పుడు నా మనుమరాళ్ళ వంకచూస్తుంటే, పోయిన అమ్మనే చూస్తున్నట్లనిపిస్తుంది. అంతేకాదు ; అద్దంలో నా ప్రతిబింబం చూస్తున్నా నా నయనాల్లో ఆమె మూర్తీభవించినట్లనిపిస్తుంది. అలాటి సమయాలలో ఎల్లిస్‌లోని స్నేహితులు జ్ఞప్తికివస్తారు. మా వంటింటిలో కాఫీ పుచ్చుకుంటూ నావంక చూసి "వాల్టు అంతా తల్లిపోలికే" అనేవారు. వారి మాటలు అక్షరాలా నిజమని ఒప్పుకోక తప్పదు.

అమ్మ అజమాయిషీలో మేమంతా పనులుచేయవలసిందే. ఆమె ఓపిక అద్భుతమైనది. ప్రతిరోజూ సూర్యోదయం కాకముందే వంటయింట్లో అమ్మ చేసే కుంపటి చప్పుడుతో నాకు మెలకువ వచ్చేది. చలికాలంలో వంటయింటి కుంపటిదగ్గరే మేము చలికాచుకునేవాళ్ళం. పట్టపగలే రాత్రికి మల్లే చీకటిగావుంటే ఆ రోజుల్లో ఆ ఒక్క సౌకర్యమే మాకు దక్కేది. చాలా సంవత్సరాలు అలాగే గడిపాము. మా యింటికిటికీలు సరిగ్గావుండనందున సందుల్లోంచి లోనికి మంచువచ్చేది. కాళ్ళకి చెప్పులైనా లేకుండా ఆమంచులోనే అనేకసార్లు వంటయింటి వైపు వెళ్ళేవాళ్ళం. నా పెద్ద అన్నయ్య ఇడ్, నేనూ ఒకపక్కమీదే పడుకునేవాళ్ళం. అతను నా కంటె మూడు సంవత్సరాల మూడు నెలలు పెద్ద. పొద్దుటి భోజనానికి ముందు ఆవుకి పాలుతీయటం అతని వంతు. నాకూ యితరపనులుండేవి.

ఒక్కొక్కప్పుడు మాంసం తీసుకురావటానికి పెందరాళే నన్ను పంపేవారు. ఎల్లీస్‌లోవున్న కొన్నివందలమంది జనాభాకి ఎద్దుమాంసము ఎప్పుడూ దొరికేదికాదు. అటువంటప్పుడు మేమంతా గూడాగేదె మాంసమే తినేవాళ్ళం. అది మా వూళ్ళో కొల్లలుగా దొరికేది. ధరకూడా చౌక. అందులో కొంతభాగం పశ్చిమప్రాంతంలోని పట్టణాలకి రవాణాచేయబడేది. ఆ మాంసంతోనే అమ్మ చాలా రుచికరమైన పులుసువండేది. అటువంటి పులుసుని మళ్ళీ నేనెన్నడూ తినలేదు. అమ్మ అది వండినరోజునే మాకు పెట్టేదికాదు. మర్నాడు పొద్దున్న భోజనంవేళకి వేడివేడిగా దాన్ని బల్లమీద పెట్టేది. ఆ రోజుల్లో మా భోజనాలు చాలా దివ్యంగా వుండేవి. చేపలూ, ఉర్లగడ్డలూ, కేకులూ తినేవాళ్ళం. పాలలో ఉడకబెట్టిన మొక్కజొన్నలని అమ్మ తరుచూ పెట్టేది. ఆ జొన్నగింజలని నీళ్ళలో నానేసేది. జొన్నగింజలతో తిండిపదార్థాలు చెయ్యడమేగాక, జొన్నలని గూడా ఇంటివెనుక తోటలో పండించేది. ఆమె చెయ్యలేని పని అంటూలేదు.

డబ్బుఖర్చు లేకుండా దొరికే ఏవస్తువుకోసమూ మేము ఎప్పుడూ డబ్బు వృథా చెయ్యలేదు. నాన్న మంగలిషాపుకి పోయి ఎఱుగడు. ఆ పని యింట్లోనే చేసుకునేవాడు. అందులో అమ్మ నాన్నకి తోడ్పడేది.

మంగలిషాపులో లీలగా వినబడే శబ్దాలు నాచిన్నతనంలో మా యింట్లో జరిగేదానిని ఈనాటికీ జ్ఞప్తికి తెస్తాయి.

మేము ప్రతి ఆదివారం ప్రార్థనకోసం చర్చికి వెళ్లేవాళ్లం. ఆ రోజే కనుక నాన్న క్షవరం మొదలెడితే అందరికీ హడావుడే. ఆ రోజుల్లో పాశ్చాత్యుల ఫక్కీలో నాన్న దట్టమైన నల్లని గడ్డం. మీసాలు పెంచాడు. పెరట్లో దుబ్బుగా పెరిగిన పొదలకిమల్లే నాన్న చెంపలమీద ఉద్ధృత్తంగా గడ్డం పెరిగింది. దాన్ని అమ్మ ఏమాత్రం భరించలేకపోయేది. అమ్మ పోరు పడలేక నాన్న క్షవరానికి వంటయింటి కిటికీ దగ్గిర చేరేవాడు. ప్రక్కనే పొయిమీద నీళ్లు కాగుతుండేవి. ఆ పదునైన కత్తి కాకపోయినా సోపు మటుకు స్వయంగా యింట్లో తయారుచేసేవాళ్లం. ఆ పని నేనే చేసేవాణ్ణి. బొటన వ్రేలితో ఒక్కమాటు నాన్న గడ్డం తాకి, తలపై కత్తి. పని ప్రారంభించేది అమ్మ.

కాన్సాస్‌లోని వేడికీ, గాలికీ, మంచుకీ, యింట్లో తయారుచేసిన రకరకాల సోపులు మొదలైన వాటికీ తట్టుకోగలిగిన నాన్న శరీరం మొరటుదేలిందనడంలో సందేహంలేదు. కానీ ఆయన శరీరం ఎంత కఠినమైనదో మనసు అంత మెత్తనిది. నేనూ, అన్నయ్యా పులి పిల్లలకుమల్లే పోట్లాడుకునేవాళ్లం. అదుపాజ్ఞలు లేకుండా వ్యవహరించేవాళ్ళం. కాని ఒక్కసారీ నాన్న మామీద చెయివేసి ఎరగడు. నచ్చచెప్పి మమ్మల్ని లొంగదీసుకునే వాడే కాని ఆయన చేతులు మా మీద పడేవికావు. సుత్తో. అంపమో, లేక రంగులుపూసే కుంచో, చేతిలోపట్టుకున్న ఆయన రూపం తరుచు నా స్మృతిపథంలోకి వస్తూవుంటుంది. మా కుటుంబ సౌఖ్యంకోసం ఆయన నిత్యం ప్రయత్నిస్తుండేవాడు. మేము ఎబ్లీన్‌లో మొదట వున్న యిల్లు నిరాడంబరమైనది. రెండు పడకగదులూ, ఒక వంటయిల్లు. ముందు చిన్న వసారా వుండేవి. అయితేనేం ఇరుగు పొరుగు వారికి అమ్మ మా యిల్లు గర్వంగా చూపెట్టేది. వాళ్లు యింకా మట్టి గోడలతో కట్టిన యిళ్లలోనే వుండేవారు.

ఎబ్లీన్‌లో కొందరికి గేదె పిడకలు, ఆవు పిడకలు తప్ప పొయి రాజే

సేందుకు మరేవీ చిక్కేవికావు. కాని మేము మట్టుకు అదృష్టవంతులం. నాన్న వుద్యోగం వల్ల మాకు బాగ్గులు దొరికేవి. వేటకు వెళ్ళినప్పుడు నా వేళ్లు తుపాకీ పట్టుకోలేనంతగా మొద్దుబారితే నిప్పుసెగలో కాచుకునే వాణ్ణి. మా యింట్లో ఒక కొట్టుగదినిండా బొగ్గులుండేవి. పాయిరాజేసే పని నేనూ, అన్నయ్యా చూచుకోవలసివచ్చేది. ఆ పని నిర్లక్ష్యం చేసినా, లేక ఏమాత్రం చెప్పిన మాట వినకపోయినా అమ్మ మా నడుములు విరగ గొట్టేది. ఆమె ఆయుధం ఒక దువ్వెన. అమ్మ చేతిమీద బాదుతుంటే. నిజంగా ఒక సేనానాయకుడు శిక్షిస్తున్నట్లే వుండేది. నాకు దాదాపు 17 సంవత్సరాలు వచ్చేంతవరకూ ఆ దువ్వెనకి పని తగులుతూనే వుండేది. అప్పటికీ ఇప్పటికీగూడా నేను మెత్తబడలేదు. నా ఒళ్లల్లా పుండయిపోయి. సిగ్గుతో పశ్చాత్తాప పడేటంతవరకూ, నన్ను బాదే ఓపిక వుండేది అమ్మకి.

సంసార భారాన్ని అమ్మా నాన్నా సమానంగా తోడు నీడగా పంచుకునేవారు. వారిది చాలా విచిత్రమైన జంట.

ఎల్లిస్‌లో అమ్మ కూర దినుసులు ప్రఖ్యాతి పొందాయి. అక్కడ నాన్న పేరు తెలియనివారెవరూ లేరు. నిజానికి ఆ ప్రాంతంలో కెల్లా నాన్న మంచి యంత్ర శాస్త్రజ్ఞుడని అనిపించుకున్నాడు. రైలు కంపెనీవారు ప్రప్రథమంగా ఇంజను కొన్నప్పుడు నాన్న ఇంజనీరుగా ఎన్నుకోబడ్డాడు. ఉదయం 7-30 గంటలకి రైలు ఎల్లిస్‌కి తూర్పుగా బయలుదేరేది. నాన్నని అలా చూస్తూ నిలబడేవాణ్ణి. ఆ తర్వాత 8 గంటలకి స్కూలుకి వెళ్ళినా నాన్నని గురించే ఆలోచిస్తూ వుండేవాణ్ణి.

అప్పుడు నాకు పదేళ్లు. నాన్న ఇంటినుంచి బయలుదేరేటప్పుడు అన్నం ముంత పట్టుకుని తరుచు ప్రక్కనే నడిచేవాణ్ణి. నాన్న నడుంకి పెద్ద తుపాకీ వేళ్లాడుతూవుండేది. నల్లని ఆ తుపాకీ పిడి నాన్న పిడికిలిలో సరిగ్గా సరిపోయేది. నాన్న వెనకాలే నడుస్తూంటే ఆ తుపాకీ నా నుదుటివరకూ వచ్చేది. నాన్న పెద్ద బలశాలికాదు. సామాన్య సైనికుడులా వుండేవాడు. నాన్నని గురించి చెప్పినప్పుడెల్లా "నాన్న ఇడ్ అంతభారీగా లేనప్పుడు" అని గప్పాలు కొట్టేవాణ్ణి.

నాన్న కెనడాలో జన్మించాడు. అయిదారేళ్ళప్పుడు నాన్నని ఒంటేరియాలోని ఛాట్టాంనుంచి కాన్‌సాస్ పట్టణానికి తీసుకువచ్చారు మా పూర్వీకులు. ఛాట్టాంనగరాన్ని కట్టిందివాళ్ళే. వాళ్ళంతా జర్మనీ దేశస్థుల సంతతి. నాకు ఎనిమిది తరాలముందు గ్రిస్లర్ అనే వ్యక్తి జర్మనీనుంచి అమెరికాకు వచ్చాడు. జర్మనీలోని రైన్ నది లోయలోవుంటే కాతలిక్ మత వ్యతిరేకులు కొందరు, నదర్‌లెండ్సుకి వెళ్ళి. అక్కడనుంచి ఇంగ్లండుకీ. తర్వాత ప్లయిమవుత్‌నుంచి న్యూయార్కుకీ చేరుకున్నారు. ఆ జట్టులో గ్రిస్లర్ ఒకడు. అంతర్యుద్ధానంతరం. పన్నెండేళ్ళప్పుడు నాన్న కాన్‌సాస్‌కి పారిపోయాడు. అక్కడ 12 వ కాన్‌సాస్ సైన్యదళంలో నగారా మోగించే పనిలోచేరాడు. నాన్నచేత ఆపని మాన్పించాలని మా తాత ఎంతో ప్రయత్నించాడు. కాని నాన్న యుద్ధం పూర్తయేంతవరకూ అక్కడేవున్నాడు. నాన్నచేత చిన్నతనపు అనుభవాలన్నీ జ్ఞాపకమున్నంతవరకు నేనూ అన్నయ్యా చెప్పించుకునేవాళ్లం. నాన్న తిండి దొరకక, వుత్తకడుపుతో వానలోనూ మంచులోనూ దుప్పటిమాత్రమే కప్పుకుని పడుకున్న రోజులూవున్నాయి. ఆ కష్టాలు నాన్నని ఏమాత్రం బాధించలేదు. నాన్నకంటె ఆరోగ్యవంతుడు మరెవరూ లేరని నా వుద్దేశం. ఎల్లిస్‌లో ఆయన ఇంజనీరుగా వున్న 27 సంవత్సరాలలోనూ ఒక్కరోజైనా అస్వస్థత ఎరగడు. కాని యుద్ధసమయంలో జరిగినవన్నీ నాకు ఊహామాత్రంగానే తెలుసు. అప్పటికి నేను బాగా చిన్నవాణ్ణి.

యుద్ధానంతరం నాన్న అర్‌మార్‌డేల్ కర్మాగారంలో పనిచేయటానికి వెళ్ళాడు. మొదట, యింజనులో నిప్పు ఎగదొసే పనిదొరికింది. తర్వాత ఇంజనీరు అయాడు. ఆయన ఉద్యోగం విరమించుకునేంతవరకూ ఇంజనీరుగానే వున్నాడు. నాన్న వుద్యోగంలో చేరినప్పుడు ఆ రైలుకంపెనీని యూనియన్ పసిఫిక్ అనేవారుకాదు. కాన్‌సాస్ పట్టణానికి పశ్చిమంగా నిర్మిస్తున్న రైలుమార్గాన్ని కాన్‌సాస్ పసిఫిక్ అనేవారు. రైలుమార్గానికి ఇనుపకమ్ములని బిగించే పరికరాలన్నీ అందించే రైలు నాన్న నడిపేవాడు. తరుచు కారెనుములమందలు దారి కడ్డువచ్చేవి. ఇంజను

పొగ, నిప్పు చూస్తేకాని అవి తొలగిపోయేవికావు. రెడ్ ఇండియన్ల ముఠాలుకూడా నాన్న ఎరిగున్న కొందర్ని చంపేశారు.

ఎప్పుడైనా ఎల్లిస్‌నుంచి బ్రూక్‌విల్లీకి నాన్నతోకూడా నేనూ రైలులో వెళ్ళేందుకు అనుమతి చిక్కేది. అప్పుడు మేమున్న చోటికి 13 మైళ్ళ దూరంలో ఫోర్టుహేస్ అనేచోట, నీలిదుస్తులు ధరించిన సైనికులు కనుపించేవారు. ఇంకా ఆపైన విక్టోరియా దగ్గర కొన్ని గోరీలు కనబడేవి. "రెడ్ ఇండియన్లు వాళ్ళని చంపేశారు" అనేవాడు నాన్న. ఆచనిపోయిన వారిలో కొందరు నాన్నకి తెలుసు. తెల్లవాళ్ళూ, రెడ్ ఇండియన్లు కొట్టుకున్న స్థలాలు చూపెట్టేవాడు. జంక్షన్ సిటీనుంచి సాయంత్రం రైలులో తిరిగి వచ్చేవాళ్ళం. రైలుకోసం కాచుకునే కొద్ది గంటల్లోనూ బ్రూక్‌విల్లీ వింతలు చూసేందుకు వీలయేది. కాని ఆ వింతలకన్న గూడా రాత్రిళ్ళు నాన్న యంత్ర నిర్మాణంలో వున్నప్పుడు, దగ్గర కూర్చుని చూస్తుంటే ఒళ్ళు గగుర్పొడిచేది.

నాన్న తల వూపగానే, నిప్పు ఎగదోసే వ్యక్తి (ఫైర్‌మన్) పని కుపక్రమించేవాడు. ఇంజనులో నిప్పువేసే తలుపు తెరిస్తే భీకరశబ్దమయేది. పారతో అతను నిప్పుని ఎంతో నైపుణ్యంతో తోసేవాడు. బొగ్గుతునకలు కుప్పలు కుప్పలుగా మండుతున్న నిప్పు మధ్యకివెళ్ళి పడేవి. కళ్ళు జిగేలుమనే ఆ కాంతిలో మా అందరిముఖాలూ రెడ్ ఇండియన్ల ముఖాలకి మల్లే మెరిసిపోయేవి. నాన్న ఇంజనుకూతకి తాడు లాగి నప్పుడల్లా చీకటి మూలుగుతోందా అనిపించేది. ఇంజనులో చక్రాలు. మీటలు, త్రిప్పుతున్నా, లాగుతున్నా, నాన్న చేతికండరాలు వుబ్బడం కనబడేది. ఇంజను దీపాలకాంతి పసుపురంగులో ముందు కనపడుతున్న దోవని నాన్న చూస్తుంటే, ఆయన కళ్ళు మెరుస్తుండేవి. ఆయననే చూస్తూ బల్లమీద ముడుచుకు కూర్చునేవాడిని. అది అటూ ఇటూ వూగేది. ఇంజనులో మంట వేడి నా ముఖానికి తగిలేది.

నేను కొంచెం నిద్రమత్తులోవుంటే ఆమత్తు పోగొట్టడానికి నాన్న నాచేత గంటతాడు లాగనిచ్చేవాడు. ఒక్కప్పుడు కూతతాడు గూడా

లాగనిచ్చేవాడు. ఇంజనులో కూర్చుని ప్రయాణం చెయ్యడం ఆ ఇంజన్ని నడుపుతున్నవాడు నాన్న కావటంవల్ల ఇంజనుకన్న నేనే గొప్పవాడనని తెలుసుకోవటం, నాలో విచిత్రానుభూతిని కలిగించేది. ఆ పాత ఇంజను మా కానిసమటుకే. ఎల్లిస్‌కి తిరిగివచ్చాక ఇంజను దిగి వెళుతుంటే, ముఖం జేవురించి వుండేది. అందుకు కారణం సంతోష సమయంలో నవ్వుతూ వుండటమే.

జి. ఎ. ఆర్. చావడి స్కూలు భవనం క్రిందవుండేది. ఆ స్కూలు నాకు బాగా తెలుసు. నాకు పన్నెండేళ్ళప్పు డనుకుంటాను యుద్ధ సైనికులు కొందరు పిల్లలని చేర్చి నగారా వాయించే దండుగా తర్ఫీదు యిచ్చారు. మెమోరియల్ దినమున వారితోపాటు వెళ్ళటానికి మేము పనికి వచ్చేవాళ్ళం. పదిమంది కుర్రాళ్ళని ఏరుకున్నారు. అందరికీ నాన్న శిక్షణ యిచ్చాడు. మొదట్లో ఢంకామీద దెబ్బలు ఎక్కువ విరామంతో యిచ్చినా క్రమంగా నాన్న లాగే వడివడిగా కొట్టడం నేర్చుకున్నాను. నాన్న నాకు కొనియిచ్చింది అసలు నగారా కాకపోయినా, యుద్ధానికి తీసుకువెళ్ళేందుకు అనువుగానే వుండేది. నాన్న సైనికులకి మల్లేనిలబడటం నేర్పాడు. ఆరోజుల్లోని తర్ఫీదు ఫలితంగా చేతులు పక్కకిపెట్టి, పాదాలు దగ్గరగా పెట్టి నిలబడటం జీవితాంతం నాకు అలవాటయిపోయింది.

జి. ఏ. ఆర్. చావడి గోడలచుట్టూరా దగ్గర దగ్గరగా కుర్చీలు వేసే వారు. ప్రతి కుర్చీ దగ్గిర ఉమ్మివేసే పాత్రవుండేది. నీలిరంగు దారాల అంచుతో మిలమిలలాడే సిల్కు జండా నా హృదయాన్ని కదిలించివేసేది. దీంలో ప్రతిమూలా తుపాకీల కుప్పలు, మట్టిపట్టిన ఆల్చిప్పతునకలు వుండేవి. గోడలకి లింకన్, జనరల్ గ్రాంటు, తదితరుల పెద్ద పటాలు తగిలించివుండేవి. నగారా వాయించే దండుగానీ, నగారా మోతగానీ నన్ను యిట్టే ఆకర్షించేవి. చావడి చుట్టూ నాన్న వెనకాతలే తిరిగి తిరిగి వారక్తంలో నగారా దెబ్బల తాళం లీనమయింది. నాన్న నేలమీద కాలితో తడుతూ "ఒక్కడుగు, ఒక్కడుగు, ఒక్కడుగు" అంటున్న, నాన్న గొంతు యింకా వినిపిస్తున్నట్లే వుంటుంది ఇప్పటికీ.

మా వూళ్ళో చాలామంది రైల్వే కంపెనీ పనివాళ్ళు యుద్ధంలో పాల్గొన్నారు. అక్కడ వాళ్ళు అనుభవించిన కష్టాలన్నీ మరచిపోయారు. వూళ్ళో ఏదైనా వేడుక జరిగితే అందరూ సైనికదుస్తులు ధరించి, ఒకొరి కొకరు బిరుదులిచ్చుకు నేవారు. పాగాకు నములుతూ, తీరుబడిగా పాతశ్రుతులన్నిటినీ నెమరు వేసుకునేవారు. నాన్నకి అందులో చక్కటి నేర్పువుండేది. నాన్న నగారా మోగిస్తుంటే పాతశ్రుతులతో వాళ్ళందరి కళ్ళూ మెఱసేవి.

జూలై నాలుగో తారీఖు అలంకరణరోజున, జి. ఏ. ఆర్. సైనికులు వెళ్ళేటప్పుడు నగారాతో ముందు నాన్నా, వెనకాతల పిల్లలము మేమూ, మా వెనక చెవులు చిల్లులుపడే గానంతో మురళి వాయించేవారూ నడిచే వాళ్ళం. అలాటి సమయాలలో సంతోషం పట్టలేక ఉక్కిరి బిక్కిరయే వాణ్ణి.

నగారాతో సరియైన సంగీత జ్ఞానం రాదని అమ్మ వుద్దేశం. అన్నయ్య ఇడ్ మటుకు అటువంటి విషయాల్లో బాగా ఎదురుతిరిగాడు. కాని అమ్మ నన్ను వదలలేదు. వారానికొకసారి పియానో నేర్చుకునేందుకు మిస్. కార్టురైట్ దగ్గరకి పంపేది. నాకేగాక మా వూళ్ళో యింకా యిద్దరు కుర్రాళ్ళకి సంగీత జాడ్యం పాకింది. విచిత్రమైన వంపులతో 17 గుండ్రని బొత్తాములున్న రవిక తొడిగేది మిస్. కార్టురైట్. పియానో మీటలమీద మనసు కేంద్రీకరించలేనప్పుడు నా దృష్టి ఆ బొత్తాముల మీదికి పోయేది. కార్టురైట్ 12 మంది పియానో విద్యార్థినులలో క్లారా పోర్కరు అనే అమ్మాయే లేకుంటే, అన్న ఇడ్‌లాగే నేనూ తిరగబడి వుండేవాణ్ణి అని అనిపిస్తుంది.

ఎల్లిస్‌లోనూ తదితర పట్టణాల్లోనూ గోళీకాయ లాట ప్రచారంలో వుండేది. నాకు గోళీలాట బాగా వచ్చును. స్థానికంగా ఆ ఆటలో మొనగాడిని అని అనిపించుకున్నాను. స్కూలు ఆటల్లో అభ్యాసంవుండటం వల్ల చాలా మంది కుర్రాళ్ళకి పెద్దవాళ్ళ ఆటల్లో పాల్గొని గెలిచే నేర్పు వుండేది. రైల్వేకంపెనీ కార్యాలయాల దగ్గిరే ఆ ఆటలు సాగేవి. రైల్వే

కార్యాలయంలోని టెలిగ్రాఫు మిషను టకటకమనే గోల అక్కడికి వినిపిస్తూనే వుండేది. రైళ్ళు బయలుదేరకముందూ, తిరిగివచ్చేశాక, ఇంజనీర్లు, కండక్టర్లూ, ఫైర్‌మన్‌లు, బ్రేకులు వేసేవాళ్ళూ ఉబుసుపోక ఒక స్థలంలో గుమికూడేవారు. ఆ స్థలం మనుష్యుల అడుగుజాడలు దట్టంచేసిన బొగ్గు ముక్కలతో నల్లగా వుండేది. అప్పుడప్పుడూ ఆ గుంపులో ఫోర్టుహేస్‌లోని గొల్లపిల్లాడు, కాపు, సిపాయి కనుపించేవారు. నేలమీద ఇరవై అడుగులవలయాన్ని గీసేవాళ్ళం. దానిమధ్య ఒక్కొక్కళ్ళం ఇరవై గోళీల చొప్పున వేసేవాళ్ళం. తరుచు మేము 12 మంది ఆడుతుంటే, మిగతావాళ్ళు చూసేవారు.

ఎవరికి వారికి వారి యిష్టమైన గోళీ అంటూ ఒకటి వుండేది. ఆ గోళీ గాజుదికానీ, బంగారు రంగుని పోలినదిగానీ, కెంపు వర్ణందిగానీ అయి వుండేది. ఆ గోళీగుళ్ళే మా అదృష్టానికి కారణమని అనుకునేవాళ్ళం. వలయాకారంలోవున్న గీతనుంచి గోళీని వేసేవాళ్ళం. అసలు కిటుకంతా నిలబడడంలోనేవుండేది. నా గోళీని బిలియర్డ్సుబంతిక మల్లే ఆడించేవాడిని. గోళీని సూటిగా కొడితే ఒక్కొమ్మడిన వెళ్ళి ముందుకి పడేది. పెద్దవాళ్ళు డబ్బుకోసం ఆడేవారేమోగాని మేం పిల్లలంమటుకు ప్లాస్టిక్ "కీపర్సు" పందెం వేసుకునేవాళ్ళం. అందుకనే పెద్దవాళ్ళతో ఆడటానికి మేము ఇష్టపడేవాళ్ళం. వాళ్ళు గోళీలని డబ్బు పెట్టి దుకాణంలో కొనేవారు.

పెద్దవాళ్ళతో ఆడిగెల్చుకున్న గోళీలతో మేము ఆడుకునేవాళ్ళం. చిన్నతనంలో ఎప్పుడూ నేనూ ఇడ్ డబ్బుపెట్టి గోళీలు కొని ఎగగము. అటువంటి విషయాల్లో మాకు జర్మనుదేశస్థుల పొదుపుతనం అలవడింది. ఆ గుణం అమ్మదగ్గిరనుంచే వచ్చింది. నిజానికి అమ్మ జన్మస్థలం మసౌరీలోని రోచకపెడేఅయినా, ఆమె భావాలూ, అభిరుచులూ అన్నీ జర్మనుదేశస్థులవే. నాన్నకి మొదటించీ జర్మను భాష రాదు. నాన్న చుట్టుపక్కలలేనప్పుడు అమ్మ మాతో జర్మనులో మాట్లాడేది. పిల్లలందరమూ జర్మను భాష అర్థంచేసుకుని ఆమెతో మాట్లాడగలిగేవాళ్ళం. ఇప్పుడు దాదాపు జర్మను భాష అంతా మరచిపోయాను. ఒక్క విషయం జ్ఞాపకముంది. వాత్సల్యం పొంగినప్పుడు మటుకు అమ్మ జర్మను భాషలోనే మాట్లాడేది.

ఇటీవల 1936 వ సం॥లో ఆసురాలు కాలంలో పురావస్తువులని వెదుక్కుంటూ ఒక రోజు సరగోటా దగ్గిర ఒక యింట్లోకి వెళ్ళాను. అక్కడ ఒక పింగాణీ అబిలో ఓ కార్డు కనుపించింది. దానిమీద పూలున్నాయి. ఒక్క క్షణం మళ్ళీ నేను 12 ఏళ్ళ పిల్లాణ్ణయిపోయినట్లనిపించింది. ఆ కార్డుల సువాసన నా గతాన్నంతా జ్ఞప్తికి తెచ్చింది. నేను యిచ్చిన పూలకార్డులు చూసి ఆనందం వెలిబుచ్చిన అమ్మ కంఠం వినిపించినట్లే అయింది.

ధాన్యం తప్ప మిగతా వస్తువులన్నీ తపాలా ద్వారానే ఎల్లిస్‌కి వచ్చేవి. ప్రతి సంవత్సరం తూర్పుకి 5 సెంట్లు స్టాంపులు పంపి, వస్తువుల జాబితాను తెప్పించుకునేవారం. ఇంతేగాక పత్రికల్లోని ప్రకటనలు చదివి ఇతర చోట్ల సరకులని గురించి తెలుసుకునేవారం. మా వూళ్ళో ఎన్నో పత్రికలుండేవి కాని "ది సైంటిఫిక్ అమెరికను" అనే పత్రిక నాకు చాలా నచ్చేది. కార్డుల ప్రతినిధి కావాలంటూ ఏ పత్రికలో ప్రకటించారో గుర్తులేదుకాని అమ్మమటుకు నావంక ఆవేళ గర్వంగా చూసి. నావ్యాపారానికి నేను బోణీ చేస్తానన్నది.

అమ్మ ఏరుకున్న కార్డుకి అంచున గుల్లచేపల బొమ్మవుంది. అది సరిగ్గా ప్రేయసి ప్రియునికి పంపేదాని మల్లేవుంది. దట్టమైన తెల్లని కార్డు మధ్య కాయితంతో చేసిన రంగుల అల్లిక మెఱుస్తూవుంది. రంగుపూల మధ్యనుంచి అతి నాజూకుగా వున్న యిద్దరు స్త్రీలచేతులు కనబడేవి. ఒకామె చేతికి బంగారు దారాల పోగుతో చేసిన కంకణముంటే, రెండో ఆమె చేయి, ఆకులు. రెండు ఎఱ్ఱ గులాబీలు. గులాబీ మొగ్గ అల్లికల మధ్య మెఱిసిపోతూ వుండేది. కరచాలనం చేస్తున్న ఆ స్త్రీల చేతులు, పూలు, గమ్యంగా వుండేవి.

వ్యాపారం ఎక్కువయే సమయానికి కొన్ని మోస్తరని సిద్ధంగా వుంచుకున్నాను. అమ్మలాగే ఎల్లిస్‌లో ఇతర స్త్రీలందరూ అవి కొనటానికి వచ్చారు. అన్నిట్లోనూ ప్రత్యేకంగా ఉన్న కార్డు నాకు జ్ఞాపకముంది. దానిమీద ఎఱ్ఱరిబ్బనూ, "సమస్త సౌఖ్యాలు నీవే అవుకాక" అనే అక్ష

రాలు వున్నాయి. పసుపుపచ్చని పూలతో చుట్టిన గుఱ్ఱపులాడాన్ని పట్టుకున్న ఒక నీలిరంగు చేయివుండేది. ఆ కార్డుమీద చిహ్నంమటుకు సామాన్యమైనదేయని నా వుద్దేశం. ఒకో కార్డులో సింధూరపు ఆకుమీద "నేను ప్రేమించిన వ్యక్తికి" అని రాసివుండేది. ఆ ఆకు చుట్టూ కలువపువ్వులూ, పచ్చని ఆకులూ వుండేవి. దాని మోస్తరు చూస్తే ప్రియుడు ప్రేయసికి పంపేదనిపించింది. కానీ ఎల్లీస్ పట్టణంలో ఆ కార్డు కావలసిన ప్రియుడు ఎవడూలేడు. ఒక్క కార్డుమీద మటుకు "జాన్. బి. హార్టు" అనే పేరు ఓ మూల చిన్నదిగా వ్రాసివుంది. మూడు పచ్చని కోడిగుడ్లున్న ఒక పిచ్చికగూడు ఆ పేరుని కప్పేసివుంది. ఆ చిత్రం యొక్క చిహ్నం ఏమిటో పరమాత్ముడికే తెలియాలి. కాని నిజానికి అటువంటి వాటిని కొనే వ్యక్తిమటుకు మా వూళ్ళోలేడు. నిస్సందేహంగా అది స్త్రీలకు పంపబడేదే.

మా వూరి ప్రజల సామాజిక జీవితాన్ని అభివృద్ధిచేయటానికి నేను ప్రయత్నించలేదు. నాకు కావలసిన కలకండ వగైరాలు కొనటానికి కొంత డబ్బు చేసుకున్నానంతే. తరువాత వెండిసామాన్లు విక్రయించే వ్యక్తి కావాలనే ఒక ప్రకటన నన్ను ఆకర్షించింది. అప్పటినుంచీ ఎల్లీస్‌లో యింటింటికీ నల్లని తోలుసంచీ పట్టుకు హాజరయేవాడిని. సంచీ తెరుస్తే చాలు వస్తువులన్నీ అమ్ముడుపోయేవి. ఆసంచీ మూత తెల్లని పట్టుబట్టతో కుట్టివుంది. లోపలంతా ఎఱ్ఱని ముఖమల్ గుడ్డతో కుట్టిన అరలున్నాయి. వాటిలో మూడు గరిటెలూ, కత్తులూ వుండేవి. అక్కడి ఆడవాళ్ళు ఆహారం కంటెగూడా ఎక్కువగా ఆ సామాన్లని కోరేవారు. నాలుగయిదు రోజులలో కొందరికి దాదాపు నాలుగు పెట్టెల వెండిసామాన్లు అమ్మేవాడిని. కాని నాకు పోటీ తప్పలేదు. అందుకని అమ్మే పోరువల్ల మరో రకం చిల్లర వ్యాపారం లోదిగాను. పాలు అమ్మడం ప్రారంభించాను.

పగలూ, రాత్రీ పాలు పితికేవంతు నేనూ అన్నయ్యా చూచుకునేవారం. కాని అన్నయ్య నాకంటె బాగా పెద్దవాడవటంవల్ల, తను నిర్లక్ష్యం చేసే పనులన్నీ నా పాలబడక తప్పలేదు. అలా కాకుంటే దెబ్బలు తినవలసివచ్చేది. తరుచు వాడు నాచేత బండచాకిరీ చేయించేవాడు. అందువల్ల అమ్మకి నేను బాగా సన్నిహితుడను అయాను. నాకూ అన్నయ్యకీ

మధ్య ఓ అబ్బాయి వుండవలసింది. కానీ నేను పుట్టకముందే వాడు చని పోయాడు. మా కుటుంబంలో మిగిలిన సంతానమల్లా చిన్ని చెల్లాయి ఇరేన్ మటుకే. అందుకని ఇడ్ అమ్మ దెబ్బలకి భయపడవలసిన అవసరం లేనంత పెద్దనాడవుతూనే, ఆవుపాకలు శుభ్రంచేయటం, గడ్డి కోసుకు రావటం, పారిపోయిన ఆవుల్ని తోలుకురావటం, వాటికి పాలుతీయటం మొదలైన పనులన్నీ నావంతు అయాయి. అంతేకాదు ; పాలూ, మీగడా కూడా అమ్మేవాణ్ణి.

ప్రతి ఉదయం పాలుతీయడంతోనే యింటింటికీవెళ్ళి యిచ్చేవాణ్ణి. పెద్ద తగరపు తొట్టినిండా పాలుపోసుకు నేవాణ్ణి. ఒక్కొక్కరికి తగరపు పాత్రతో పాలుకొలిచి యిచ్చేవాణ్ణి. వాళ్ళలో ఎవరైనా మీగడ అడిగితే మళ్ళీ వెళ్ళవలసివచ్చేది. నాకు బండీ వుండేదికాదు. ప్రతిగాత్రీ దాదాపు రెండుశేర్లు పాలు అమ్మేవాణ్ణి. మొదట మా దగ్గిర మంచు గడ్డలుండేవి కావు. కనుక అమ్మ గది చల్లగా వుండటంవల్ల, పాలూ, మీగడా, వెన్నా, జాగ్రత్తగా అక్కడ పెట్టేవాళ్ళం.

జీతాలిచ్చే రోజువరకూ ఎల్లీస్‌లో ఎవరూ డబ్బు చెల్లించేవారుకారు. నా లాగు వెనకపక్క జేబులో ఒక చిన్న లెక్కల పుస్తకంలో ఖాతా దారుల బాకీలన్నీ వ్రాసివుంచేవాణ్ణి. ఒకటోతారీఖున పావుశేరుకి నాలుగు సెంట్ల చొప్పున బాకీలు వసూలు చేసేవాణ్ణి. అందులో కొంత భాగం అమ్మ నాకు బహుమతిగా యిచ్చేది.

ఇంట్లో చాకిరీ, చిల్లర వ్యాపారం, పనులూ వున్నా నేను బయట బాగా తిరగడంకద్దు. ఈ రోజుల్లోనూ కుర్రాళ్ళు దెబ్బలాటుకుంటున్నా రేమో గాని మా రోజుల్లోలాగ కాదని నా వుద్దేశం. స్కూలు ఆవరణలో మధ్యాహ్నం విరామసమయంలో ఆ 15 నిముషాల్లో మేము తరుచు నాలు గయిదుసార్లు గుద్దుకునీ తన్నుకు నేవాళ్లం. పొగరుబోతు కుర్రాడైతే కుక్కపాట్లు తప్పవు. చాలామంది కుర్రాళ్లు అది తట్టుకోలేక పారి పోయారు. సమానస్థాయిలో మళ్లీ కొట్టగలిగితే ఎక్కువ దెబ్బలు తినక్కర లేదు. నిజానికి ఎల్లీస్ వాతావరణం బాగుండేది కాదు. కాన్‌సాస్‌లో

అన్ని చట్టాలకన్నా ముందు మద్యనిషేధం అమలు జరిపారంటే నాకేమంత ఆశ్చర్యంగా లేదు. రైల్వే పనివాళ్లు జీతాలొచ్చే రోజునా, పశువులమీద ఆదాయంవచ్చే కొద్దిమాసాల్లోనూ ఎల్లిస్‌లోని కల్లుదుకాణాల్లో చేపలు వలలో చిక్కుకున్నట్లుగా చిక్కుకునేవారు.

ఆట్టే జనసంచారంలేని చిన్న సందుల్లో దీపాలకు మల్లే వుండేవి ఆ కల్లు దుకాణాలు. ప్రతి దుకాణం చుట్టూ కొయ్యచట్టాలుండేవి. వాటి చుట్టూ చాలా అలసటతో నడుములు వంగిన గొల్లవాళ్ల గుర్రాలు ప్రక్క ప్రక్కగా నిలబడి వుండేవి. పిలికపండలంతా ఇళ్లల్లో వుండవలసిన సమయం అది. కాని ఆ గిత్తల చప్పుడూ. సారాయి తాగాలనే దుబలాటంతో వారు ఎల్లిస్ వైపు పరుగెత్తే హడావడి చూడటం పిల్లలకి బలే సరదాగా వుండేది. వాళ్ళందరూ బాగా సారాయి త్రాగి, స్టేషనులో నిలబడ్డ వారి టోపీలని తుపాకీలతో ప్రేల్చేవారు. రెండు మూడు దుకాణాల ముందు తుపాకీలు పేల్చి, గుర్రాలని తీసుకుని బుగడగొచ్చులో వీధుల వెంబడి వెళ్ళిపోయేవారు. వాళ్ళు పురుషులకంటె స్త్రీలనే ఎక్కువ గౌరవించేవారు. కొన్ని సమయాలలో హత్యలు జరిగేవి. కాని అవి నేను చూడలేదు. గుర్రాలమీద పోతున్నప్పుడు వారి పట్కా అరలోంచి కిందపడిపోయిన తుపాకీ తూటాలని ఏరుకునేవాళ్ళం. అదంతా మా పిల్లలకి బలేసంతోషంగా వుండేది. నాకు ఒక నిండు పొగాకు డబ్బీ దొరికింది. ఇంట్లో పశువుల ధర్మమా అని నాకు మట్టుకు వాళ్ళలాగా తయారవాలని అనిపించేదికాదు. కాని బాగా మొరటుగా తయారవాలని నిర్ణయించుకున్నాను.

నిజానికి ఎల్లిస్‌లో చాలా తొందరగా నాగరికత పెంపొందటంవల్ల, నేను మొరటుదేలలేదు. మొదట్లో మేము మొరటుగానే వుండేవాళ్ళం. వీధిలో ప్రక్కన గట్టుకట్టక పూర్వం, అడుగుపెడుతూనే బురద తగిలేది. గేదె మాంసం అమ్మే కసాయి దుకాణం తర్వాత వచ్చింది. అన్నిటికన్నా ముందు ఒక బొగ్గులకొట్టు ప్రారంభమయింది. ఎవరో ఆ దుకాణానికి పోటీగా మరో దుకాణం పెట్టారు. తర్వాత ఒక కిరాణా దుకాణము ప్రారంభమైంది. చిట్టచివరకి మా వూరికీ ఒక తపాలా కార్యాలయం వచ్చింది. పచ్చిక బయలులో క్రమంగా వీధులు వెలిశాయి. 1889 వ సం॥

ప్రారంభంలో అంటే నాకు పధ్నాలుగేళ్ళు దాటిన తర్వాత నాన్న రెండంతస్తుల మేడ కట్టాడు. ఆ మేడలో వాకిటిముందు చక్కటి వసారా, బాగా వెలుగుపడే కిటికీలూ, గులకరాళ్ళ నేల వుండేవి. ఇంటి చుట్టూరా కొయ్య కంచె వుండేది. అక్కడ పూలమొక్కలు గుబురు గుబురుగా పెరిగాయి. నాన్న నాటిన గంగిరేణిచెట్లు కూడా పెద్దవిగా పెరిగి అల్లుకున్నాయి.

ఎల్గిన్‌లో బావి లోతు చూసే సీసపు గుండ్లులేవు. నాన్నే మొట్ట మొదట నీటిసౌకర్యం ప్రవేశపెట్టాడు. తర్వాత వంటయింటికి కెదురుగా స్నానాలు తొట్టికోసం ప్రత్యేకం ఒక గదిని నిర్మించాడు. కొయ్యపెట్టెకి రాగిరేకు కొట్టి రెండువైపులా ఏటవాలుగావున్న స్నానాల తొట్టిని స్వయంగా చేశాడు. ఆ తొట్టి అడుగుభాగమంతా పలకలు పలకలుగా వుండేది. రంగు వేసిన తర్వాత ఆ తొట్టిని చూసి ఇరుగుపొరుగూ ఈర్ష్య పడ్డారు. అంతవరకూ వంటింట్లో వున్న ఒక కొయ్య స్నానాలు చేసేవాళ్ళం. పెరట్లో గోడచావడిలో మూడు అడుగులూ. నాలుగు గుణాలు బొగ్గులకొట్టు గదీ వుండేవి. మా యింటి వెనుక పక్క తలుపులు నేను లట్టే ఉపయోగించేవాడిని కాదు. బండచాకిరీనుంచి తప్పించుకుని పారిపోవటానికీ, తాత్కాలికంగా సుఖం పొందటానికీ ఆ దారి పనికివచ్చేది మా అందరికీ. అమ్మ చీకటిపడిన తర్వాత బైటికి పోకూడదని శాసించింది. రాత్రిళ్ళు ఎప్పుడైనా ఆడుకోవటానికి పారిపోతే యింటికి వస్తూనే నాకూ ఇడ్‌కీ దెబ్బలు తప్పేవికావు. అమ్మ ఆ విషయాల్లో చాలా కఠినంగా వుండేది. ఒక్కొక్కప్పుడు సాయంత్రం రైలు ఎక్కేసి, పదమూడు మైళ్ళ దూరంలోవున్న హోప్‌కి వెళ్ళిపోయేవాళ్ళం. పెరటి గుమ్మంలోంచి తిరిగి వచ్చినా అమ్మ తప్పకుండా వంటయింట్లో మాకోసరం కాచుకునుండేది. ఒక చేతిలో దువ్వెనవుండేది. ఇంకో చేతిలో గట్టిగా మా కంఠాన్ని పట్టుకునేది. అయినా కొంతెప్పుడు అలా పట్టుబడటం కూడా తమాషాగా వుండేది.

జీవశాస్త్రజ్ఞుడెవరైనా కొత్తగా మా వూరువస్తే, ఇంటికొక్కటి చొప్పున వీధులలో వరుసగా కనబడే చిన్న చిన్న కట్టడాలని చూసి దైవ పీఠాలని అనుకునుండేవాడు. అవి దేవ పీఠాలే అయితే మేము నిజంగా

విధ్వంసకులమే. ఎందుకంటే పుణ్యాదినాన ఎల్గిన్ పట్టణవీధులన్నీ తెగ తిరుగుతూ. నిర్మానుష్యంగా వున్న యిళ్ళన్నింటినీ దోచుకు నేవాళ్ళం. మా జట్టులో ఎవరైనా అలాంటి కొంటెపనులు చేస్తే, హూరేషియో· అల్జర్ లాంటి ఘనుడుగా మేము అంగీకరించే అవకాశం ఇక ఆ జన్మకుండేదికాదు. నేను ఎప్పుడైనా అలా ప్రవర్తిస్తే, ఆదివారాలు మెథాడిస్టు చర్చినుంచి యింటికి రాగానే "ఆ బట్టలు విప్పెయ్యి" అనేది అమ్మ ఎప్పుడూ. బట్ట లతోపాటు పాపం గూడా వదిలిపోతుంది కాబోలు.

మా బట్టలన్నీ అమ్మే కుట్టేది. అది అమ్మ హక్కు. చెల్లాయి చొక్కాలు కుట్టేది. మా మేజోళ్ళు అల్లేది. తర్వాత కాళ్ళు కనుపించ కుండా పొడుగుపంట్లాములు వేసుకునేంత పెద్దవాణ్ణయాక నాన్న పాత పంట్లాముగుడ్డతో నాకు ఒక జత పంట్లాము తయారుచేసింది. నాన్న పాత జత కుట్లు విప్పి. గుడ్డ తిప్పేసి. నా కొలతకి కత్తిరించి కుట్టింది. అని తొడుక్కుంటే నాకెంతో గర్వంగా వుండేది. మా బట్టలకోసం. భోజనం కోసం అమ్మ ఎంతో చాకిరీచేసేది. బకాసురుడిలాగు మేము బాగా తినే వాళ్ళం. అమ్మకి శనివారమంతా వంటపనితో సరిపోయేది. ఆ రోజంతా నేనూ ఇడ్ ఆమెకి సాయం చేయవలసివచ్చేది. నేను ఉన్నత పాఠశాలలో చేరేనాటికి ఇడ్ యింటి పనుల్లోంచి విముక్తిఅయి వుద్యోగంలో చేరాడు.

కాన్సాస్‌లోని సామాన్య వ్యక్తులకు మల్లే ఇడ్ గూడా చాలా చురుసుగా తయారయాడు. మా వూళ్ళో చాలామందికంటె అన్నయ్య ఎక్కువ డబ్బు చేసుకోగలిగాడు. కాని కర్మాగారంలో తర్ఫీదుపొంద టానికి కొన్ని అవకాశాల్ని వదులుకున్నాడు. ఇడ్ ఒక వృత్తి నేర్చు కోవటానికి పూనుకున్నాడు.

కుర్రాడు అల్లరిచేయకుండా వుండాలంటే, పనిలోకి దింపాలని మా వూళ్ళో వాళ్ళందరి అభిప్రాయము. గుర్రాల విషయమూ అంతే అనేవారు. పనిలేనప్పుడు, గంతులేసి, తన్నుకునీ గొడవచేస్తాయి గుర్రాలు. అలాగే పిల్లలూ అల్లరిచేస్తారు. పధ్నాలుగేళ్ళప్పుడు నాన్న నాకు ఒక తుపాకీ యిచ్చాడు. రైల్వే కర్మాగారంలో నాకు సరిపోయేటట్లు దాన్ని తగ్గో

యించాను. నేను గురితప్పకుండా తుపాకీ బాగా పేల్చేవాడిని. అందరి లాగా తుపాకీలో గుండ్లు స్వయంగా పెట్టుకునేవాణ్ణి. తరువాత క్రిస్టమస్ బహుమతిగా నాన్న ఒకసారి పన్నెండు ఇత్తడి గుండ్లు యిచ్చాడు. నాన్న మమ్మల్ని దయగా చూసేవాడు. కాని తల్లితండ్రులు అహోరాత్రులు పనిచేసి. కొడుకుల్ని బడుద్ధాయిల్లా తిరగనిచ్చి. దయతల్చాలి అనుకునేంత మూర్ఖుడు మటుకు కాదు మా నాన్న. అన్నయ్య వృత్తిలో తర్ఫీదు పొందుతున్నప్పుడు నేను ఉన్నతపాఠశాలలో చదువుతున్నాను. కాని వేసంగి సెలవులు ప్రారంభించగానే ఒక వుద్యోగం దొరికింది నాకు.

జార్జ్ హెండర్సను అనే వ్యక్తి తేయాకును పండించే విత్తనాల దుకాణం పెట్టుకున్నాడు. చుట్టుపక్కలంతా రెండుచక్రాల బండిని తోసుకుంటూ అతను సరకులు యిచ్చేటప్పుడు, భార్యని గల్లాపెట్టెదగ్గిర వుంచవలసివచ్చేది. సరకులిచ్చే కుర్రాడిగా నేను పనిచేస్తానంటే, నెలకు పది డాలర్లు యిచ్చి నన్ను పెట్టుకున్నాడు. పొద్దుట ఆరుగంటలకి పనికి వెళ్ళితే రాత్రి పదిన్నరకి తిరిగివచ్చేవాడిని. సాధారణమైన పలకగల్లా పెట్టెతో దుకాణము చాలా పెద్దదిగా వుండేది. సరుకంతా కొయ్యపెట్టె లోనూ. పీపాలోనూ ఉండేది. పొగాకు దగ్గిరనుంచీ అన్నింటినీ త్రాసుతో తూచి అమ్మేవాళ్ళం.

మరుసటి సంవత్సరం ఉన్నతపాఠశాల విద్య పూర్తికాగానే, మళ్ళీ హెండర్సన్ దుకాణంలో చేరాను. నెలకి పధ్నాలుగు డాలర్లు యిచ్చేవాడే గాని నాకు అన్ని గంటలు పనిచేయటం యిష్టం వుండేదికాదు. ఆ పనిలో నాకు భవిష్యత్తు వుందనిపించలేదు. సంపాదించే డబ్బూ నాకు తృప్తినివ్వ లేదు. దుకాణము వదిలిపెట్టి యంత్రశాస్త్రం నేర్చుకోవాలని అనుకున్నాను. అందుకు ఇడ్ కి నామీద చాలా కోపము వచ్చింది.

"ఒక కుటుంబంలో ఒక్క యంత్రశాస్త్రజ్ఞుడు చాలు. నీళ్ళ కొగులుచేయటం నేర్చుకో రాదూ?" అని అరిచేవాడు.

"నాకు ఆ పని చేయటం ఇష్టంలేదు" అని మళ్ళీ కేకపెట్టేవాణ్ణి.

నాన్న నన్ను యింకా పైచదువులకి వెళ్ళమన్నాడు. మా వూళ్ళో ఒక డబ్బుగల వర్తకుడు తన కొడుకుని క్వీన్స్‌లోని క్వీన్స్ కళాశాలకి పంపటానికి నిశ్చయించుకున్నాడు. తన కొడుక్కి ఇంటి బెంగపట్టుకోకుండా వుండేటందుకు, ఎల్లాగైనా నాన్న నన్నూ పంపేటట్లు చేసాడాయన. కళాశాల అంటేనే నాకు గిట్టదు. అంగుళో ఆ అభ్యాయంటే అంతకంటే గిట్టదు. వెళ్ళనని ఇంటి దగ్గిర వాదించాను. నిజానికి నాన్న మెత్తపడేంత వరకూ చాలా పోరుపెట్టాను. చిట్టచివరకి నాన్న ఇలా అన్నాడు. "నే చెప్పేది ఒకటే. నువ్వు యంత్రశాస్త్రం మటుకు నేర్చుకోలేవు. నేను అంగీకరించేంతవరకూ నువ్వు తర్ఫీదుకి వెళ్ళటానికి వీల్లేదు. ఆ పనికి మటుకు నిన్ను ఎన్నడూ ప్రోత్సాహించను." ఆ మాటలతో నాకు పిచ్చెక్కినట్లయింది.

దుకాణానికి వెళ్ళి కసవు వూడ్చేవాడి పని సంపాయించటంలో కృతకృత్యుడనయ్యాను. పద్నాలుగు అంగుళాల పొడుగున్న కొయ్యపలకతో ఏర్పరిచిన నేల అది. బద్దలు బద్దలుగా వున్న పలకలమధ్య రెండూన్నర అంగుళాల లోతున దట్టంగా జిడ్డువుండేది. నేను చాలా పట్టుదల వున్న వాణ్ణి. ఇదివరకెన్నడూ శుభ్రం చేయనివిధంగా దుకాణాన్ని వూడ్చేవాడిని. ఇంజను కొంగుగొట్టాలని శుభ్రంచేసే మురికిపనిని గూడా నేను చేయవలసిందే. ఆ ఇనుపగొట్టాలనిండా దట్టంగా మసి అతుక్కునుండేది. ఒక్కొక్క గొట్టం పదహారు అడుగుల నిడుపువుండి, నూటయాభై పౌనులు బరువుండేది. ఏడెనిమిది వందల అడుగుల దూరంలోవున్న గుడిసె దగ్గిరకి గొట్టాలని బుజం మీద వేసుకుని ఈడ్చుకొని వెళ్ళవలసివచ్చేది. శుభ్రం అయేంతవరకూ అవి అక్కడే పడుండేవి. తర్వాత అంచులని తీసివేసి వాటిని కొత్తగా చేసేవారు. కొంగు గొట్టాలని మోసుకెళ్ళటం, కసవు వూడ్చేపనీ, యితరపనులూ నౌఖరుకి మల్లే చేసేవాణ్ణి.

కానీ ఆ పని నాకు ఇష్టంగావుండేది. యంత్రాలు పనిచేస్తుంటే చూడటం సరదాగా వుండేది. యంత్ర నిర్మాణంలో పరిచయమున్న యంత్ర శాస్త్రజ్ఞులని చూస్తే అసూయకలిగేది. పనిముట్లని పట్టుకోవటమంటే యిష్ట పడేవాణ్ణి. నౌఖరునే అయినా యింట్లోంచి పనిముట్టేదైనా తెచ్చి, పెద్ద

మీద పదును పెట్టడానికి అనుమతించేవారు. ఆ పని ఎల్లిస్‌లో ఎవరైనా చెయ్యటానికి వీలుంది. అంతెందుకు! నేనొకసారి సన్నెకల్లు దగ్గరవుండగా, ఒక రెడ్ ఇండియన్ వచ్చి వేటకత్తిని పదునుబెట్టుకెళ్ళాడు.

రోజుకి పదిగంటలు పనిచేసేవాడను. కంపెనీవారు ఒక డాలరు యిచ్చేవారు.

ఆరునెలల తర్వాత ఎడ్గార్ ఈస్టర్‌బ్రూక్ అనే పెద్ద యంత్ర శాస్త్రజ్ఞుడి పరిచయం చేసుకుని, అతని సహాయము కోరినాను. కొన్ని రోజుల తర్వాత అన్నయ్య ఆయన కూతుర్ని వివాహం చేసుకున్నాడు.

"నీకు తర్ఫీదు పొందాలని వుందా?" అడిగాడు ఎడ్గార్.

"అవునండీ."

"సరే వాల్ట్. ఇలాంటి అవకాశం కోరే హక్కు ఇక్కడ నీకు ఒక్కడికేవుంది. ఇక్కడి వాళ్ళందరికీ నువ్వంటే యిష్టము. ఇబ్బంది పెట్టకుండా పని బాగా చేశావు. నేను ఏమిపని చేస్తానో చెబుతాను విను. ఈ విషయమై మీ నాన్నతో మాట్లాడతాను. అదీ నీకు తప్పక యంత్ర శాస్త్రజ్ఞుడను కావాలి" అనే కోరికవుంటే.

"అలాగేనండీ. నాకు యంత్రశాస్త్రజ్ఞుణ్ణి అవాలనివుంది" అన్నాను.

నేను బాగా చిన్నవాణ్ణి. ఆత్మవిశ్వాసం పూర్తిగావుంది. కాని నాలో కలిగిన ఆతురతతో వణికిపోయాను.

ఈస్టర్‌బ్రూక్ నాన్నని ఒప్పించాడు. నాలుగు సంవత్సరాలు కర్మాగారంలో తర్ఫీదు కావాలి. మొదట్లో గంటకి నాలుగుసెంట్ల చొప్పున జీతం యిచ్చేవారు. అంతకంటె సదవకాశం ఎవరికి దొరుకుతుంది?

---

# తర్ఫీదు - నా ఆశయాలు

ధూమపరిణామాన్ని కొలిచే యంత్రమొకటి మా కార్యాలయంలో వుండేది. అర్ధశతాబ్దానికి పైగా అది నాన్నకి రక్షగావుంది. ధూమ యంత్రాన్ని నడిపే వ్యక్తికి చేతి గడియారానికి మల్లే అది చాలా ముఖ్యం. దాని చక్రం వెండిమల్లే మెరిసే లోహంతో చెయ్యబడింది. ముల్లుపైన అద్దంమూత వుండేది. నాన్న జీవితమంతా దానిమీదే ఆధారపడివుండేది. నాన్నే ఏమిటి ఇంకా చాలామంది జీవితాలు దానిమీద ఆధారపడేవి. నాన్న దానిని తరుచు పరీక్షచేయించి భద్రపరిచేవాడు. నాన్న చనిపోయిన తర్వాత ఆయన వస్తువుల్లో అది చెల్లాయి ఇరేన్ కి కనుపించింది. పశ్చిమ ప్రాంతంలోవున్న ఇరేన్ దాన్ని నాకు పంపించింది. నాన్నకి అత్యంత ప్రీతికరమైన పనిముట్టు అది. కాని ప్రస్తుతం నాకుమటుకు గతాన్ని కళ్ళకు కట్టినట్లు జ్ఞప్తికి తెచ్చే ఒక స్ఫటికపు బంతి అది.

ఎక్కడో దూరాన కాన్సాస్ పచ్చికబయళ్ల దిక్చక్రము వైపుగా. ఎల్లీస్ నుండి వస్తున్న నాన్న ధూమయంత్రం ఈల గాలిలో కలసిపోయి. లీలగా వినిపిస్తూందా అనే భ్రమకలిగేది ఎప్పుడైనా ఆ పనిముట్టుకేసిచూస్తే. అదేం మాయో! రాత్రి జన్క్షన్ సిటీనుంచి ఎల్లీస్ కి నాన్న రైలు రాగానే ప్లాటుఫారంమీద జనం గుంపులు గుంపులుగా కూడడంకూడా కళ్ళకు కట్టినట్టు కనుపించేది. గుఱ్ఱపు రౌతుకి గుఱ్ఱమెలాగో మా నాన్నకి ఆ యంత్రమట్లాటిది. ఆయన శక్తిసామర్థ్యాలనీ, తెలివితేటలనీ ఆ యంత్రమే చాటేది. అదే నాన్నకి రక్షరేఖ. గర్వకారణం. ప్రీతికరమైనది. ఒక్కొక్కప్పుడు. ఆ దృశ్యం నా మనః ఫలకంముందు మరో రూపంలో కనబడేది. ఇంజను గొట్టంలోంచి నెమ్మది నెమ్మదిగా పొగవస్తూంటే, రైలు దగ్గర ఇంజను చక్రాల క్రింద గొయ్యిలో పనిచేస్తున్నాను. నా ముఖమంతా మసితో నిండివుంది. చేతులు మసితో నల్లగావున్నాయి. అప్పుడు నేను యువకుణ్ణి. సన్నగా వుండేవాణ్ణి. టిక్ క్రీక్ వంతెన చేరేముందు నాన్న రైలు కూత నిజంగా మళ్ళీ వినిపిస్తే బాగుండును అని ఎన్నోసార్లు అనిపించింది. కొన్ని రాగాలు వింటేగూడా నాకు విచిత్రమైన సంగతులు జ్ఞాపకమొచ్చేవి.

ఫేఫ్తు ఎవెన్యూ మీదుగా వెళ్ళే సంగీత వాయిద్యగాళ్ళు వినిపించే మధుర గానం నా మనసులోని అనేక విషయాలని స్పృశించేది. బాల్యంలోని నా అనుభవాలని గురించి ఆలోచించటం మొదలెట్టేవాణ్ణి. రైల్వే కర్మాగారంలో నేను తర్ఫీదుపొందటం, వాయిద్యగాళ్ళతో చేరి ఒక బాకా వాయించటం. బేస్ బాల్ ఆటగాళ్ళ జట్టుతో బంతి ఆడటం, ఆదివారం సాయంకాలాలు డెల్లా ఫోర్కురుతో బిగ్ క్రీక్ వంతెనకి వెళ్ళటం, ఒకొ్కటొక్కటే నా మనోనేత్రంముందు కదిలేవి.

యూనియన్ పెసిఫిక్ కర్మాగారంలో శిక్షణపొందటం అంటే మాటలా! ఆ రోజుల్లో నాకు చాలా గర్వంగా వుండేది. రోడ్డుమీద పోయే ప్రతి ఇంజను బండీ దీపాల పక్కనవుండే ఒక డాలు, దానిమీద ఒక జత కొమ్ములు మా కంపెనీ గుర్తులు. పశ్చిమ ప్రాంతాన్నంతా ఏక జాతిగా చేసిన ఆ పెద్ద కంపెనీలో శిక్షణ దారుడనని తెలిపేందుకు నాకూ ఒక గుర్తువుంటే బాగుండేది. ధూమయంత్రానికి సంబంధించిన సమస్త విషయాలు మాకు బాగా తెలుసు. నా ఊహాశక్తిని పూర్తిగా వాటిమీదే కేంద్రీకరించేవాణ్ణి.

శిక్షణదారుడిగా చేరిన తర్వాత నామీద నాకే గౌరవం పదిరెట్లు ఎక్కువయింది. ఆ కంపెనీలో చేరడానికి చాలా కష్టమైన పరీక్షలో ఉత్తీర్ణుడు కావాలని ఎల్లిస్‌లో అందరికీ తెలుసు. కొంతమంది కుర్రాళ్ళు పరీక్షలో తప్పేవారు. ఆల్‌జీబ్రా లెక్కలు నాకు బాగా తెలిసివుండటం వల్ల పరీక్షలో తొందరగా ఉత్తీర్ణుడనయాను. జార్జి హెండర్సన్ దుకాణములో జమా ఖర్చులు తయారుచేసేటప్పుడు అతనికి తోడ్పడేవాడిని. అప్పుడు ఆల్‌జీబ్రా నాకు బాగా తెలిసింది. మేము ఇల్లు కట్టుకునేటప్పుడు కూడా లెక్కలు వేసేవాడిని. యూనియన్ పెసిఫిక్‌లో చేరేముందు, నాకు జరిగిన పరీక్షలో రైలుచక్రాలు కొలతలు, మీటల కొలతలు కొలవటంలో నాకు లెక్కలు రావటం బాగా ఉపయోగపడింది. అంత బాగా మళ్ళీ ఎన్నడూ ఉపయోగపడలేదు.

తర్ఫీదు ప్రారంభమవుతూనే నాకు పనిముట్లు అవసరమయాయి. అప్పటికీ ఇప్పటికీ రోజులు బాగా మారాయి. ఈ రోజుల్లో పారిశ్రామిక

సంస్థలు కార్మికులకి అన్ని పనిముట్లనీ అమర్చవలసివచ్చేది. కాని నా చిన్న తనంలో వుద్యోగంలో చేరేటప్పుడు, కార్మికుడు తీసుకువెళ్ళే పనిముట్ల పెట్టే అతని నైపుణ్యానికి గుర్తుగా వుండేది. అందుకనే తన వస్తువులన్నిటి లోకి ఆ పనిముట్లని అతను ఎక్కువ గౌరవించేవాడు. మంచి కార్మికుడు స్వహస్తాలతో పదునుబెట్టని ఏ పనిముట్టునీ తొందరగా విశ్వసించలేక పోయేవాడు. కాని నాకుమటుకు స్వయంగా పనిముటని తయారుచేసుకు నేందుకు మరో కారణముండేది. అవి కొనటానికి నా దగ్గిర డబ్బువుండేగ కాదు.

కొన్నేళ్ళకి నా జీవనోపాధికి ఆ పనిముట్ల అవసరం తీరిపోయింది. చాలా సంవత్సరాల తర్వాత ఎల్లిస్‌లోని మా పాత యింటి అటకమీద నుండి వాటిని తీసుకువచ్చి, 71 అంతస్తులుగల క్రిస్లర్ మేడకింది అంతస్తులో వున్న గాజుపెట్టెలో ప్రజల ప్రదర్శనకి వాటిని పెట్టాను. ప్రదర్శనం చూడ టానికి వచ్చిన వ్యక్తి ఎవరైనా దాదాపు నలభై మైళ్ళ దూరంలోవున్న దిజ్మండలాన్ని చూడవచ్చు. వసారాలో నడుస్తూ- వందల కొలదీ చదరపు మైళ్ళనీ, జనసమ్మర్దాన్ని కిటికీలోంచి ఒక్కసారే చూడవచ్చు. కిటికీ లోంచి బయటికి తొంగిచూస్తే, యిటికలూ, రాళ్ళూ, గప్పలూ, భవనాలు. జనమూ, వూరు అంతా కనుపించే మాట నిజమే. కాని అవి చూసిన వ్యక్తి కన్నా నా పనిముట్ల వంకచూసే వ్యక్తికే అమెరికాను గురించి ఎక్కువ విషయాలు తెలుస్తాయని నా వుద్దేశం.

నేను వృత్తి ప్రారంభించినప్పుడు ఆ పనిముట్లు మోటగా వుండేవి. అందుకనే వస్తువుల దృష్ట్యాచూస్తే, ఏనాటికానాటికి క్రొత్తవీ, మేలురక మైన పనిముట్లు తయారయి మన నాగరికతను అభివృద్ధి పరచాయనిపిస్తుంది. ఉదాహరణకి, ఎలక్ట్రిక్ దీపాలు, మోటారుబండీ, టెలిఫోనూ, చలన చిత్రం - యివన్నీ నూతనంగా తయారయినవే. ప్రస్తుతం అవకాశం తక్కువనుకునేటంత దృష్టిదోషం ఎవరికుంది? క్రొత్త వస్తువులు దొరకటమే కాదు, నేటివరకూ మానవకోటి సాధించిన దానినీ, నిర్మించిన దానినీ ఆక్షేపించే విచిత్రమైన నూతన వస్తువులు వస్తున్నాయి. ఒక్క మనిషి

మస్తిష్కమూ లెక్కింపలేనంత త్వరితంగా మానవావసరాలు, భారీ సమస్యలు ఉద్భవిస్తున్నవి.

నేను మొట్టమొదట "కాలిపర్సు" అనే పనిముట్టుని తయారుచేశాను. దానితో నాలుగు అంగుళాలకన్నా ఎక్కువ నడిమికొలతను కొలవలేము. ఫ్యాక్టరీలో పనిచేస్తున్న మరో కుర్రాడి జతనకలుగా దాన్ని తయారుచేశాను. అవసరాన్నిబట్టి యితర వస్తువులనీ తయారుచేస్తూవచ్చాను. ఒక పెద్ద వర్తక సంఘం పంపిన పనిముట్ల జాబితాని నన్ను చూడనిచ్చాడు ఒక మెకానిక్. అందులో లోతు పరిణామాన్ని కొలిచే చిత్రమూ దాని వివరాలు వున్నాయి.

అటువంటి దాన్ని గురించి నేను ఎన్నడూకని విని ఎరగను. మా కర్మాగారంలో అటువంటిది లేదు. లోహపు తునక రంధ్ర పరిమాణాన్ని చూడవలసివస్తే, వైరుతో రంధ్రాన్ని వెదికి, వేలిగోరుతో గుర్తుపెట్టి. కొలతబద్దతో ఆ తీగెని కొలిచేవాళ్ళం. అంగుళాన్ని పదహారోవంతుకి విభజించి చూపే కొలతబద్ద ఆ రోజుల్లో పనికి వచ్చిందేమోగాని అంగుళాన్ని వెయ్యోవంతుకి విభజించే పనిముట్టు గూడా ఈరోజుల్లో పనికిరాదు.

పనిముట్ల జాబితాని కొంతకాలం నా దగ్గిరవుంచుకునేటందుకు అనుమతి చిక్కినది. లోతు పరిమాణం యొక్క కొలతని నేనే స్వయంగా చేశాను. మొరటుగావుంటేనేం, వైరు. వేలిగోరు, పద్ధతికంటె అది బాగానే వుంది. పలకకి పొడుగ్గావున్న ఒక కాడ - ఆ కాడ చివరను సందులు సందులుగా కోతలు - ఆ సందుల్లో మరలో బిగించుకునే కొలతబద్ద. అంగుళాన్ని ముప్పయి విభాగాలుచేసే కొలతబద్ద అది.

ఆ తర్వాతనుంచీ రంధ్రాలకి బిరడావేయాలంటే చెక్కుదీసి, సందులతో కొలుచుకునే బాధవుండేదికాదు. మరి కొద్ది మాసాలలో యింకా మంచిదానినే తయారుచేశాను. మేలు రకమైన పనిముట్లవల్ల కర్మాగారంలో నాకు మంచి అవకాశాలు కలిగాయి. పెద్దవాళ్ళు చేస్తుండగా చూసిన పనులన్నిటినీ చేయాలనే ఆసక్తి కలిగేది. పెద్దవాళ్ళు చేసుకునే పనిముట్లని స్వయంగా తయారుచేయటం మొదలెట్టాను. ఆ పనిముట్లు

కాళ్ళు మాత్రమే నా చేతులంత పొడవుపుంటేవి. రైలు ఇంజను పిస్టన్‌లని అరగదీసే లేత్‌లమీదగూడా పనిచేయడం ప్రారంభించాను.

వడ్రంగి దుకాణములో సిందూర వృక్షపు చెక్కలమధ్య మోకాలి లోతున నిలబడి, అప్పుడప్పుడు వడ్రంగితో మాట్లాడుతూ, అతను చెప్పేవి వింటూండేవాణ్ణి. అతను పొగాకు నములుతుంటే అతని తెల్లని గడ్డం ఆడుతుండేది. తరుచు అచేతనుడై, గడ్డపు వెంట్రుకలలోదాచిన విద్యుత్ యంత్రాన్ని దేన్నో బైటికి తీస్తున్నట్లు, తలపైకెత్తి తీక్ష్ణంగా చూసేవాడు. రాత్రిళ్ళు పనిచేసేవాళ్ళు నాదగ్గర అరువు తీసుకున్న పని ముట్లు తిరిగి యివ్వడంలేదని నూరోసారి అతనికి చెబితే, పనిముట్లు పెట్టు కునేందుకు సరిపోయే ఒక పెట్టెను బస్తాలోనుంచి తీసియిచ్చాడు.

"నీకోసమే యిది" అంటూ దాన్ని చూపించాడు. అది యింకా పూర్తి కాలేదు. అతనికీ నాకూ గూడా సంతృప్తికరంగా వుండేటట్లు ఆ పెట్టెను పూర్తిచేసేందుకు కొన్నినెలలు పట్టింది. కాని ఈలోపుగా నా పనిముట్ల మీదంతా నా పేరులో మొదటి అక్షరాలని చెక్కుకున్నాను.

అక్షరాలు ఎలా చెక్కాలో సైంటిఫిక్ అమెరికన్ అనే పత్రికలో చదివాను. గుర్తు పెట్టవలసినచోట ముందు అస్ఫాల్టు రంగుపులిమి, తర్వాత ఆ రంగుని గీసెయ్యాలి. ఆ గియ్యడంలో అక్షరాలు మిగలాలి. అప్పుడు ద్రావకం పుయ్యాలి. ఒక చిన్న బుడ్డీడు అస్ఫాల్టు రంగు పంపమని పత్రిక వారికి పదిసెంట్లు పంపాను. అది వచ్చిన రోజునుంచీ నా పనిముట్లన్నిటి మీదా "డబ్ల్యూ. పి. సి." అని వ్రాశాను.

ఏ సమయంలోనైనా సరే, ఎల్లీస్ వాయిద్యగాళ్ళు రోడ్డుమీద వెళ్ళారంటే, ఆ రోజు మాకు బలే హుషారుగా వుండేది. ఆ ఆనందంలో నేనూ పాలు పంచుకునేవాణ్ణి. ఉన్నత పాఠశాల వదలకముందే నకలు నగారా వాయించటానికి ఆ జట్టులోచేరాను. నా స్నేహితుడు చార్లీ కెరీ మంద్రస్వరంలో నగారా వాయించేవాడు. నగారా వాయించే దండులో నేను సభ్యుడను కావటం వల్లా, నాన్న యిచ్చిన తర్ఫీదువల్లా, నేను మంచి నగారా మోయించేవాడిగా తయారయాను. కాని నగారా వాయించి

సన్నాయిల్ని అంతకంటె శ్రావ్యమైన వాయిద్యాలు వున్నాయని నాకు తెలుసు. వెన్నెలరాత్రిలో ప్రియురాలి దగ్గర నగారా వాయించడం ఎలా?

అన్నయ్య ఇడ్ సన్నాయి వాయించేవాడు. జో మాకన్ పెద్ద బాకా ఊదేవాడు. జోమా యింట్లోనే భోజనంచేసేవాడు. అతని తండ్రి ఐరిష్ దేశస్థుడు. కొంతకాలం ఫోర్‌మన్‌గా వుండి తర్వాత గోడ్డు అధికారి అయాడు. ఉద్యోగం చాలించిన తర్వాత తన కుటుంబాన్ని కాన్‌సాస్ పట్టణానికి పంపించాడు. జో మటుకు కర్మాగారంలో ఆఖరి సంవత్సరం తర్ఫీదు ముగిసేంతవరకూ ఎల్లీస్‌లో వుండవలసివచ్చింది.

దాదాపు ప్రతిరాత్రీ మేము దిండుకోసం కొట్లాడుకునేవాళ్ళం. ముగ్గురిలో చిన్నవాడినైన నేను బేస్‌బాల్ బాటు తీసుకుని వారిని తరి మేంతవరకూ ఆ పోట్లాట ఆగేదికాదు. ఇంటి దగ్గరా, దుకాణంలోనూ, వాయిద్యం నేర్చుకుంటున్నప్పుడూ, వాళ్లు నన్ను ఉడికించేవారు. నాకు తెలిసినంతవరకూ, అన్ని వూళ్ళల్లోనూ ఈ వాయిద్యం సరదాకోసమే నేర్చుకునేవారు. ఆనెపంతో రాత్రిళ్ళు వూళ్ళో తలిమ్మా అమ్మాయిలనీ, అబ్బాయిలనీ, కలుసుకునేందుకు అవకాశం వుండేది. అందరి యిళ్లల్లోనూ మా యింట్లోలాగే తల్లి తండ్రులు పిల్లల్ని కఠినంగా పెంచేవారు.

మేము వాయిద్యం మొదలెట్టి వెళుతుంటే, పట్టణంలోని చిన్న చిన్న సత్రాలు గొంతెత్తి సకిలించేవి. అందుకు మా సంగీతంలో లోపం కారణం కాదు. ఆ వాయిద్యగోష్ఠితో వెళ్ళటం సరదాగా వుండేది. మమ్మల్ని చూట్టానికీ, మా సంగీతం వినటానికీ, పట్టణంలో సగంమంది జనం యిళ్ళమీద. ముందూ చేరేవారు.

సాధారణమైన లాగూలు, టోపీలు, పొడుగాటి పట్టీలు, మెడలో పసుపు తెలుపు చుక్కలున్న జేబురుమాలు చుట్టుకుని వెళుతుంటే అచ్చంగా ధూమయంత్రం శాస్త్రజ్ఞులకు మల్లేనే వుండేవాళ్ళం. ఇడ్ పియర్సన్ అనే ఇంజనీరు మాకు నాయకుడు. అతను బాకా ఊదేవాడు. డెల్లా ఫోర్కుతో చేరి కార్పురెట్ దగ్గిర పియానో పాఠాలు నేర్చుకున్నాను గనుక నాకు సంగీతం వచ్చు. అంతేగాక ఇంటి దగ్గిరకూడా

పియానో బాగా అభ్యాసమయేంతవరకూ వాయించేవాణ్ణి. కాని వాయిద్య గాళ్ళతో చేరి ఏ వాయిద్యం వాయించలేము. నగారా మోయించటం నాకు విసుగు పుట్టింది. అందుకనే ఒక సన్నాయి కొనుక్కున్నాను. నా నోరు పుండయేంతవరకూ రాత్రింబగళ్లు వాయించి దాన్ని సాధనచేశాను.

ప్రతి సంవత్సరం ప్రీస్ట్సు ఆఫ్ పాలెన్ పారేడ్ అనే వేడుక జరిగేది. ఒకసారి వాయిద్యగాళ్ళ దుస్తులు ధరించి, రైలు ప్యాసులతో కాన్సాస్ పట్టణం మీదుగా ఆ వేడుకకి వెళ్ళాము. ఆ సంవత్సరం క్రిలోబెల్లీస్ అనే పాటను మేము బాగా వాయించా మనుకుంటాను. ఆ మరుసటి సంవత్సరమే కాబోలు, సాయంకాలాలు అన్నయ్యకి యితర పనులుండటంవల్ల వాయిద్య సాధన మానేశాడు. దానితో అలక్ష్యంవల్ల అతని మంద్ర స్వరపు గొట్టం పచ్చ రంగులోకి మారింది. ఎడ్గార్ ఈస్టర్ బ్రూక్ ఒక శాఖకి యంత్రాధి కారిగా వుండేవాడు. అతని కూతురు మైతో ఇడ్ షికార్లకి వెళ్ళేవాడు. ఆ తర్వాత వాళ్ళిద్దరూ వివాహం చేసుకున్నారు. ఇడ్ స్థానంలో బాకా నేను వాయించేవాణ్ణి. అది చాలా పెద్దగా మ్రోగేది. అదంటే నాకు బలే యిష్టం. బంగారు రంగుగంటా, వెండి పూతావున్న ఆ వాయిద్యాన్ని కాన్సాస్ నుంచి డబ్బు పంపి తెప్పించుకున్నాను. దానికి నా బుజం చుట్టూ వేసుకునేంత తోలు నాడా వుండేది. అది ఒక్కటే వాయించినా వినవచ్చు. కాని అదేమంత బాగుండదు. ఆ వాయిద్యంనుంచి గుబ్బు గుబ్బు మని శబ్దం వచ్చినప్పుడెల్లా నాకు బలే సరదాగా వుండేది. గోష్ఠివున్నా లేకపోయినా ఫ్యాక్టరీలో వారానికి అరవైగంటలు తక్కువ కాకుండా పనిచేసేవాణ్ణి.

తరుచు పై అధికారి చూడనప్పుడు, ఫ్యాక్టరీ ప్రాంతంలో చెడుగుడు ఆడేవాళ్ళం. ఒకొక్కప్పుడు అధికార్లు వెదికికూడా, ఆ ఆటలు ఎక్కడ జరుగుతున్నాయో వారు తెలుసుకునేవారు కాదు. మాకు ఒక రహస్య స్థలముండేది. బురదబురదగావుండే గొయ్యి అవతలకి వెళ్ళి, నలుగు రైదుగురు సరిపోయేటంత గుహలో ప్రవేశించేవాళ్ళం. పారిపోవటానికి సిద్ధపడ్డ ఖైదీలకు మల్లే ఆరహస్య స్థలాన్ని దొంగతనంగా ఉపయోగించుకునే

వాళ్ళం. నిజానికి ఎప్పుడైనా విసుగుపుడితే పనితప్పించుకుని పారిపోవాలని పించేది.

ఎల్లీస్‌లో మెతాడిస్టు క్రైస్తవులకి పేకాట అంటే గిట్టేదికాదు. నేను ఆ మతానికి చెందినవాడనే! చెడుస్త్రీలతో సహవాసమూ, సారాయి, పొగ చుట్టలు, పేకాట ఆడడమూ దుష్కార్యాలుగా ఎంచబడేవి. వూళ్ళోని గౌరవ కుటుంబ స్త్రీలు ఆ చిహ్నాలేవైనా వున్న వ్యక్తి తమ కూతుళ్ళకి దూరంగావుండేట్లుగా జాగ్రత్తపడతారు. చాలా సంవత్సరాలు దొర్లి పోయాయి గనుక నిజం చెప్పేస్తున్నాను. ఓ రహస్య స్థలంలో మేము పేకాడుకునేవాళ్ళం. పొగ చుట్టలు త్రాగేవాళ్ళం. అప్పుడప్పుడు కొద్దిగా సారాయి పుచ్చుకునేవాళ్ళం. బుడ్డీమూతలో పెట్టిన క్రొవ్వొత్తిదీపం వెలుగులో ఈ అక్రమాలన్నిటినీ అభ్యాసం చేసుకున్నాము. కర్మాగారం క్రిందవున్న సొరంగాన్ని మా పనులన్నింటికీ కచేరీగా ఉపయోగించేవాళ్ళము. అప్పట్లో మేము చాలా దృఢంగా వున్నట్లనిపించేది.

అవంతా సరదాగా వుండేది. కాని ధూమయంత్రము ఈ ద్వేటప్పుడూ వున్న గుర్పాటులో సగమైనా లేదు అందులో. నేను తెలుసుకోగోరిన దంతా పుస్తకాలు కాదు, ఆ పనిముట్లే తెలిపాయి నాకు. తెలుసుకో గోరినదా ?...ఊహూ...యంత్రాలను గురించి. నాటిని నడిపేశక్తిని గురించి తెలుసుకోవాలనే నా ఉద్రేకాన్ని ఆ మాట సరిగ్గా వర్ణించలేదు. దేశంలో జరుగుతున్న మార్పు, నిత్యం కలిగే అభివృద్ధి, శాస్త్రరీత్యా తెలుస్తున్న క్రొత్త విషయాలు నాకు ఇంద్రజాలంగా వుండేవి. అన్నీ తెలుసుకోవాలనే ఆసక్తి కలిగేది.

నా ప్రశ్నలన్నిటికీ సమాధానాలిచ్చేపాటి జ్ఞానం ఎల్లీస్‌లో ఎవరికీ లేదు. అందుకని సైంటిఫిక్ అమెరికన్ అనే పత్రికని ప్రమాణంగా ఎంచి ప్రతి తపాలులో ఆ పత్రికకు ప్రశ్నలు పంపేవాడిని. చందాదారుల ప్రశ్నలు చూసే ఆ పత్రిక సంపాదక వర్గంలోని వారెవరైనా, వాల్టర్ క్రిస్లర్ అనేది పన్నెండుమంది కుర్రాళ్ళు పెట్టుకున్న ఒక మారుపేరనీ, అందులో కనీసం సగం మందికైనా పిచ్చివుందనీ, అనుకునుంటారు. కాని

నా ప్రశ్నలలో చాలావాటికి సమాధానాలు వచ్చేవి. 1892 వ సం॥పు నవంబరు 5 వ తేదీ పత్రిక చదివితే నా మనసులో పరవళ్ళు తొక్కిన భావాలని కొంతవరకైనా గ్రహించవచ్చు. ఆ పత్రికలో యిలా ప్రకటించారు.

నిప్పుని ఆర్పివేసే చేతి ఫిరంగి గుండ్లు దేనితో చేయబడ్డాయని డబ్ల్యూ. వి. పి. గారు అడుగుతున్నారు - పల్చని గోళాకారమైన గాజుబుడ్డీలలో కాల్షియం క్లోరయిడ్, సాల్ రమ్మోనియక్, లేక బొరాక్సు కాని కలిపిన ద్రవపదార్థం నింపితే చేతి ఫిరంగి గుండ్లు తయారుచేయవచ్చు.

2. స్టోరేజ్ బాటరీలలోని ప్లేటకి యింషులేషన్ చుట్టడానికి ఏది మంచిది ? జ - గట్టా పెర్చాని ఉపయోగించాలి.

3. రెండు ఆసిడ్‌లు ఏవైనా కలిపితే పేలుతాయా ? జ - అవును.

4. గంధకమునుంచి తీసిన ఆసిడ్ కట్టెను మండించగలదా ? జ - గంధకమునుంచి తీసిన ఆసిడ్ కట్టెలోని ద్రవపదార్థాన్ని తీసివేసి, దాన్ని కాల్చి బొగ్గుచేస్తుంది.

5. స్టోరేజ్ బాటరీలలోంచి పత్తే తుంపరలు కట్టెను మండించగలవా ? జ - మండించ గల వనుకోము.

నేను కొనుక్కోలేని వస్తువులని స్వయంగా చేసుకోవటం చాలా కాలంగా అలవాటయిపోయింది. మంచుమీద పోయేందుకు మొదటి ఇనుప చెప్పులని నేనే చేసుకున్నాను. తర్వాత ఒక చక్కని తుపాకీని తయారు చేశాను. కర్మాగారంలో పనిచేస్తున్నప్పుడు ఒక చిన్న మాదిరి ధూమ యంత్రాన్ని చేశాను.

అది నాన్న నడిపే యంత్రం మచ్చు. ఇరవైఎనిమిది అంగుళాల పొడుగుంది. నాలుగు చక్రాలూ ఒకేసారి కదిలేవి. అప్పట్లో మాకు నమూనాపథకాలంటూ వుండేవికావు. అందుకని యంత్ర భాగాలన్నిటినీ అతికేట్లు స్వయంగా పనిచేయవలసివచ్చేది. ఇనుపముక్క నొకదానిని తీసుకుని, చెక్కి, దొంతిగా చేయటంతో ఆ ఇంజను చేయటం ప్రారంభించాను.

తన మనసుని ఆక్రమించుకున్న సుందరాకారాన్ని దేన్నైనా చలువ రాతిమీద చెక్కే శిల్పికూడా ఘూమయంత్రం నిర్మించేటప్పుడు నేను ప్రదర్శించినంత అభిమానాన్నీ, పనితనాన్నీ ప్రదర్శించివుండడు. నిజానికి ఆ ఘూమయంత్రం ఎంతో వాస్తవికంగానూ, సంపూర్ణంగానూ నా మనో నేత్రంలో మెదిలిన తరువాతే పని ప్రారంభించాను. కొన్ని పుస్తకాలు చదివి నేర్చుకోలేకపోవటానికి కారణమిదే అనుకుంటాను. కళ్ళతో చూసి, వేళ్ళతో స్పృశించినవి నా మనసులో గాఢంగానాటుకు పోయేవి. అందు కనే నేను చూసినవీ, స్పృశించినవీ నా ఊహాశక్తిని నింపేశాయి. అటు వంటివి నేను ఎన్నడూ మఱచిపోలేదు.

ఆ ఘూమయంత్రం నమూనా పూర్తవుతూనే పెరట్లో కొన్ని గజాల దూరం దాన్ని పరిగెత్తించాను - దాని చిన్ని ఈల వినిపిస్తూనే నాన్న ముఖంలో గర్వంతో కూడిన చిరునవ్వు వెలిసేది.

నా తర్ఫీదు రెండో సంవత్సరం చివరలో అనుకుంటాను చిక్కొకటి బయలుదేరింది. మొదట్లో గంటకు 5 సెంట్లు చొప్పున యిచ్చేవారు. అంటే రోజుకి పదిగంటలు పనిచేస్తే, కసవు వూడ్చినప్పుడు సంపాయించిన దానిలో సగంమటుకే దొరికేది. కాని రెండో సంవత్సరంలో గంటకి పదిసెంట్లు చొప్పున యిచ్చేవారు. మూడో సంవత్సరంలో యిచ్చే బత్తెము చొప్పున. గంటకు పన్నెండున్నర సెంట్లు ఆర్జించేందుకు యింకా కొద్ది వారాలున్నా యనగా ఈ సంఘటన జరిగింది. నేను ఇంటిదగ్గరనే భోజనంచేసి, పడుకునే వాడిని. నా దుస్తులన్నీ యింకా అమ్మే కుడుతూండేది. రాత్రిళ్ళు పనికి వెళ్ళితే అమ్మ నాకు సరిపోయేటంత భోజనాన్ని ముంతలో కట్టియిచ్చేది. పగలు పనిచేస్తే భోజనానికి మధ్యాహ్నం యింటికి వెళ్ళేవాడిని.

మధ్యాహ్నం ఫ్యాక్టరీ కూత వినపడుతూనే, ఎల్లీస్‌లోని స్త్రీలంతా తమ పురుషులకోసం కాచుకునేవారు. వెంటనే నేను తలిమ్మో మెకా నిక్కులతో ఒంటిమీద మసినీ, బట్టల జిడ్డునీ శుభ్రం చేసుకోవటానికి తొట్టి దగ్గరకి పరుగెత్తేవాడిని. కసవు వూడ్చేవాడిగా వున్నప్పుడు, మధ్యాహ్నానికి యింకా పదినిముషాలుందనగా, ఆ నల్లని నిడుపాటి తొట్టి

నిండా నీళ్ళు నింపటం నా పనుల్లో ఒకటి. ఆ తొట్టిలో మేమందరమూ. ముఖము, మెడా, చేతులూ కడుక్కొంటూగానే, నీళ్లు బూడిదవర్ణంలో అసహ్యంగా తయారయేవి. ఒకనాటి సాయంకాలం కసవు వూడ్చేవాడు అలక్ష్యం చేయటంవల్ల తొట్టి యింకా మురికినీళ్ళతో నిండి మైల తేలుతూ వుంది. అప్పటికి మేమింకా పనిచేస్తున్నాము. రైలు చక్రాల జతనుకలిపే ఇనుపకడ్డీ చుట్టూ పుయ్యటానికి చమురు, పీచు, సిద్ధంచేస్తున్నాను. ఇంకా కొంతమంది కార్మికులు అక్కడ తిరుగుతున్నారు. నేను చమురు తొట్టి లోకి వంగుతుండగా, బురదచేత్తో ఎవరో ముఖం మీదనూ చెవిమీదనూ కొట్టారు. నాకు పిచ్చెక్కినట్లయింది. తలెత్తి చూడగానే నీళ్ళు కారు తున్న చేతితో మెగ్రత్ అనే అతను నిలుచునున్నాడు. అతని చేతిలో గుడ్డపేలికవుంది తప్పకుండా దాన్ని మురికినీళ్ళ తొట్టిలోముంచే నామీద విసిరికొట్టాడని తెలుసుకున్నాను.

నేను ఏమన్నానో అనే విషయం వదిలేద్దాం. అతన్ని తరిమి పట్టు కుందామనుకున్నాను. తొట్టెలోకి లోతుగా చెయిపోనిచ్చి, పీచుతీసుకుని అతని వెనకాతల పడ్డాను. అతను ఒక పెద్ద తలుపుగుండా పారిపోయి తలుపు వేసేశాడు. ప్రధానోద్యోగి గస్ న్యూబర్టు కార్యాలయం వైపు వెళ్ళవలసివస్తుంది గనుక అతను బయట ఆ ట్టేసేపు తెగగడని నాకు తెలుసు.

తలుపుముందు జాగ్రత్తగా నిలబడ్డాను. నా ఆగ్రహాన్ని ఎగతాళి చేస్తున్న వెనుకవారిని చూసి, "ఆ వెధవకి ఈవేళ సరిగ్గా నోట్లో నీళ్ళు పోస్తాను" అంటున్నాను. అప్పుడు తలుపు గడియ నెమ్మదిగా తెరుచు కుంది. తలుపుకీలు కీచుమని శబ్దంచేసింది. నేను ఒక్కుమ్మడిన ముందుకి ఉరికాను. కాని నేను నీళ్ళుపోసింది మెగ్రాత్ ముఖంలోకికాదు. అది అధికారి న్యూబర్టు. ముఖంమీదిది తుడుచుకునే లోపుగా అతను నామీద మండిపడ్డాడు.

ఆ తర్వాత కొన్నాళ్ళపాటు ఈ భూమి మీదనుంచి నన్నెవరో తరిమేసినట్లనిపించింది. ఈ ప్రపంచంలోకల్లా తర్ఫీదు పొందటంకంటె ముఖ్యమైనది నాకు మరొకటిలేదు. అందుకనే ఖిన్నుడనైపోయాను.

బహుశః అన్నయ్యో నాన్నో ఈస్టర్ బ్రూక్‌తో మాట్లాడి సాయం చేశారనుకుంటాను. ఏది ఎలాగైనా, యంత్రాధికారి నాకోసం కబురు పంపాడు. అతని పెద్ద బల్ల కాయితం దొంతరలతో నిండివుంది. దానిముందు నిలబడి అతని వుపన్యాసాన్ని పశ్చాత్తాపంతో విన్నాను. "ఆ మాగ్రత్ నాను పిచ్చెక్కించాడు. నేను పనిచేస్తుండగా—"

ఈస్టర్ బ్రూక్‌ది చాలా పెద్ద శరీరం. అతను ఒక్కసారి సంతోషంతో నవ్వాడంటే, చేతిగడియారపు గొలుసు పైకి కిందకీ కదిలేది. అది కదలటం చూసి నాలో ఒక్క ఆశాకిరణం తలయెత్తింది.

"ఈమాటు కొలుపులోంచి ఎవరువస్తారో కాచుకుచూడు లేదా మాగ్రత్‌ని బైట ఎక్కడైనా పట్టుకో. న్యూబర్టుని క్షమాపణకోరితే నిన్ను మళ్ళీ పనిలో చేర్చుకొనేందుకు ఒప్పుకోవచ్చు."

సరే, అప్పుడిక తలవంచుకుని, న్యూబర్టు దగ్గరకి వెళ్ళాను. గుండెల మీద కన్నీటి బొట్లు కాయితుంటే అతనిని క్షమాపణ కోరాను. అతను కర్మాగారం బైట నిర్మానుష్యంగావున్న చోటికి నన్ను పిలుచుకు వెళ్ళాడు. అరగంటపైన విషయాలన్నీ నాతో చెప్పాడు. చిట్టచివరకి, "ఇదే నీకు గుణపాఠం. ఇలాంటిది మళ్ళీ జరిగిందా నిన్ను తప్పకుండా ఉద్యోగంనుంచి తీసేస్తాను. మళ్ళీ యిందులోకి రాలేవు" అన్నాడు.

అగాధంలో పడిపోయిన తుపాకీ దొరికిన తర్వాత ఒక వ్యక్తి సంతోషంతో ఎలా గంతులువేస్తాడో అలాగే నేను తిరిగి పనిలోకి వెళ్ళాను. ఆ భయం నాకు చాలా ఉపకారంచేసింది. యంత్రాలంటె నాకెంత యిష్టమో అప్పుడే నాకర్థమయింది. 1936 వ సం॥ కాన్‌సాస్ పట్టణంలో మా కంపెనీ యిచ్చే జీతాల పట్టీలో నా మిత్రుడొకడి పేరు వుంది. అతనిప్పుడు బాగా వృద్ధుడయిపోయాడు - అతనే న్యూబర్టు.

ఒక రాత్రి రైలు అడుగున నేను సాయపడుతున్న వ్యక్తి ఆ పని ఆపేసి, చుట్టూ జాగ్రత్తగా కలయజూశాడు. ఇతర చోట్లా కార్మికులు రైలు మరమ్మత్తులో నిమగ్నులయివున్నారు. ఫ్యాక్టరీ అంతా చీకటిగావుంది. బొగ్గులకుండులో నారింజరంగు జ్వాలలు మట్టుకు కనిపిస్తున్నాయి. పలుచని

రాతిగోడలమీదా, యినుపకంచీలలో సాలెపురుగు పట్టులా కనుపించే కప్పుమీదా బ్రహ్మాండమైన ధూమయంత్రం నీడలు కనపడి తిరిగి అదృశ్య మవుతున్నాయి.

ఆర్థర్ క్రింద నేను తర్ఫీదు పొందుతున్నాను. అతనంటె నాకు చాలా అభిమానం. అవేళ "నేను వూళ్ళోకి వెళుతున్నాను" అన్నాడు ఆర్థర్ నా చెవిలో రహస్యంగా.

"వెళ్ళవద్దు. పట్టుబడ్డావంటే వుద్యోగంలోంచి తీసేస్తారు" అని హెచ్చరించాను. అతనికి ముప్పువాటిల్లుతుందని నాకు భయమువేసింది. కొద్దికాలం క్రితమే ఆర్థర్ ఎల్లిస్ కివచ్చి ఫ్యాక్టరీలో ఉద్యోగం సంపాయించాడు. అతను చాలాచోట్ల పనిచేశాడు. ఆఖరికి శాంతాఫీ ఫ్యాక్టరీలోనూ పనిచేశాడు. మా ధూమయంత్రం గొట్టాలని పెట్టటంలో అతని నేర్పుని అందరూ మెచ్చుకునేవారు. అందులో అతను చక్కని నిపుణుడు. ఆ పనిచేయటం నేర్చుకుందుకు గస్ న్యూబర్టు అతనికింద నన్ను శిక్షణ దారుడిగా నియమించాడు. ధూమయంత్రం నడిచే శక్తి గొట్టాలు సరిగ్గా అమర్చటం మీదే ఆధారపడివుంది. ఇప్పటికీ భారీగా కురుస్తున్నవర్షంలో మూరానవెళ్ళే ధూమయంత్రం గొట్టాలు సరిగ్గావున్నాయో లేవో ప్రక్క మీద పడుకునే చెప్పగలను. అవి సరిగావున్నట్లయితే గొట్టంలోంచివచ్చే పొగబుసబుసలు సరిగ్గావుంటాయి. అంతేకాదు; యంత్రాలని గురించీ, లోహాన్ని గురించీ, మనుష్యులను గురించీ, యింకా లెక్కలేనన్ని విషయాలు తెలుసు నాకు. దీనికంతటికీ ఆ వృద్ధ యంత్రశాస్త్రజ్ఞుడు డార్లింగ్ కి నా కృతజ్ఞత తెలిపాలి. నిజానికి అతనికి నేను చాలా ఋణపడివున్నాను. ఆ రోజుల్లో నిపుణుడు తను పనిచేస్తుండగానే శిక్షణదారుడికి సమస్తవిషయాలనీ బోధించటం చాలా ఉపయుక్తమైన పద్ధతిగా పరిగణింపబడేది. నిజానికి ఇన్నేళ్ళు గడిచిపోయినా ఆర్థర్ డార్లింగ్ అంతటి చక్కటి ఉపాధ్యాయుడు ఏ శిక్షణదారుడికీ లభ్యంకాలేదని అనుకుంటాను.

"ఈ గొట్టాలతో నీపనికానిస్తూవుండు" అని చెప్పి దీపం దగ్గరనుంచి వెళిపోయి "నేను పన్నెండుగంటల ప్రాంతంలో తిరిగివస్తాను" అని అదృశ్యమయాడు ఆర్థర్.

అతని విషయంలో నాకు భయము వేసింది.

అతనంటే నాకు చాలా యిష్టమేర్పడింది. తన అనుభవాన్ని పురస్కరించుకుని ఏదైనా నేర్చుకుందామని ప్రయత్నించేవారిమీద అర్ధర్ సామాన్యంగా మండిపడేవాడు. కాని నా విషయంలోమటుకు భిన్నంగా వుండేవాడు. అతని విజ్ఞానంలో నన్నూ పాలుపంచుకోమని కోరేవాడు. ఎల్లిస్ కర్మాగారాల్లోని కార్మికులకంటె అతను బాగా చదువుకున్నవాడు. గణింతాలు చేస్తున్నప్పుడు అతని ఆత్మవిశ్వాసం చూస్తే నాకు చాలా ఆశ్చర్యము వేసేది. మొదట ఉక్కుపదార్థాలతో పనిచేయటం నాకు అతనే నేర్పాడు.

"ఇదిగో! గొట్టాలతో పని ప్రారంభించేటప్పుడు ఇంతకుముం దెవరైనా వేశామని చెప్పినాసరే, గుర్తులని స్వయంగా వేసుకుంటే తప్పుత్రోవను ఎప్పుడూ పడవు" అని హెచ్చరించేవాడు.

అటువంటి స్నేహితుణ్ణి పోగొట్టుకోవటానికి మనసొప్పలేదు. అతని ఉద్యోగం పోవటం గూడా నాకు యిష్టంలేదు. ఆవేళ రాత్రి అతను విలాసాలకి వెళ్ళిపోయినప్పుడు అతని పనిగూడా నేనేచేసి అతని వుద్యోగం నిలబెట్టేటందుకు శ్రమపడ్డాను.

ధూమయంత్రం చక్రాలూ, మధ్యకొడ, వాల్వుగీర్, అన్నీ బిగించి వున్నాయి. కనుక ఉదయం ముఖ్యోద్యోగి పనిలోకి వచ్చేముందయినా నాపని పూర్తిచేయగలిగితే చాలు అనుకున్నాను. ముందు రాయిని మధ్యస్థలంలో వుంచాను. తర్వాత వాల్వుకొడ సరిగ్గా వాల్వు మధ్యకి వచ్చేట్లు చేశాను. యంత్రం ముందుభాగానికి మధ్యగా వంపుటిరుసుని పెట్టాను. చక్రాల జతనుకలిపే బద్దపైన యంత్రం. ముందరిభాగాన్నీ, క్రింద వెనుకభాగాన్నీ పెట్టాను. వాటిని తాత్కాలికంగా బిగించేటందుకు మరలనువదులుగా బిగించి అడ్డకొడ క్రిందికి వదిలివేశాను. క్రొత్తపద్ధతిలో ఆ సమస్య నలా పరిష్కరించినందుకు సంతృప్తి కలిగింది.

ఆ పనిలో పూర్తిగా నిమగ్నమైపోయి డార్లింగు యంత్రం క్రింద నుంచి ప్రాకుతూవచ్చి నా ప్రక్కనే నిలబడగానే ఉలికిపడ్డాను. అది అర్ధరాత్రి. నా పని తనిఖీచేయటానికి డార్లింగు తిరిగివచ్చాడు.

నేను చేసినది సరిగ్గావుందన్నాడు. అక్కడ యింకో శిక్షణదారుడున్నాడు. అతను నాకంటె చిన్నవాడు, స్తబ్ధ.

"నీ పని బాగానేవుంది వాల్ట్. నేను మళ్ళీ వూళ్ళోకి వెళ్తున్నాను. మూడుగంటల ప్రాంతంలో తిరిగివచ్చి చూస్తా" అని నా వీపు చరిచాడు.

"ఇంజను బండిలోకి వెళ్ళి పడుకో. ఇది నీ గొంతుగిగాదికి వస్తుందని నీకు తెలుసు. వాళ్ళు తప్పకుండా నీ వుద్యోగం వూడబీకుతారు" అని బతిమాలాను.

"ఊహూ. నేను వెళ్ళిపోతున్నాను. కాని ఒక్క క్షణ మాగు. ఆ చక్రాలని కదిలించి చూస్తాను" అన్నాడు.

చక్రాలకెదురుగా పెద్ద ఇనుపపాత్రములని వుంచాము. అప్పుడు యంత్రంబరువు పూర్తి ఆ పాత్రములమీద పడేంతవరకూ, ఇనుపకడ్డీ పటాకార్లతోతో, కడ్డీ మొనలతోనూ, మరలని బిగించాము. పటకారుతో లాగి ధూమయంత్రం చక్రం త్రిప్పవచ్చు. నేనూ యింకో శిక్షణదారుడూ. పటకార్లని లాగుతూ, చక్రాలని త్రిప్పుతుంటే, అగ్గర్ వాల్వులు సరిగ్గా పనిచేస్తున్నాయో లేవో చూశాడు.

తను ఏం చేస్తున్నదీ, ఎందుకు చేస్తున్నదీ, మెల్లిగా వివరించిన తర్వాత చెయివూపుతూ అతను బైటికి వెళిపోయాడు. నేను ఆ పని పూర్తిచేయటానికి ఉపక్రమించాను. ఆ తర్వాత అతను ఎన్నడూ మూడు వాల్వులు బిగించే పనిచేయలేదు. అతని పనంతా నేను చేయగలిగేవాణ్ణి కనుక గొట్టాలు పెట్టే పని పూర్తిగా నాకు వదిలేశాడు. ఇతర కార్మికులకంటె గూడా అందులో నాకు అనుభవం ఎక్కువయింది. నేను చాలా పెద్ద యంత్రశాస్త్రజ్ఞుడననీ, ఆ విషయంలో తనతో నేను మనస్ఫూర్తిగా ఏకీభవించటం అవసరమనీ అనేవాడు అగ్గర్.

అప్పట్లో నేను బాగా చిన్నవాణ్ణి. రైలు గమనాన్ని నిలిపే వాయు సాధనాలు ప్రవేశపెట్టకముందే, ఆ వెస్టింగ్‌హౌస్ యంత్రం ఎలా పని చేసేదో, ధూమయంత్రంలో దాన్ని ఎలా పెట్టాలో తెలుసుకున్నాను. వెస్టింగ్‌హౌస్ కంపెనీనుంచి ఆ సమాచారం తెప్పించాను.

వాయువుని పంపుచేసేందుకు ఇంజనులోనే ఒక వాయువు పంపు వుంది. ఇంజను పనిచేస్తుంటేనే అది పని చేస్తుంది. ఇలా పంపుచేసిన వాయువుని పెట్టేందుకు ఒక ఏర్పాటువుంది. ఇంజనునుంచి రైలుబండి పొడుగూతా, రైలుపెట్టెల అడుగుభాగంలో ఒక గొట్టం వుండేది. అది "బ్రేక్ సిలిండర్‌కి" బిగించివుండేది. ఈ కొత్త పద్ధతిలో రైలు గమనాన్ని నిలిపే వాళ్ళం. మా రైలు కంపెనీవాళ్ళు ఇలాటి మార్పుని ప్రవేశపెట్టకముందే నాకు ఆ విషయాలన్నీ తెలుసు. అందుకనే ఆ విడిభాగాలు రాగానే అవి రైలుబండిలో బిగించే వుద్యోగం నాకిచ్చారు. జీతం గంటకు పదిహేను సెంట్లు దొరికేవి. ఇదిగాక ఇంజనీరుగా తయారుగావాలని అభిలాషపడే ఫైర్‌మన్‌ల పనిని తనిఖీచేసి మరి కొంతడబ్బు సంపాయించేవాడిని. వాయుసాధనం అమర్చబడిన రైలుపెట్టె దగ్గిర ఆ సాధనం ఎలా పనిచేస్తోందో వారికి చూపెడుతూ, "నేను ఎందుకింకా ఇక్కడ వుండాలి? నాకు తెలిసిన విషయాలతో ఆఖరికి చైనా వెళ్ళినా వుద్యోగం సంపాయించుకోగలనే!" అని నాలో నేను అనుకునేవాణ్ణి. ఇదంతా తర్ఫీదు పొందుతున్న ఆఖరి సంవత్సరంలో జరిగింది.

తర్వాత రైళ్ళకి ఆవిరిలో చలికాచుకునే పద్ధతి వచ్చింది. పాత రకం చిన్న బొగ్గుపొయ్యిలని మానేశాము. వాటివల్లే రైలు ప్రమాదాల్లో ఘోరమైన మంటలు బయల్దేరేవి. తూర్పువైపున సాంకేతిక పత్రికలకీ. మరి కొందరు నిపుణులకీ ఉత్తరాలు వ్రాసి, "ఆవిరిపెడిని" ఎలా ప్రవేశ పెట్టాలో తెల్సుకున్నాను. ఆ పనీ నేనే సంపాదించుకున్నాను. ఆతర్వాత విద్యుత్ సౌజ్ఞలు (ఎలక్ట్రిక్ సిగ్నల్సు) వచ్చాయి. అప్పటికే విద్యుచ్ఛక్తిని గురించి బాగా తెలుసుకునుండటంవల్ల ఆ వుద్యోగమూ చెయ్యగలిగాను. కర్మాగారంలో కొత్తవిషయమేదైనా నేర్చుకోవటంతోనే మిగతా వారం వరికీ చూపెట్టేవాడిని. అలా చూపెట్టటంవల్లే చాలా అనుభవం సంపాదించ గలిగాను. నాకు ఓరిమి అనేదిలేదు. చాలా తొందరగమనిపించి. "అబ్బ! ఇప్పటికే ఇరవైమూడేళ్ళు వచ్చేయి—యింకా ఎల్లీస్‌లోనే వుంటున్నాను" అనుకునేవాణ్ణి.

ఒక శనివారం రాత్రి జి. ఏ. ఆర్. చావడిలో నేనూ డెల్లా ఫోర్కూ

నాట్యం చేశాము. ఆమె తన మృదువైన మెడచుట్టూ ముఖమల్ గుడ్డ చుట్టు కుంది. నుదుటిమీద నల్లని ఉంగరాలజుత్తుని వెనక్కితీసి ముడివేసుకుంది. మా యిద్దరికీ ప్రధానం చేశారు. మా హృదయాలలో రాగా లాపన చేస్తూండడంవల్ల సంగీతం విషయం మేము ఆట్టే పట్టించుకు నేవాళ్ళం కాదు. మిగతావాళ్ళకి ఆ సంగీతం ఎలా వుందో మేము లక్ష్యపెట్టేవాళ్ళం కాదు. సామాన్యమైన నృత్యంకోసం జంక్షన్ సిటీనుంచి వాయిద్యగోష్ఠిని పిలిపించే తాహతు లేదు మాకు. మా వాయిద్యాలల్లా ఒక ఫిడేలు, ఒక పియానో. ఒక బక్కపల్చని వ్యక్తి ఆ ఫిడేలు వాయించేవాడు. అది ఏమంత బాగుం డేది కాదు. ఒక నీగ్రో యువతి పియానో వాయించేది. ప్రధానం అయి పోయినాగూడా, నా ఆర్జన చాలనందుకు వివాహం కొంతకాలం వాయిదా వేశాము.

డెల్లా తండ్రి ఫోర్కర్ మా వూళ్ళో ఒక ప్రముఖ వర్తకుడు. గుఱ్ఱపు పందెములలో పాల్గొనేవాడు. బండగుఱ్ఱాలంటే ఆయనకి చాలా సరదా. రెండు చక్రాల చిన్నబండీ ఎక్కి పందాలకి వెళ్ళి ఎంతో ఆనందం పొందేవాడు. పందెంలో నురగలు కక్కుతూ వెళ్ళే కొన్ని గుఱ్ఱాలని మిగతా గుఱ్ఱాలని దాటి పరుగెత్తమని గెట్టించేవాడు. వివాహం చేసుకుందామని నిశ్చయించుకున్న క్రొత్తలో, డెల్లాని ఇల్లు వదిలిపెట్టి నాతో వచ్చెయ్యమని అడగలేకపోయాను. అందుకు కారణం నా స్వల్ప ఆదాయమే. అయినప్పటికీ ఎల్లిస్ దాటితే మరే యితర ప్రదేశంలోనైనా మంచి అవకాశాలు లభించవచ్చని మేము నిశ్చయించుకున్నాము. స్త్రీల అజమాయిషీలోవున్న మా వూరి ప్రజలు మేము పౌరద్రోహులమని ఎంచితే, చిన్న పట్టణాలనిండా అలాటి యువకద్రోహులున్నారని ఒప్పుకోవలసి వస్తుంది. అంతేకాదు; నాకు బయటవూళ్ళల్లో తిరగాలనే తహతహ వుండేది. ఇతర ఫ్యాక్టరీలలో పనిచేయాలనీ, కొంత సాహస కృత్యాల్లోకి దిగాలనీ ఆశగావుండేది.

ప్రణయం విషయంలో మాత్రం నా వయసుకు మించిన వివేకాన్ని ప్రదర్శించాను. నా డెల్లాతో సరితూగే అమ్మాయి ప్రపంచంలో మరెక్కడా లేదనే ఆత్మఘోషని పాటించాను.

కాన్‌సాస్ పట్టణశాఖనుంచి ఒక వృద్ధుడు నాకు వ్రాసిన ఉత్తరం ఈనాడూ నా బల్లమీద పడివుంది. అతనికి నన్ను మళ్ళీ చూడాలనీ, కరచాలనం చేయాలనీ, మాట్లాడాలనీ వుందిట. ఉత్తరంలో యిలా వ్రాశాడు "అంతా పూర్వంలాగే వుంది. కొన్నేళ్ళ క్రిందట నువ్వు యూరప్‌నుంచి కాన్‌సాస్ పట్టణంమీదుగా తిరిగి వెళుతున్నప్పుడు ఎలా వుందో అలాగేవుంది. నా బుజంమీద ఇంకా నీ చెయి వున్నట్లే అనిపిస్తుంది. నీ నేత్రాల్లో కాంతిరేఖని చూస్తున్నట్లే వుంటుంది. ఉత్తరంమీద నీ, స్నేహితుడు గస్" అని సంతకంచేశాడు. అతనిలాగే, నా ఆత్మా పాతస్మృతులతో నిండిపోయింది. ఆ రోజుల్లో అతన్ని న్యూబర్టు అనేవారు.

మా ఫ్యాక్టరీలో ప్రధానోద్యోగి పదవిని విడిచిపెట్టి, ఎటికన్. టోపికో, అండ్ శాంతాఫీవారి దగ్గర న్యూబర్టు పెద్ద ఉద్యోగం సంపాయించాడు.

అంతకు చాలా రోజుల క్రితమే అతని ముఖాన పీచు విసిరేసిన నా ఘోర తప్పిదాన్ని న్యూబర్టు క్షమించాడు. అతను ఎల్లీస్ వదిలివెళ్ళటం మూలానే అనుకుంటాను తర్ఫీదు పూర్తవుతూనే నాకూ ఆ వూరు వదిలి పెట్టాలనే బుద్ధిపుట్టింది. నాకు వేరే వూరి ఫ్యాక్టరీలో పనిచెయ్యాలనే పిచ్చిపట్టుకుందనీ, నిరుత్సాహ పడిపోతున్నాననీ ఆఖరికి యింట్లోవాళ్ళూ తెల్సుకున్నారు.

నాన్న రైళ్ళల్లో తరుచు ప్రయాణం చేసేవారిని చూశాడు. ఆ విషయం హెచ్చరిస్తూ మనఃపూర్వకంగా నాతో యిలా అన్నాడు "ప్రపంచమంతా చూడాలి కొత్త విషయాలు తెల్సుకోవాలి అనే ఉద్దేశంతోనే వాళ్ళు ఆ వుద్యోగాలు ప్రారంభించివుంటారు. ప్రపంచంలో కల్లా మంచి రైలుకంపెనీ యూనియన్ పెసిఫిక్. అటువంటప్పుడు యింకో కంపెనీలో వుద్యోగం వెదకటంలో అర్థమేమిటి? ఇక్కడ నీకూ నాకూ గూడా బోలెడుమంది స్నేహితులున్నారు. ఇంకో వారంలోనో ఎప్పుడో నీకు రోజు కూలీ బత్తెం వస్తుంది. ఈ ప్రాంతంలో నీకంటె మంచి శాస్త్రజ్ఞుడు మరొకడు లేడని ఈస్టర్ బ్రూక్ నాతో చెప్పాడు. నువ్వు ఎల్లీస్‌లోనే స్థిరపడిపోవాలి."

స్థిరపడిపోవడమా? చిక్కంతా అక్కడేవచ్చింది. పూర్తిగా స్థిరపడిపోయే వుద్యోగం నాకు ఇంతవరకూ దొరకలేదు. ఎల్లీస్‌లోనే వుంటేంత దుర్భరం మరొకటిలేదు. మేమంతా నాట్యం చేసేటప్పుడు చిన్న లోటాడు సాగాయి తాగితే వూళ్ళో ఆడవాళ్ళందరికీ తెలిసిపోయేది. వెంటనే చర్చలు ప్రారంభించేవారు.

అంతేకాదు; ఎల్లీస్‌కంటె మరేవూరయినా బాగుంటుందని నాకు తెలుసు. ఎల్లీస్‌కి పరాయి వూరినుంచి వచ్చినవాడెవరైనా సరే నాకు తెలియని అనేక విషయాలని గురించి మాట్లాడేవాడు. అమ్మా నాన్నా దగ్గిర వెళ్ళిపోతాననటానికి ఒకటే కారణం దొరికింది. నాలో ఉత్సాహం వుంది. ముందుకి పోనివ్వమన్నాను.

అప్పటికి దువ్వెన దెబ్బలతో లొంగదీయలేనంత పెద్దవాడనయాను. అందుకని అమ్మ కన్నీళ్ళతో నన్ను తన వైపుకి త్రిప్పుకోవటానికి ప్రయత్నించింది. మధ్య మధ్య వివేకంతో నాన్న మాట వినమని బతిమాలింది. ఇంటి దగ్గిర తినే లాటి భోజనం అన్ని చోట్లా దొరకదని జ్ఞాపకంచేస్తూ మరి కొంతసేపు దుఃఖించింది. నేను ఏమీ వాదించలేకపోయాను. టోపీ తీసుకుని బైటికి పరుగెత్తి తలుపు వేసేశాను. వాళ్ళు చాలా మూర్ఖంగా వాదించదలచుకున్నారని నాకు తెలుసు. అందుకనే వాళ్ళ మాటలు వినదలచుకోలేదు. అయినా ఫ్యాక్టరీలో అందరికీ నామీద యిష్టముండేది.

నేను బాగా పనిచేసేవాణ్ణి. నాపై అధికారిని సంతుష్టపరచటానికి నిత్యం ప్రయత్నించేవాణ్ణి. మంచి యంత్రశాస్త్రజ్ఞుడనే అయినా, నేల వూడవమంటేగూడా వూడ్చేవాడను. కాని అప్పటికే మనసులో నిశ్చయం చేసేసుకున్నాను కాబట్టి, ఈస్టర్ బ్రూక్‌ని చూసేందుకు వెళ్ళాను.

"మీరు నన్ను చాలా దయతో చూశారు. నేను యంత్రశాస్త్రజ్ఞుడనయానంటే అది మీ చలవవల్లనే! అది ఎన్నటికీ మరచిపోలేను" అంటూ ఆయన బల్లవైపు నడిచాను.

"ఏం వాల్టర్! నువ్వు బాగా పనిచేసినందుకు నాకెంతో సంతోషంగా వుంది....."

"కాని నేను ఇక్కడనుంచి వెళిపోతున్నాను."

ఆయన ముఖం బాగా మారిపోయింది. నా కృతజ్ఞతని అందుకున్న ఆయన ముఖంలోని చిరునవ్వు ఆర్పేసిన దీపంలా ఒక్కసారి మాయ మయింది. ఆయన చాలా ఆశ్చర్యపడ్డాడు. మనసు నొచ్చుకున్నారు.

"ఏదైనా జరిగిందా వాల్ట్?"

"లేదండీ! ఏమీ జరగలేదు. నాకు ఇంకా అనుభవం సంపాదించాలని వుంది. అంతే. నేను మంచి యంత్రశాస్త్రజ్ఞుడననే విషయం నాకు తెలుసు."

నా శక్తి సామర్థ్యాల విలువని తూనిక వేసే అలవాటు వుండేది నాకు. అందుకనే ఆయన నవ్వారు. "మీరు ఏపని చెప్పినా చెయ్యగలను ఈస్టర్ బ్రూక్. కాని నాకింకా ఎన్నో విషయాలు నేర్చుకోవాలని వుంది."

"వాల్ట్ నువ్వు మా కంపెనీలోని మంచి యంత్రశాస్త్రజ్ఞుడివి. వెళ్ళొద్దు" అన్నారాయన గంభీరంగా.

"నన్ను క్షమించండి."

"ఎక్కడికి వెళుతున్నావ్?"

"శాంతా ఫీలో ఉద్యోగంకోసం ప్రయత్నించ బోతున్నాను."

"ఎక్కడ?"

"అరకన్ సాస్ పట్టణంలో న్యూబర్టు నాకు ఒక ఉద్యోగం యిసాడు."

ఆ తర్వాత కొద్దిరోజులకి న్యూబర్టుకి ఒక ఉత్తరం రాశాను. ఉద్యోగం చూసిపెడతానని అతను సమాధానం యిచ్చాడు. ఉద్యోగం మాశాడుకూడా. కాన్ సాస్ లో వెల్లింగ్ టన్ దగ్గర శాంతాఫీ ఫ్యాక్టరీకి వెళ్ళమంటూ అతని దగ్గరనుంచి ఒక పెద్ద వుత్తరం వచ్చింది. అందులో షెర్ వుడ్ అనే వ్యక్తికి నన్ను పరిచయంచేస్తూ ఒక ఉత్తరం జతపరచివుంది.

పొద్దుట బండీలో వెల్లింగ్ టన్ కి వెళ్ళేటప్పుడు అమ్మ బుట్టనిండా భోజనం కట్టియిచ్చింది. రెడ్ ఇండియన్ల రాజ్యం అంచున సమ్మర్ కౌంటీలో ఎల్లిస్ కి ఈశాన్యం వైపున వుంది వెల్లింగ్ టన్. నేను అలా వెళ్ళిపోవలసివచ్చింది. ఆ విషయం నాకు ఇప్పుడు తెలుసు. ఇంటినుంచి వెళ్ళిపోయి బైట ప్రపంచంలో నేనూ ఒక మనిషిగా నిలబడే అవకాశాన్ని కల్పించుకోవలసివచ్చింది.

# నా ప్రయాణాలు

క్రొత్త లండన్‌లో నేనూ నా భార్యా ఒకసారి నృత్యం చేయటానికి వెళ్ళాము. ఏత్, హార్వర్డు పందాల్లో గుంపునిచూస్తే నా గతమంతా జ్ఞప్తికి వచ్చింది. ఒక్క అరనిముషంలో, నేను అమాయకుడనై పోయినట్లూ, అక్కడ ఎక్కువసేపు ఉండవద్దని ఎవరో నన్ను హెచ్చరిస్తున్నట్లూ అనిపించింది.

అక్కడికి మేము పెద్ద పడవమీద వెళ్ళాము. అదే మొదటిసారి మేము పడవ ఎక్కటం. గోధుమవర్ణం ద్రూనుతో చెక్క, తెల్లని రంగు, ఇత్తడి పూతతో మిలమిలలాడుతూ అందంగావుంది ఆ పడవ. పందెములు అయిపోయాక, గ్రీస్‌వోల్డు హోటల్లో భోజనాలు. నృత్యం చేశాము. ఆ రాత్రి దాదాపు అందరూ అక్కడే వున్నారనుకుంటాను. హోటలు మెట్ల మీద దట్టంగా తివాసీలు పరచివున్నాయి. నాట్యం చేయటానికి వెళ్ళబోయేముందు మెట్లపైన డెల్లా నా చెయ్యిపట్టుకుని యిలా అంది.

"వాయిద్యగాళ్ళలో ఆ తెల్లని జుత్తువున్న మనిషిని చూడు. అతను జో మాకహన్ కదూ?"

మసక మసకగావున్న దీపాల వెలుతురులో వాయిద్యగాళ్ళ మధ్య ముందు ఒక పెద్ద బాకాకోసం వెదికాను. అది కనపడుతూనే లావుగా కండగడ్డరంగు ముఖంతో జో కనుపించాడు. ఆ రాగం పూర్తయేంతవరకూ మేము అక్కడే నిలబడ్డాము. తర్వాత "ఏయ్! జో" అని పలకరించాను. "కులాసానా వాల్ట్? ఈమె డెల్లా కదూ?" అన్నాడు అతను. జో మళ్ళీ వాయిద్యంలో పని ప్రారంభించవలసివచ్చేంతవరకూ, మేము ముగ్గురం, మా చిన్నతనం గురించీ, ఎల్లీస్, కాన్సాస్‌ల గురించీ ఖబుర్లు చెప్పుకున్నాము. వాయిద్య గోష్ఠి పూర్తయేంతవరకూ గాయకుల నాయకుడు బెత్తంతో బల్ల మీద కొడుతూనే వున్నాడు. అది అయిపోగానే జో వచ్చేశాడు. కాని ఆ తర్వాత చాలాసేపటివరకూ హళ్ళీమాన నేనూ జో గడిపిన రోజులూ, ఆనాటి విషయాలు నెమరువేసుకుంటూ కూర్చున్నాము. మేమిద్దరం

అప్పుడు మేమిద్దరమూ యంత్రశాస్త్రజ్ఞులమే. ఇద్దరికీ వాయిద్యాగాళ్ళతో కలసి వాయించటం వచ్చు. ఇద్దరం గూడ్సుబండీలో టిక్కెట్టు లేకుండా ప్రయాణం చెయ్యడానికీ దారిద్ర్యానికీ అలవాటు పడ్డాం. ఉద్యోగం వెదుక్కుంటూ ఇతర చోట్లకి వెళ్ళవలసివచ్చినప్పుడు తరుచు నేను గూడ్సు బండీ ఎక్కేవాణ్ణి. ఆ రోజుల్లో వుద్యోగం వేట అంటే ఎలా వుంటుందో నాకు బాగా తెలుసు.

కాన్సాస్ వెల్లింగ్టన్‌లో యంత్రాధికారి కార్యాలయానికి వెళ్ళాను. ఆ గది చాలా బాగుంది. గోడలమీద కొన్ని పటాలు వేళ్ళాడు తున్నాయి. సిందూరపు వర్ణం పూసివున్న బల్ల బంగారు రంగులో మెఱుస్తోంది. దానిమీద గీకులు, గంట్లువున్నాయి. ఆ బల్ల అడుగు అర దగ్గర నేను నిలబడ్డ చోట రాపిడికి సొరుగు అరమీద రంగుమెరుగు పోయింది. బల్ల వెనుక ఒక తిరుగుడు కుర్చీలో నా అధికారి కూర్చు నున్నాడు. నన్ను ఆయనికి పరిచయంచేసే ఉత్తరాన్ని చదువుకున్నాడు. ఆయన పేరు షెర్వుడ్. ఆయన భాష విదేశభాషను మల్లే విచిత్రంగా వుంది. ఆ తర్వాత షెర్వుడ్ ఆంగ్లేయుడని తెలిసింది.

"నువ్వు మంచి యంత్రశాస్త్రజ్ఞుడంటున్నారు న్యూబర్టు"

"అవునండీ"

అతను న్యూబర్టు ఉత్తరవుల ప్రకారం చేస్తాడని నాకు తెలుసు.

"అనుభవజ్ఞుడైన యంత్రశాస్త్రజ్ఞుడిని కావటానికి చాలా చిన్న వాడిలా కనుపిస్తున్నావు. నీ కెన్నేళ్ళు?"

ఒక ధూమయంత్రం గంటలో పెద్ద శబ్దం చేసుకుంటూ అప్పుడే కటికీ బైట వెళుతోంది. దానికేసి చూస్తూ "ఇరవైమూడు" అని సమాధాన మిచ్చాను. నిజానికి ఇంకా పదినెలలు చిన్నవాణ్ణి.

"ఇరవై మూడేళ్ళంటే నీకు ఎక్కువ అనుభవం వుండివుండదు" షెర్వుడ్ అనుమానంతో "నీకు వాల్వులు పెట్టటం చాతనవునా?" అన్నాడు.

"న్యూబర్టుకి సంతృప్తి కలిగేటంతగా వాల్వులు పెట్టగలను."

ఇంకా నమ్మకం కుదరనట్లుగా అతను నన్ను ఎగాదిగా చూశాడు.

"లాడాలని పెట్టటమూ మరలని బిగించటమూ వచ్చునా?"

రైలుబళ్ళ మరమ్మత్తు, తనిఖీ సందర్భాలలో అది చాలా కష్టమైన పని.

"లాడాలని పెట్టగలను"

"అంత అనుభవం వుండేందుకు చాలా చిన్నగా కనుపిస్తున్నావు. అంతెందుకు! మా ఫ్యాక్టరీలో నీకంటె పెద్దవాళ్ళు వున్నారు. వాళ్ళకే అంత ముఖ్యమైన, కష్టమైన పనులను ఒప్పగించను. కాని న్యూయార్క్ సిఫారసుమీద నిన్ను పనిలో పెట్టుకుంటాను. ఇక్కడ కార్మికులకి మూడు కాలుగా జీతాలిస్తాము. బాగా పనిచేసేవాళ్ళకి గంటకు $27\frac{1}{2}$ సెంట్లు. తర్వాత వాళ్ళకి పాతిక సెంట్లు, తక్కువ అనుభవం వున్నవారికి, తన వృత్తిని యింకా అభివృద్ధి చేసుకుందుకు వెల్లింగ్ టన్ వచ్చే లాతే పనివారికీ గంటకి $22\frac{1}{2}$ సెంట్ల చొప్పున యిస్తాము."

"నేను లాతే పనివాణ్ణికాను. ఫ్యాక్టరీలో అన్ని పనులూ చెయ్యగలను."

"చూద్దాం. ఏ రకం బత్తెం యిస్తామో చెప్పేముందు నువ్వు రెండు వారాలు పనిచెయ్యాలి."

"అలాగే. రెండు వారాలు పనిచేస్తాను. కాని నాకు ఎక్కువ బత్తెం రాకుంటే ఉద్యోగం అక్ఖరలేదు."

"మొండి కుర్రాడు" అంటూ షెర్‌వుడ్ తన అభిప్రాయంతో ఏకీభవిస్తాడా లేదా అన్నట్లు సమీపంలోవున్న సహావుద్యోగి కళ్ళల్లోకి చూశాడు.

"లేదండీ. నేను మంచి యంత్రశాస్త్రజ్ఞుడను మాత్రమే" అన్నాను.

షెర్‌వుడ్ చేతిని గడ్డంమీదికి పోనిచ్చాడు. బహుశః నవ్వుకున్నాడనుకుంటాను. బిల్ హార్టు అనే ఖార్ఖానా ప్రధానోద్యోగి దగ్గరకి వెళ్ళమని ఆజ్ఞాపించాడు. షెర్‌వుడ్ నా శక్తిసామర్థ్యాలని గురించి వేసిన ప్రశ్నలన్నీ నా అహంకారాన్ని గాయపరిచాయి. ఇంటి దగ్గిర నేను మంచి

యంత్రశాస్త్రజ్ఞుడననే విషయం అందరికీ తెలుసు. నీళ్ళకొాగులతో, చట్టాలతో చేసే పెద్ద పనులు మాకు ఎల్లీస్ కార్ఖానాలో నేర్పలేదు. కాని నిజంగా కష్టమైన పనులన్నీ సమగ్రతతో నిర్వహించాను. ఆ రోజుల్లో అవి నాకు మరీ బాగా తెలిసివుండాలి. ఎందుకనంటే నా ప్రవర్తన ప్రధానో ద్యోగి హార్టుని కాస్త తికమక పెట్టింది.

"నీకు వాల్వులు పెట్టటం వచ్చును అన్నావుకదూ? సరే! ఈ పనిచెయ్యి" అంటూ అప్పుడే శాంతాఫీవాళ్ళు క్రొత్తగా కొన్న ధూమ యంత్రాన్ని వ్రేలితో చూపాడు. ఆ పనిని గురించి నాకు బొత్తిగా ఏమీ తెలియదు. కాని మార్గపు గుర్తులని తీసుకుంటూ పని ప్రారంభించాను. కొద్ది సేపట్లో హార్టు నా వైపు పరుగెత్తుకుంటూ వచ్చాడు. తన చమురు చేతిని కొట్టేటట్లుగా నా వైపు చూపుతూ, "వద్దు! వద్దు! ఆ గుర్తులన్నీ నువ్వు మళ్ళీ పెట్టనక్కరలేదు. నిన్ననే నేను పెట్టాను" అన్నాడు.

వెంటనే సమాధానం చెప్పకుండా ఇంకో ఉక్కుపెట్టె మూత తెరిచాను. నేను తొందరపడి సమాధానం చెప్పదలచుకోలేదు. కాని నోరు తెరిచినప్పుడుమటుకు "అయ్యుండొచ్చు హార్టు! కాని ఈ వాల్వులని పెట్టాలంటే గుర్తులని నేనే స్వయంగా వేసుకుంటాను" అన్నాను. ఆగర్ డార్లింగ్ సలహాని నా జీవితంలో అంత తొందరగా మరచిపోదలచుకో లేదు. అతని మాటలు నా మనసులో బాగా నాటుకుపోయాయి.

హార్టు నా వంక ఉరిమి చూశాడు. నిజానికి అందులో అతన్ని నిందించవలసినదేమీ లేదు. బాధ్యతాయుతుడైన ప్రధానోద్యోగంతటి వ్యక్తికి నా ప్రవర్తన కంటగింపుగా వుండుంటుంది. హార్టు నామీద పెద్దగా అరుస్తూ వెళ్ళిపోయాడు. అక్కడ నిలబడ్డ శిక్షణదారుడు నాతో రహస్యంగా ఇలా అన్నాడు. "అతను స్వయంగా ఈ వాల్వులని పెట్ట లేకపోయాడు. నిన్న ప్రయత్నించి చూశాడు. ఇవేళ అదేపనిలో పరీక్ష కోసం నిన్ను పెట్టారు. నీ పని చెడగొట్టేందుకు ప్రయత్నిస్తున్నాడు."

తర్వాత ధూమయంత్రం అంతా పరీక్షచేశాను. బండిలో కొన్ని కొత్త వస్తువులు కనుపించాయి. కాని వెనుకప్రక్క మీటచూస్తే, నిడు

పాటి కన్నంలో నీటి వదులుగా లేదు. బిరడా మాయమవటం కనుపించింది. ఆ కన్నంలో ఒక బిరడా పెట్టి, నవ్వుకుంటూ బండి దిగి వెళ్ళి పోయాను. వాల్వులు బైటికితీసి, చూసి, మళ్ళీ పెట్టేశాను. అన్నీ సరిగ్గా వున్నాయని తెలిసింది. సామాన్యంగా వాల్వులు పెట్టే సమయం కంటె తక్కువ వ్యవధిలోనే పాత్తరముల్లోంచి బండి చక్రాలు తీసేశాను. వెంటనే హార్టు దగ్గరకెళ్ళి ఇంకోపనికి సిద్ధంగా వున్నానని చెప్పాను.

"ఏమిటీ?" అని బిగ్గరగా ప్రశ్నించాడతను.

"ధూమయంత్రం సిద్ధంగావుంది."

"క్రిస్లర్. ఈ కొద్ది సేపట్లోనే ఆ వాల్వులని సరిగ్గా పెట్టేశానం టున్నావా?"

"అవును. దాన్ని బైటికితీసి నడిపించి చూడండి. సరిగానేవుంది."

"వాల్వులు పెట్టే మనిషినని చెప్పావుకదూ? సరే..."

"నిజంగా నేను వాల్వులు పెట్టేవాడినే. ఆ ధూమయంత్రం..."

"క్రిస్లర్. నిప్పు రాజేసిన తర్వాత అది వెళ్ళవలసిన విధంగా వెళ్ళక పోతే—నీ వుద్యోగం పోతుంది."

"ఆ యంత్రానికి వరుసగా బండీలు తగిలించినా సరే తీసుకెళ్ళి పోతుంది. అంతకంటె నన్నేం చెయ్యమంటారు?"

వెంటనే ధూమయంత్రంలో నిప్పు రాజేశారు. నేను చెప్పినట్లుగానే అది బండీలు లాక్కెళ్ళింది. ఆ తర్వాత కొద్దిసేపటికి షెర్వుడ్ నాకోసం కబురంపి, ధూమయంత్రాన్ని గురించి అడిగాడు. హార్టుకి ఏ సంగతీ చెప్ప టానికి నిరాకరించానుగాని యంత్రాధికారికి బిరడా విషయం వివరించాను. అతను సంతోషంతో తనలో తను నవ్వుకున్నాడు. ఆ తర్వాత రైలు గమనం నిలిపే వాయుసాధనం దగ్గర నాకు పని దొరికింది. హెచ్చు బత్తెమే లభించింది. కాని విచారించవలసినదల్లా అప్పట్లో నేను బాగా చిన్నవాడనుగా ఉండడమే.

ఎల్లిస్ కంటె వెల్లింగ్ టన్ బాగా పెద్దది. నేను పెద్ద నగరవాసుడ నయినట్లే అనిపించింది. వూరు కొత్తగా సరదాగావుంది. మొదటిసారిగా ఇంటినుంచి వెళ్ళిపోయి, స్వతంత్రంగా జీవించే కుర్రాడిలో కలిగే గగుర్పాటు క్రమంగా అంతరించిపోయి, స్వేచ్ఛా జీవనం ఎంతో నిస్సారమైనదిగా తోచింది. ఒంటరిగాడినై పోయాననని తెలుసుకున్నాను. ఇంటికి వెళ్ళిపోవాలనే బెంగపట్టుకుంది. నాకెవరూ స్నేహితు లుండేవారు కారు. హోటల్లో వుండటం అక్కడనుంచి రెండుమైళ్ళు నడిచి పనికివెళ్ళటం, తొట్టిలోంచి భోజనం తీసుకుతినటం, అన్నీ అసహ్యం పుట్టాయి. ఎల్లిస్‌లో రాత్రిళ్ళు పనిచేసినప్పుడు మటుకే అన్నం ముంత తీసుకుని వెళ్ళేవాడిని. ఎన్నో రోజులు మధ్యాహ్నం పూటలు ఇంటికి వెళ్ళి అమ్మ వండిన దివ్యమైన భోజనంతో కడుపునిండా తినేవాణ్ణి. హోటలు పనిగత్తె నా తొట్టిలో పడేసే రసంలేని గొడ్డుమాంసపుముక్కలు. నాన బెట్టిన ఆపిల్ ముక్కచూస్తే అమ్మ కోపగించుకునుండేది. వెల్లింగ్ టన్ నాయిద్యగాళ్ళతో చేరి వాయించటానికి నా బాకానైనా తెచ్చుకోకపోతినే అనుకునేవాడను. తీసుకు రాకపోవటమే మంచి పనిచేశానేమో అనుకునేవాణ్ణి మళ్ళీ. ఒకొక్కప్పుడు ఇంటికి వెళ్ళిపోతే బాగుండును అనిపించేది. జీతాలిచ్చే వారం రాకముందే డబ్బంతా ఖర్చుచేసేసినందుకు నన్ను నేనే నిందించుకుంటూ కూర్చునేవాడను.

ఒక రోజు కార్ఖానా బైట తలవంచుకుని మోకాళ్ళమీద మోచేతులు పెట్టుకుకూర్చున్నాను. నా చేతులు కాళ్ళమీద అచేతనంగా పడివున్నాయి. అప్పుడు నా కాళ్ళకెదురుగా ఒక పెద్ద పాదాల జతని గమనించాను. అవి మా కార్ఖానాలోకల్లా భారీమనిషైన ప్రిన్సు అనే నీళ్ళ కాగుచేసేవాడి పాదాలు. అతను చాలా పొడగరి. నిలుచుంటె దాదాపు ఆరు అడుగుల ఎత్తు వుండేవాడనుకుంటాను. నా తల అతని పెదిమలవరకూ వచ్చేది.

"క్రిస్లర్ ! నీకు సిగరెట్ కావాలా ?"

ప్రిన్సుది ఉదార హృదయం. అప్పుడు నాకు సిగరెట్ త్రాగాలనే వుంది. అతను పొగాకు యివ్వటంతోనే తొందరగా సిగరెట్ చుట్టటం మొదలెట్టాను.

ఊపిరి తిత్తుల్లోకి పొగపోనిచ్చి, ఒక్కసారి శ్వాస పీల్చగానే నవ్వటం మొదలెట్టాను. తలత్రిప్పి అతని ముఖంలోకి చూశాను. రాక్షసుడికి మల్లే ఆజానుబాహువు ప్రిన్స్. అయితేనేం ఉత్తమ స్వభావం కలవాడు.

"ఆ సిగరెట్ నీకు చాలా అవసరంలా కనుపిస్తుంది. నీ దగ్గిర ఎందుచేత అవి లేవు?" అన్నాడు.

"డబ్బు లేదు" అన్నాను.

"నువ్వు చుట్టుకునేందుకు బస్తాడు పొగాకు, కట్ట కాగితాలు కొనిపెట్టి వుంచుకో" అని సలహాయిచ్చాడు.

"నేను ఎప్పుడూ అవే త్రాగుతాను. కాని జీతాలిచ్చే రోజువరకూ నా దగ్గిర రాగిదమ్మిడీ వుండదు" అని చిన్నగా నవ్వాను. ప్రిన్స్ మళ్ళీ నా వంకచూసి ప్రేమగా, భావయుక్తంగా నవ్వాడు. సిగరెట్ అడిగేందుకు అభిమానపడ్డాను. కాని ప్రిన్స్ వచ్చి యిచ్చేటప్పటికి తీసుకున్నాను. దాంతో అతను నాకు ఒక మిత్రుడయ్యాడు. వెల్లింగ్టన్‌లో ఆ తర్వాత నేనూ ప్రిన్సూ స్నేహితులకు మల్లే తిరిగాము. ఒక సహచరుడు దొరకటం నాకు చాలామటుకు తెరిపి అనిపించింది. కాని ఆ నిస్సారమైన హోటలు భోజనాన్ని యింకా అసహ్యాచుకుంటూ సేవున్నాను.

ఒక రోజు కార్ఖానాలో ఒక సానుభూతిపరుడికి నా యిబ్బంది గురించి చెప్పాను. అతనొక కమ్మరివాడు. వృద్ధుడు. "నా యింట్లో ఒక ఖాళీ గదివుంది. నీ సామాన్లు తెచ్చుకుని మాతో ఉండదలిస్తే నేనూ నా భార్యా చాలా సంతోషిస్తాము" అన్నాడు.

వాళ్ళిద్దరూ చాలా మంచివాళ్ళు. పరస్పరాను రాగంగల అలాటి భార్యాభర్తలు మరెక్కడా వుండివుండరు. గదికీ, భోజనానికీ అంతా కలిసి నెలకి పన్నెండు డాలర్లు పుచ్చుకున్నాడు. అతని భార్యకి వంట చేయటం వచ్చు. నేను చాలా సంతోషపడ్డాను. నిజానికి అది మా యింటి దగ్గిర తినేంత మంచి భోజనంకాదు. కాని ఆ హోటలు భోజనం తిన్న తర్వాత, ప్రపంచంలోని భోజనపదార్థాలన్నిటికీ కొత్త రుచి వచ్చిం

దేమో అనిపించింది. నిజానికి అప్పటి నా స్థితికి ప్రిన్సు చాలామటుకు కారకుడు. ఆ రోజుల్లో మేమిద్దరం చాలా హాయిగా నవ్వుకు నేవాళ్ళం.

కాని ఇంటి బెంగ వున్నాకూడా చాలా ధైర్యంగా వుండేవాణ్ణి. కార్ఖానాలో ముఖ్యమైన పనులన్నీ నాకే ఒప్పజెప్పేవారు. ధూమ యంత్రాలని బిగించటంలో నా నేర్పుకి పై అధికారులంతా సంతృప్తి చెందుతున్నారని తెల్సుకున్నాను. అందుకనే అతిశయంతో ఇంగితజ్ఞానం విస్మరించి తప్పుత్రోవను పడ్డాను. కాని అంతకంటెగూడా పెద్ద కారణం యింకోటివుంది. ఇంటి దగ్గరవుండే శిక్షణ స్థానంలో ఆత్మశిక్షణ అలవరచుకో లేకపోయాను. అది లేకపోతే ఏ వ్యక్తి అయినా తొందరగా అవస్థల పాలవుతాడు.

వెల్లింగ్టన్‌కి ఒక జెట్టీల జట్టువచ్చింది. బహిరంగ కవాతు వుందని తెలిసి, వెళ్ళి చూడాలనుకున్నాను. కార్ఖానాలో కొంతమంది గూడా చూడాలనుకున్నారు. నన్ను అందరి తరఫునా హార్టుతో మాట్లాడేందుకు ఎన్నుకున్నారు. పాత గుడ్డముక్కతో చేతులు తుడుచుకుంటూ బిల్ హార్టు దగ్గరకి వెళ్ళాను. మా అందరికీ కవాతు చూడాలని వుందనీ, శలవు కావాలనీ అడిగాను.

చేతులు కట్టుకుని హార్టు నా వంక సూటిగా చూశాడు. అతని గడ్డంలో ఒక్కొక్క భాగం విడివిడిగా కదులుతోందా అనిపించింది. రెండు క్షణాల్లో అతను ఉగ్రుడైపోయాడు.

"నీ కేమైనా పిచ్చెక్కిందా? మీ అందరికీ ఏమొచ్చింది! వీల్లేదు! వీల్లేదు! వీల్లేదు!"

ఓర్మి నశించటం వల్ల అతను వెఱ్ఱిగా పేలాడు. అతని కేకలు వినిపించకపోయినా, అతని వెఱ్ఱిభంగిమల్ని బట్టి మిగతావాళ్ళు అంతా అర్థంచేసుకున్నారు. నేను ఆ సమాచారం చెప్పటానికి వెళ్ళేటప్పటికి, మండి పడ్డారు. మనుష్యులకి అన్నిటికంటె ముఖ్యమైంది గౌరవం. అందుకనే మా గౌరవం దెబ్బతింటూనే, ఆ విషయం హార్టుకి తెలియజెప్పాలి అనుకున్నాను.

స్నానాలుచేసి, పట్టణంలోకి వెళ్ళిపోయాము. కవాతు ఏమీ బాగా లేదు. ఏనుగులు. విదూషకులు. షీబారాణి, వున్నారేమో సరిగ్గా జ్ఞాపకంలేదు. నాకు గుర్తువున్నదల్లా ఒకటే. పక్కగా రాయిమీద నిలబడి కవాతు చూస్తూ నేను మరీ అంత మూర్ఖుణ్ణయిపోయినా నేమో అని చింతించాను. ఒక బిగ్ హార్టునేకాదు, కంపెనీ మొత్తం వదిలి పెట్టి వచ్చానని అప్పుడు అర్థమయింది. ఎటికన్. టోపీకో & శాంతాఫే లోని కార్మికులందరికీ పనిమానేసి, జట్టీలజట్టుని చూడాలని ఒకేసారి అనిపించివుంటే ఏమయ్యేదా అనుకున్నాను. వాయిద్యగాళ్ళు ముడతలు పడిన దుస్తులు వేసుకుని. డాంబికంగా వెళ్ళిపోతుండడం మటుకు జ్ఞాపకముంది. మంద్రపు వాయిద్యంలోంచి వినపడే నారి రాగాల్లో సంగీతం లేదు. రెండు గంటల్లో మేము తిరిగి వెళ్ళిపోయాము. పై బట్టలు తొడుక్కుంటున్నానో లేదో షెర్వుడ్ నావైపు రావటం కనుపించింది. అతను బెదిరించేరకమైతే నేనూ అలాగే బెదిరించి ఘంటేవాడననుకుంటాను. కాని అతను అటువంటిదేమీ చెయ్యలేదు. అతిగంభీరంగా శాంతంగా వున్నాడు.

"అనేక సంవత్సరాల రైలుకట్ట అనుభవంలోనూ ఇలాంటిది ఇంత వరకూ జరగలేదు. నిన్ను ఉద్యోగంలోంచి తీసెయ్యవలసిందే. మిమ్మ అందరినీ ఇప్పుడే ఇక్కడే తీసివెయ్యాలి. నీకు ఆ విషయం తెలుసు. నాకూ తెలుసు. కనుక నేను చెయ్యగలిగిందే చెయ్యటంవల్ల ఏమీ లాభం లేదనుకుంటాను. నేను ఆ పని చెయ్యగలనని నీకు తెలుసు" అంటూ ప్రారంభించాడు షెర్వుడ్.

"అవునండీ"

"సరే. మిమ్మల్ని ఎవర్నీ వుద్యోగంలోంచి తీసెయ్యటంలేదు. ఇక్కడ పనిలో వుంటేంతవరకూ మీలో ఎవ్వరుగానీ మళ్ళీ ఇటువంటి పని చెయ్యరని మటుకు ఆశిస్తున్నాను" అన్నాడు.

నేను కన్నీళ్ళు పెట్టుకునేంత పని చేశాను. బహుశః మిగతావారికీ అలాగే అనిపించివుంటుంది. మేము చాలా అసహ్యంగా ప్రవర్తించామని తెలుసుకున్నాను.

"నన్ను క్షమించండి షెర్‌ఫుడ్. నేను అంత మూర్ఖంగా ప్రవర్తించ కుండా వుండవలసిందని యిప్పుడు, తెలుసుకుంటున్నాను." వెళ్ళవద్దని చెప్పే విధంలో హార్ట్ మమ్మల్ని కొంచెం గెచ్చగొట్టాడు. "నేను చాలా విచారిస్తున్నాను. మిగతావాళ్ళూ విచారిస్తున్నారనుకుంటాను. ఇటువంటి దేదీ మళ్ళీ చెయ్యనని మాట యిస్తున్నాను."

షెర్‌ఫుడ్ తలని అడ్డంగా త్రిప్పి వెళ్ళిపోయాడు. ఆ వివాదాన్ని గురించి మరొక్క మాట అనలేదు.

ఇంటి దగ్గిర అమ్మ నాకోసం బెంగపడుతూనే వుంది. నాన్నా అంతే. తన ఉత్తరాల్లో నేను తిరిగి ఎల్లీస్ కార్ఖానాకి వచ్చి పని చేయటంలో వుండే లాభాలని వివరించేవాడు నాన్న. తను హాయిగా లేనని వ్రేసేది అమ్మ. కాని ఆ స్థితిలోవున్నది అమ్మ ఒక్కర్తె కాదు. నాకూ సుఖంగా వుండేదికాదు. స్వేచ్ఛగావుండడం బాగానే వుండేదికాని బట్టలు శుభ్రంగా వుండాలంటే చాకలిదాని దగ్గిరకి స్వయంగా బట్టలు తీసుకు వెళ్ళటం నాకు కష్టంగా వుండేది. కొంతప్పుడు తినే భోజనం సయించేది కాదు. ఇంటిదగ్గిర ఆఖరి కొడుకైన నాకు నచ్చే పదార్థాలనే అమ్మ ఎప్పుడూ వండేది. నా తల్లితండ్రులూ, నా యిల్లూ, డెల్లా ఫోర్కరూ లేని కొరత నన్ను చాలా బాధించింది. డెల్లా నేనూ అనురాగంతో ఉత్తరాలు రాసుకునేవాళ్ళం. ఫ్రాంక్ మిల్లర్ అనే యంత్రాధికారి దగ్గిర నుంచి ఉత్తరం రావటంతో నా పరిస్థితి చాలామటుకు కుదుటపడింది. గంటకు ముప్పై సెంట్లు చొప్పున ఎల్లీస్ కార్ఖానాలో వుద్యోగమిస్తానని రాశాడతను. ఎల్లీస్ కార్ఖానాలోని కార్మికులందరి ఉత్తమ సంపాదనకంటె అది మూడుసెంట్లు ఎక్కువ. మిల్లర్ యిచ్చిన వుద్యోగం అంగీకరించి యింటికి వెళ్ళాను. ఇంటిదగ్గర డబ్బున్నవాడెవడూ తిననట్టి చక్కటి భోజనం తిన్నాను.

నా కొత్త పని రాత్రి యంత్రశాస్త్రజ్ఞుడిగా వుండటం. అంటే రాత్రి మేస్త్రీ పని. ఒక రైలుకి ధూమయంత్రం కావలసివస్తే రైలురవాణా చేసే కార్యాలయంవారు నాకే టెలిఫోను చేసేవారు. అలాటి పిలుపు

రాగానే ధూమయంత్రం కార్మికులని కుర్రాడిచేత కబురుపంపటం, నిప్పు రాజెయ్యటం, కొగులో నీళ్ళు నింపటం, యంత్రాన్ని ప్రయాణానికి సిద్ధ పరచటం మొదలైన పనులన్నీ చూచుకోవటం నా బాధ్యతే. అట్లాగే రైలుబండీని ఎల్లిస్‌కి తీసుకెళ్ళిన వ్యక్తి ధూమయంత్రాన్ని జాగ్రత్తగా తిరిగి తీసుకువచ్చాడా లేదా చూడాలి. మా కంపెనీలో పత్రికలాటి ఒక పుస్తకం వుండేది. పని పూర్తవుతూనే, ప్రతి యంత్రశాస్త్రజ్ఞుడూ తన ధూమయంత్రానికి కావలసిన మరమ్మత్తులని గురించి అందులో వ్రాసేవాడు. ఆ పుస్తకంలో నీళ్ళకొగుని శుభ్రంచేయటం, పొగగొట్టాలని గట్టిపరచటం, రైలు గమనాన్ని నిలిపే సాధనాలని సరిచేయటం మొదలైనవన్నీ వుండేవి. నాన్నకి పెద్ద రైలుని నడపటం బాగా తెలుసును. అతని ధూమయంత్రానికి చాలా అరుదుగా మరమ్మత్తు అవసరమయేది. తరుచు పుస్తకంలో "చిన్న చక్రాలకీ, పెట్టె బండీలకీ నూనె వెయ్యండి" అని మటుకు వ్రాశే వాడు. చాలా మంది కార్మికులు నాన్నని "చక్రాలకి నూనె వెయ్యండనే హాంక్" అని పిలిచేవారు.

ఇంటికెళ్ళిన కొద్ది నెలలకే నాలో అశాంతి ప్రారంభమయింది. వెల్లింగ్‌టన్ తర్వాత ఎల్లిస్ మునపటికంటె చాలా చిన్నదిగా కనుపించింది. కాని నేను ఆ విషయమై చెప్పినప్పుడల్లా అమ్మ గుడ్డ అడ్డుపెట్టుకుని నెమ్మదిగా దుఃఖించేది. నా ఆరోపణ దేనికి దారి తీస్తుందో ఆమె గ్రహించింది. ఆ విషయం డెల్లా ఫోర్కురుకి తప్ప మరెవరకీ అర్థమయేది కాదనుకుంటాను. నాకు ఆశయాలున్నాయని చెబితే డెల్లా తలపంకించేది. నాకూ ఒక రోజు యంత్రాధికారి నవాలని వుంది అని ఆమెతో చెప్పటానికి సాహసించాను. నా స్వప్నం నిజంగా సిద్ధించాలంటే నేను నేర్చుకోవలసింది యింకా చాలా వుందని గ్రహించాను. అందుకే ఇంకా అనుభవం సంపాయించటానికి పెద్ద చోటుకి వెళ్ళాలని అనిపించేది. చాలా రోజుల వరకూ నేను ఏమి చేయదలచుకున్నదీ నా మనసుకే నిర్ధారణగా తెలియ లేదు. కాని చిట్టచివరకి డెన్‌వర్‌కి అభ్యర్థన పెట్టుకుంటూ మళ్ళీ వుద్యోగం వదిలేశాను.

నాతో ఒక చిన్న పెట్టెని తీసుకెళ్ళాను. అందులో నా బట్టలమధ్య కొలతలు వేసే పనిముట్లు, ఒక బద్దపెట్టుకున్నాను. అమ్మ భోజనం కట్టి యిచ్చిన తోలు పెట్టెగూడా పట్టుకెళ్ళాను. ఇవిగాక గుంౘని తోలు సంచీలో బంగారు గంట వున్న నా బాకాని పెట్టుకున్నాను. ఈసారి దేనికోసమూ విచారపడకుండా వుండాలని నిశ్చయించుకున్నాను. రాత్రి బండిలో పన్నెండుగంటల ప్రయాణంలోనూ బాకాని తలగడగా ఉపయోగించుకున్నాను.

డెన్‌వర్‌లో కొలరేడో సదరన్ కార్ఖానాలో నాకు ఒక వుద్యోగం దొరికింది. ఆ చోటు నాకు నచ్చలేదు. చాలా భీభత్సంగా, అనాగరికంగా వుంది. సాయంత్రంపూట ఏ వీధిలోకి వెళ్ళినా, భయంకరంగావుండే జబ్బు మనుష్యులు చిప్పలు పుచ్చుకుని ముష్టివెయ్యమని పీడించేవారు. పెదిమలతో నెమ్మదిగా బతిమాలుతేనేం, కళ్ళతో ఆజ్ఞాపించేవారు. అమ్మా, నాన్నా భయపడిన కీడంతా డెన్‌వర్‌లో వున్నట్లే తోచింది. రెండువారాలు పని చేసి, ఉద్యోగం మానేశాను.

తర్వాత చెయనీ ఓమింగ్ అనే చోటికి వెళ్ళాను. ఈ మాటు రైలు పాసు చిక్కలేదు. యూనియన్ పెసిఫిక్‌లో పనిచేసే ఒక ఉద్యోగి కనిపించాడు. నేను హాంక్ క్రిస్లర్ కొడుకునని చెప్పాను.

"టిక్కట్టు లేకుండా నిన్ను ప్రయాణం చెయ్యనియ్యలేను. నన్ను క్షమించు. మనం ఎవరి కంటయినా పడొచ్చు"

"వద్దు. నా మాట విను. నన్ను అక్కరలేదు. నా బాకా సంచీని చెయనీలో వదిలిపెట్టు."

"సరే. కావలిస్తే నీ తోలుపెట్టెగూడా యియ్యి"

దాంతో కొంత తేలికయింది. రైలుబండీలకి ఆఖరిపెట్టెలని లాగుతున్న ఒక మీటర్ ధూమయంత్ర మున్నచోటికి నడిచివెళ్ళాను. అందులో కొన్ని పెట్టెలు ఖాళీగా వున్నాయి, చివరకి ఆరేడు అంగుళాల ఎత్తున్న పెట్టెదగ్గిరకి వెళ్ళాను. అంటే దాంట్లో మనుష్యులున్నారని అర్థమన్నమాట. తలుపు బార్లాతీసి, దారి వంక తొందరగాచూసి, లోపలికి జొరబడ్డాను.

గుబురైన గడ్డాలతో ఆరుగురు మనుష్యులు క్రింద కూర్చునున్నారు. "తలుపు సరిగ్గా వెయ్యి" అని ఒకడు నా వంక ఉరిమిచూశాడు. తలుపు తొందరగా మూసేసి, రైలుబండీ గోడకానుకుని చతికిలబడ్డాను. నా ప్రయాణం ఆ విధంగా ప్రారంభమయింది.

చెయనీ, లారమీ, రాలిన్సు గురించి చాలా మర్చిపోయాను. ఆ ప్రదేశాల్లో, యింకా అనేక యితర ప్రదేశాల్లో పనిచేశాను. కొంతప్పుడు వీలు చిక్కితే స్థానిక వాయిద్యగాళ్ళతో చేరేవాణ్ణి. లారనులో మంచి వాయిద్యగాళ్ళ జట్టువుండేది. అక్కడే నేను మాకహన్‌ని కల్సుకున్నది. కొన్నాళ్ళు స్నేహంగావుండి విడిపోయాం. మళ్ళీ సాల్టులేక్ సిటీలో కలుసుకున్నాము.

ఆ నాటి విషయాలు నాకు క్రమబద్ధంగా జ్ఞాపకంలేవు. చాలాచోట్ల నాకు వుద్యోగాలు దొరికాయి. కాని నేను అన్వేషించిన వుద్యోగం మటుకు కనపడలేదు. తరుచు నా దగ్గిర డబ్బు వుండేదికాదు. కాని పస్తున్నానంటే దానికి కారణం డబ్బు పొదుపు చాతకాకపోవటమే. ముఖ్యమైన విషయమేమిటంటే, ఉద్యోగాన్వేషణకోసం తిరగడమంటే ఎలా వుంటుందో నేను ఎప్పుడూ మర్చిపోలేదు. కొన్ని సంవత్సరాల క్రిందట ఆఫ్రికాలోని కొన్ని జంతువుల్ని తీసుకువచ్చే దండ యాత్రకి నేను పెట్టుబడి పెట్టాను. పశ్చిమప్రాంతంలో తిరిగినప్పుడు, ఘామయంత్రం నీళ్ళు నింపే గొట్టంమీద నాపేరు, నేవెళ్ళినదారి చూపిస్తూ ఓ బాణంలాటి గీత గీశాను. దాన్ని కనుక్కొనేందుకు ఎవరినైనా పంపాలని చాలా సార్లు అనిపించింది.

ఏ వూళ్ళోనైనా సరే, వాయిద్యగాళ్ళ జట్టులో ప్రవేశించాలంటే నా బాకా బాగా పనికివచ్చేది. వాయిద్యం నేర్చుకునే మొదటిరాత్రే వూళ్ళోని యువకులందరూ పరిచయమయేవారు. నేను చాలా చక్కగా నృత్యం చేసేవాణ్ణి. చాలా నాట్యాలు చేశాను. ఆ రోజుల్లో కార్ఖానాలో చాలా చాలా నేర్చుకున్నాను. నేను పనిచేసిన ప్రతి మంచి యంత్ర శాస్త్రజ్ఞుడి దగ్గిరా ఏదో ఒక కొత్త విషయం నేర్చుకునేవాణ్ణి. అనేక

రకాల ధూమయంత్రాల పరిణామాన్ని గురించి తెల్సుకున్నాను. కార్ఖానాలో శిక్షణపొందాను. కాని అన్నిటికంటే ముఖ్యంగా మనుష్యుల్ని గురించి చాలా తెల్సుకున్నాను. ఆత్మజ్ఞానము బాగా అలవడింది.

నాకు అప్పట్లో ఓర్పు వుండేదికాదు. నా శక్తిసామర్థ్యాలని ఋజువు చేసేందుకు ఏ కార్ఖానాలోనూ నిలకడగా వుండలేకపోయేవాణ్ణి. వాళ్ళు నన్ను మెచ్చుకోకపోయినా, ముఖ్యోద్యోగి నా మనసు గాయపరిచినా, సమయం చూసుకుని, బాకా పెట్టి సంచీ సర్దేసి, పక్క కార్ఖానాకి వెళ్ళి పోయేవాణ్ణి. ఎంత తొందరగా డబ్బు చేసుకున్నానో అంత తొందరగా దాన్ని ఖర్చుపెట్టేవాణ్ణి. తరుచు యింటి గుబులు పట్టుకునేది. దిగులు పోయేందుకు ఒక సులభమార్గం డబ్బు ఖర్చుపెట్టడం. కాని ఆ రకం జీవితం నేను యిష్టపడేవాణ్ణని ఒప్పుకు తీరాలి. బాధ్యతలేకుండా, సాహసోపేతంగా. స్వేచ్ఛగా బ్రతకటం బాగా నేవుండేది. కాని దాంట్లోనూ కొన్ని అనర్థాలున్నాయి. తరుచు అక్కడ చలిగా వుండేది. ఆ వూళ్ళో ఎవరూ వస్తుండవలసిన అవసరం లేకపోయినా నాకు ఎప్పుడూ కావలసినంత తిండి దొరికేదికాదు.

కార్మికులు నీళ్ళతొట్టి దగ్గరకి వెళ్ళినప్పుడు, రైలు ఎక్కలేకపోతే ఊళ్ళోకి ఒక మైలో ఎంతో నడిచివెళ్ళాలి. ఏ యింటి పెరటి ద్వారం వైపు వెళ్ళి ఆకలిగా వుందని అడిగినా అన్నం దొరికేది. అమ్మ తన జీవితంలో కొన్ని వేలమందికి అన్నదానం చేసివుండాలి. పశ్చిమ ప్రాంతంలో ఏ సమయంలో నైనాసరే, యిళ్ళ పెరటి ద్వారం తట్టి, ఉద్యోగం వెదికే ప్రయత్నంలో వున్నామని చెబితే, రొట్టో వెన్నో లేక చల్లని మాంసపు ముక్కలో, ఏదో ఒకటి తిండానికి దొరికేది. అటువంటి భోజనం తింటానికి ఎవరికీ సిగ్గు పడవలసిన అవసరం వుండేదికాదు. భోంచేసి, సిగరెట్ ముట్టిస్తే, ప్రక్క వూళ్ళో దొరికే వుద్యోగం తలచుకుని లోలోపలే ఉప్పొంగిపోయేవాళ్ళం. కాని శీతాకాలంలోమటుకు ఆ జీవితం చాలా దుర్భరంగా వుండేది.

కొంతప్పుడు నేను ఎవరో చెప్పుకుంటే రైలు ముందుపెట్టెలో

ఎక్కేందుకు వీలయేది. రైలు పల్లంలోకి వెళుతుంటే గూడ్సుబండీ ఎక్కి బ్రేక్ చక్రాన్ని తిప్పేవాణ్ణి. కొన్ని సమయాలలో ధూమయంత్రం బండీలో ఎక్కి, ఫైర్‌మన్ పక్కనే కూర్చుని, గంటను వాయిస్తూ అతనికి దారి చూసిపెట్టేవాణ్ణి. కాని కొన్నిచోట్ల కార్మికులు కఠినంగా వుండవలసి వచ్చేది. లేకుంటే వాళ్ళ వుద్యోగాలు వూడిపోయే ప్రమాదం వుండేది. అందుకనే చాలా రైళ్ళల్లో కార్మికులు కఠినంగా వుండేవారు. రైలు ఆగుతూనే, డబ్బు చెల్లించకుండా ప్రయాణంచేసే వాళ్ళకోసం ఆ చివర నుంచి ఈ చివరిదాకా రైలంతా వెదికేవాళ్ళు వుద్యోగులు. మమ్మల్ని బైటికి లాగటానికి ప్రయత్నించేవాళ్ళు. అందులో గనుక కృతకృత్యులైతే, మళ్ళీ నీళ్ళతొట్టి దగ్గిర గుమికూడేవాళ్ళం. రైల్లో ఎన్ని రకాల వ్యక్తులు టిక్కెట్టు లేకుండా ప్రయాణంచేస్తారో చూడటం విచిత్రంగా వుండేది.

కొంతప్పుడు నేను ఒంటరిగా వుండేవాణ్ణి. కొంతప్పుడు ఏ యంత్ర శాస్త్రజ్ఞుడో, నీళ్ళ కొసువాడో సాహచర్యం దొరికేది. తరుచు నిలకడగా వుద్యోగం చేయనివాళ్ళు అక్కడ తిరుగుతుండేవారు. అందులో కొందరు కార్మికులకి నిప్పుకణాల్లాంటి ఎఱ్ఱని కళ్ళూ, భీకరగాయాలు. పచ్చపొడి పించుకున్న గుర్తులూవుండేవి. వాళ్ళు ఏ తెగకి చెందినవారో చెప్పటం కష్టంగావుండేది. వాళ్ళల్లో కొందరికి తప్పకుండా గడ్డాలుండేవి. దారపు ముక్కలతోనో లేక గుండుసూదులతోనో బిగించిన మాసిన చొక్కాలు, చిని గిన జోళ్ళు తొడుక్కునేవారు. అయినా, మళ్ళీ రైలు వచ్చేంతవరకూ మేము ఓ గుంపుగా చేరేవాళ్ళం. ఫెళ ఫెళమని కట్టెలు ఎగద్రోసి, బయట చలిమంటలు కాచుకునేవాళ్ళం. పొగాకు వున్నవాళ్ళు యితరులకివ్వ కుండా తామొక్కరే సిగరెట్ చుట్టుకుని తాగటం సాంప్రదాయ విరుద్ధంగా భావించేవాళ్ళం. నా దగ్గిర ఎప్పుడూ పొగాకు వుండేదికాదు. అందుకనే ఆ ఏర్పాటుచేశాను. కాస్సేపు మేము కబుర్లు చెప్పుకునేవాళ్ళం. కాని కొంతప్పుడు సంభాషణ ఉత్సాహంగా వుండేదికాదు. అప్పుడు కత్తితీసి, నీళ్ళ తొట్టి స్తంభంమీద మా పేర్లు చెక్కుకునేవాళ్ళం.

ఆఖరికి నా బాకా పోయింది. అదేమంత గొప్ప సంగీతం వాయిం చేది కాదు. కాని దాంట్లోంచి వచ్చే శబ్దం నా కెప్పుడూ ఆహ్లాదాన్ని

కలుగజేసేది. ముఖ్యంగా నేను వాయిద్యగాళ్ళతో చేరి విలియమ్ టెల్ ఆలాపన చేస్తున్నప్పుడు చాలా అద్భుతంగా వాయించేది. ఆ బాకాని నేను ఎప్పుడు పోగొట్టుకున్నదీ పాటల ద్వారానే జ్ఞాపకం చేసుకోవాలి. చెయనీలో - అక్కడున్న పెద్ద కార్ఖానాలు - రాలిన్సు, రాక్ స్ప్రింగ్సు, లారమీ, ఓగ్‌డన్, ఉటా - అదే వరుస - ఓగ్‌డన్‌లో యింకోడితో కలసి బాకా వాయించాను. అక్కడ యూనియన్ పెసిఫిక్ ఫోర్‌మన్ నాకు ఓ వుద్యోగం యిచ్చాడు. ఈసారి అక్కడ ఆరువారాలున్నాను. కాని తిరగటం బాగా అలవాటయిపోయింది. విసుగ్గా వున్నప్పుడెల్లా తెరిపి కోసం రైల్లో ప్రయాణం చేసేవాణ్ణి. అందుకని పోకడెల్లో, ఐదాని గురించి చాలా వినటంతోనే నేనూ యింకో అతనూ అక్కడికి బయలుదేరాము. రైలు నడిపే వ్యక్తికి నా బాకా పదిలంగా చూచుకోమని యిచ్చాను. సిగరెట్ యిస్తూ, పోకడెల్లోని ఓర్‌గన్ షార్టులైను కార్యాలయంకి దాన్ని అందజేయమని చెప్పాను. మెలకువ వచ్చిన ప్రతిక్షణం నేను బయల్దేర కుండా వుంటేనే బాగుణ్ణనిపించింది. చిట్టచివరకు మేమిద్దరం పోకడెల్లోలో దిగాము. ఆ వూళ్ళో విడవకుండా గాలి వీస్తూనే వుండేది. అంత భీకర మైన గాలిని నేనింతవరకూ చూడలేదు. ఆ గాలి ముఖంమీదికి సరిగ్గా గులకరాళ్ళని విసిరేస్తుందని ప్రమాణంచేసి చెబుతున్నాను. రెండువారాలు ఆ బాధ చాలా అనుభవించాను. దక్షిణంగా వెళుతున్న ఒక ఖాళీ రైలెక్కి పోకడెల్లో వదిలి వెళ్ళిపోయాను. సాల్టులేక్ సిటీ చేరుకున్న తక్షణం, నా బాకాని ఎవరైనా దక్షిణం తీసుకువచ్చే ఏర్పాటుచేయటం అలక్ష్యం చేశాననే విషయం గుర్తుకు వచ్చింది. బాకాని అధీనం చేసుకున్న వారెవరైనా దాన్ని మధురంగా వాయించటం నేర్చుకునుంటారని ఆశించాను.

1900 వ సం॥లో సాల్టులేక్ సిటీలోని డెన్‌వర్ & రియోగ్రాండ్ వెస్టరన్ రైల్వే రోడ్డు కార్ఖానాల్లో ఒక వుద్యోగం దొరికింది. సామ్‌స్మిత్ అనే ఎల్లీస్ స్నేహితుడు అక్కడ ఫోర్‌మన్‌గా వుండేవాడు. అతనే నాకు వుద్యోగం యిప్పించాడు. అందుకనే నాకు గంటకు 30 సెంట్లు వచ్చేవి. నేను పనిచేసే విధం అతనికి నచ్చింది. అతనూ ఆ కార్ఖానాకూడా

నచ్చాయి నాకు. అంతేగాక సాల్టులేక్ సిటీ చాలా బాగుంది. వూళ్ళో బాగా తిరగటం మొదలెట్టాను. ఈత కొట్టడానికీ, నాట్యం చేయటానికీ, సాల్టయిర్ పెవలియన్ అనే సరస్సు తీరానికి వెళ్ళేవాణ్ణి. విసుగుపుట్టేంత వరకూ అలా తిరుగుతూనే వున్నాను. చివరకి అదీ రోత పుట్టింది. ఆ బాకాని పోగొట్టుకోవటంతో నా మనసులోనూ కొంత మార్పు వచ్చింది.

ఒక్క సంవత్సరం పనిచేసి, సాధ్యమయినంతవరకూ డబ్బు వెనకేశాను. తరుచు చాలా భీకరమైన ఒంటరితనాన్ని అనుభవించేవాణ్ణి. తూర్పుగా వెళుతున్న రైలుని చూసినప్పుడల్లా అందులో ఎక్కాలని వుండేది. రైలు "కూ" అని దిగులుగా కూసినప్పుడల్లా, నా ఒంటరిపాటుకంతటికీ ఫోర్కేరే కారణమనే విషయం స్ఫురించేది. మేము ప్రేమపూర్వకంగా ఉత్తరాలు రాసుకునేవాళ్ళం. నేను నిలకడ లేకుండా ఎందుకు తిరుగుతున్నానో ఆమెకి తెలుసు. నా ఆశయాలతో తను పూర్తిగా లీనమయిపోయిందనీ తెలుసు. అందుకనే నేను యంత్రశాస్త్రజ్ఞుడిగా తిరుగుతున్న సమయంలో నిశ్చల మనసుతో వుండగలిగింది.

ఆమె ఉత్తరాలన్నిటినీ పదిలంగా దాచుకునేవాణ్ణి. దిగులుగా వున్నప్పుడు అవి తీసుకు చదువుకుంటూ వాటి పరిమళాన్ని ఆఘ్రాణించేవాణ్ణి. నాకు అప్పుడు ఇరవయ్యారేళ్ళు. కాబోయే పెళ్ళికొడుకు గూడ్సు బండీలో పెళ్ళికి వెళ్ళటం ఎలా? ఒక టోపి, కావలసిన యితర వస్తువులూ కొనుక్కున్నాను. కాని ఇంకా డబ్బు వెనకెయ్యవలసివచ్చింది. ఆఖరికి యింటికి తిరిగివస్తున్నానని ఆమెకి ఉత్తరం రాశాను. వివాహానికి ఒక రోజు నిర్ణయించమనీ, పెళ్ళి ఖర్చుకీ, మళ్ళీ జీతాలిచ్చే రోజువరకూ సరిపోయేటందుకూ, కావలసిన డబ్బు నా దగ్గరవుందనీ రాశాను. తిరుగుప్రయాణంలో "డబ్ల్యూ. పి. క్రిస్లర్ మరియు భార్య" అని వుంటే బాగుంటుంది. అందుకని తూర్పున డి. అండు ఆర్. జి. డబ్ల్యూలో డెన్వర్ కి వ్రాసి రైలు పాసులు ఏర్పాటుచేశాను. పెసిఫిక్ లో నేను ఎన్ని సంవత్సరాలు పని చేసినప్పటికీ, డెన్వర్ నుంచి మా వూరు వెళ్ళే దారికిమటుకు పాసు దొరికే అవకాశం లేకపోయింది. అందుకని డెన్వర్ వెళ్ళినప్పుడు నా జీవితంలో మొదటిసారిగా స్టేషను కిటికీముందు నిలబడి, రైలు టిక్కెట్టు

కొనుక్కున్నాను. ఆ టిక్కెట్టు పైన ఎల్లీస్ అని వ్రాసివుంది. ఇంటి బెంగతో కృశించిన అనేక సంవత్సరాలు ఆ మూడు అక్షరాలే నన్ను పూర్తి ఇంద్రజాలంతో ముంచేశాయి.

మెథాడిస్టు చర్చిలో మేము వివాహం చేసుకున్నాము. మా అత్త గారు చనిపోవటంవల్ల, పెళ్ళి ఉభయకుటుంబాల మధ్య ఆర్భాటం లేకుండా జరిగిపోయింది.

సాల్టులేక్ సిటీలో అరవై డాలర్లతోనూ వైవాహిక జీవితం ప్రారంభించాము. గంటకు 30 సెంట్ల చొప్పున రోజుకి మూడు డాలర్లు వచ్చేవి. ఎక్కువ పనిచేసిన సమయంలో డబ్బు కూడబెట్టుకున్నప్పుడెల్లా నేను అదృష్టవంతుడనుగా పరిగణించుకునేవాడను. వేసంగిలో ఒక చిన్న యిల్లు అద్దెకు తీసుకున్నాము. తర్వాత ఒక వరుస-డాబాయిల్లు నిర్మాణం పూర్తి కావటం చూసి, అందులో ఒక దానిని అద్దెకు తీసుకున్నాను. అది సిద్ధమవుతూనే వాయిదాలమీద చెల్లించే పద్ధతిన 70 డాలర్ల ఖరీదుగల సామాన్లు తీసుకుని, యింట్లో ప్రవేశించాము.

అప్పట్లో ఎప్పటికంటె కూడా నాలో ఎక్కువ ఉత్సాహం వుండేది. ఇంటర్నేషనల్ కరస్పాండెన్సు స్కూలు ద్వారా విద్యుచ్ఛక్తి యంత్రశాస్త్రాన్ని నేర్చుకునేవాణ్ణి. ఆ విషయం గురించి సాల్టులేక్ సిటీలో పర్ఛీదు పొందిన బిల్ కిల్‌పాట్రిక్ అనే ఎల్లీస్‌కుర్రాడి దగ్గిర విన్నాను. సాంకేతిక విద్యాభ్యాసంకోసం తను ఏపని చేస్తున్నదీ చెప్పాడతను. తక్షణం "నేనూ అదే చేస్తాను" అన్నాను.

అదృష్టవశాత్తూ ఊటాలో ఒక వారం విరామం చిక్కింది. అక్కడ మార్మన్లు సంవత్సరానికి రెండుసార్లు దశాంకపు పన్నుని చెల్లిస్తారు. అవి వేడుకసమయాలు. ఆకురాలు కాలంలో పన్ను చెల్లించే వారం రాగానే వేలకువేలు మార్మన్లు రొఖ్ఖం, ఆవుదూడలు, గొర్రెపిల్లలు, కోడిగ్రుడ్లు, పందితోడలూ, కూరగాయలూ, పళ్ళూ యింకా యితర రూపాలలో చర్చి వుద్యోగులకి దశాంక పన్నుని చెల్లించటానికి బయలుదేరేవారు. డి. & ఆర్. జి. రైలంతా మార్మనుప్రయాణీకులతో, వారు తెచ్చేవాటితో నిండి

పోయేది. రాష్ట్రంలోని రైలు కట్టలన్నిటికీ ఇదొక సమస్య అయేది. సాల్ట్ లేక్ సిటీలో పర్వతాలనుంచి ఠశాంకపన్నుని చెల్లించటానికి కొందరు వచ్చే వారు. వారికోసం టింటిక్ బ్రాంచ్ అనే ప్రత్యేక రైలుని పంపవలసి వచ్చేది.

ఆ రోజుల్లో కంపెనీవారికి గమనశక్తి తక్కువగా వుండేది. అందుకని ప్రత్యేక రైలుని పొద్దుట ప్రయాణానికి తీసుకువెళ్ళేందుకు, మధ్యాహ్నం డెన్‌వర్ తీసుకెళ్ళేందుకు, ప్రత్యేకంగా ఒక ధూమయంత్రం అవసరమని నిశ్చయించారు. ఆ రైలు సాల్టులేక్ సిటీనుంచి సాయంత్రం 3 గంటలకి బయలుదేరాలి.

పట్టీ పుస్తకం దగ్గిర నిలబడి, పనిచూచుకుంటూంటే, జాన్ హిక్కీ అనే యంత్రాధికారి, ఫోర్‌మన్ శామ్‌స్మిత్ దగ్గిరకి తంతివార్తని పట్టుకుని పరుగెత్తుకు రావటం చూశాను. హిక్కీ ఎప్పుడూ పెళ్ళికి వస్తున్నట్లు షోకైన దుస్తులతో పనిలోకి వచ్చేవాడు. కత్తిరింపుల చొక్కా, చారల పంట్లామూ, బూడిద వర్ణం టోపీ, నెరసిన తల, అచ్చం కులీనుడికి మల్లే వుండేవాడు. కాని ఆవేళ మటుకు ఆవేశంలో వున్నాడు.

"స్మిత్! 146 ధూమయంత్రం వెనుకవుండే నల్ల సిలండర్ విరిగి పోయింది."

"డెన్‌వర్‌నుంచి రైలుని తీసుకువెళ్ళేందుకు మనకి అదొక్కటే ధూమయంత్రం మిగిలింది" అన్నాడు స్మిత్.

"ఆ విషయం నాకు తెలుసు. ప్రశ్న ఎలాగు సమయానికి దాన్ని మరమ్మత్తు చేయగలమా అని?"

"నా దగ్గిరవున్న ఓ కుఱ్ఱాడు ఆ పని చెయ్యగలడనుకుంటాను" అన్నాడు స్మిత్.

అప్పుడు వాళ్ళు నా దగ్గిరకొచ్చారు. హిక్కీ నన్ను ఎరిగున్నాడు. ఎప్పుడూ "క్రిస్లర్" అని పిలిచేవాడు. ఆవేళ తొందర్లో రొప్పుతూ. "క్రిస్లర్! 146 ధూమయంత్రానికి కొత్త సిలండర్ వేసి ప్రయాణానికి సిద్ధం చెయ్యగలవా?" అన్నాడు.

"చెయ్యగలవా రెవరైనా వుంటే అది నేను" అన్నాను.

"ధైర్యమంటే అదే క్రిస్లర్"

"నాకు ఇద్దరు సహాయకుల్ని యివ్వాలి"

"అలాగే...అలాగే...స్మిత్ ఇతనికి కావలసిన సహాయమంతా యియ్యి" అంటూ హిక్కీ వెళ్ళిపోయాడు.

"నీ వుద్దేశం ఏమిటి? అది నువ్వు చెయ్యగలవా?" అనడిగాడు స్మిత్.

"చెయ్యగలనని చెప్పలేదు. ఎవరైనా చెయ్యగలిగితే అది నేనే" అన్నాను.

సహాయకుల్ని తీసుకెళ్ళి, మరలని తిప్పే సుత్తులనీ. యితర పనిముట్లనీ పని చేయవలసిన గొయ్యి పక్కన వుంచాను. తర్వాత దుకాణానికి వెళ్ళి కొత్త సిలండరూ, గుండుసూదులూ, అడ్డుగడియలూ, గుబ్బమేకులూ యింకా యితర అవసరమైన వస్తువులన్నీ ఒక చేతిబండీ నిండా వేయించుకున్నాను. దాన్ని గొయ్యి దగ్గరకు తీసుకెళ్ళి, ఒకసారి నాకు అవసరమయే వస్తువులన్నీ వున్నాయో· లేవో తనిఖీ చేసుకున్నాను. పాట్లుపడ్డ ఆ ధూమ యంత్రం వచ్చేటప్పుడు ఒక ఏటవాలైన బొగ్గుమార్గంలో ఆగుతుంది. సహాయకుల్ని తీసుకుని అక్కడికెళ్ళాను.

సహజంగా లోనికి వచ్చేటప్పుడు అది ఒక ప్రక్కే పనిచేస్తోంది. నేను చూడవలసిన భాగం పూర్తిగా కదలటంలేదు. అందుకని రైలు యింకా ఆగకముందే, దాని ప్రక్కనే నడుస్తూ, పైపెంకుల్నీ, అడ్డు భాగాల్నీ వూడదీస్తూ పని ప్రారంభించాను. యంత్రం ఎగుడుదిగుడుగా గొయ్యివైపు వెళుతుంటే సుత్తులతో పని మొదలెట్టాను.

యంత్రంలో మంట ఆర్పివేసే లోపునే, వేడికి నా మోకాళ్ళు కమిలిపోయాయి. కాని పని ఆపెయ్యలేదు. సహాయకులిచేత వేగంగా పని చేయించాను. మొదట బొగ్గు మార్గం దగ్గిర ధూమయంత్రాన్ని ముట్టుకున్నప్పుడు మధ్యాహ్నం దాటిందనుకుంటాను. సరిగ్గా పది దాటివుంటుంది. ఫోర్‌మన్ మా యింటికి వెళ్ళి, గాభరా పడిన నా భార్యకి పరిస్థితి వివరిం

చాడు. నాకోసం ఆమె ఒక ముంతెడు అన్నం కట్టియిచ్చేంతవరకూ అక్కడే కాచుకున్నాడు.

పని ప్రారంభించిన రెండు గంటల నలభైనిముషాల అనంతరం స్మిత్‌తో "యంత్రాన్ని బైటికి తీసికెళ్ళొచ్చు. సిద్ధంగావుంది" అని కేకేశాను. మూడింటికి ఇంకా పది నిముషాలుంది. బయలుదేరవలసిన సమయానికే డెన్‌వర్ రైలు బయలుదేరింది.

గడియారం చేతపట్టుకుని, హిక్కీ రైలు వెళ్ళటంచూశాడు. నేను పనిచేస్తున్నంతసేపూ అతను ఆ గడియారాన్ని ప్రార్థిస్తున్నాడనుకుంటాను. రైలు నిష్క్రమిస్తూనే నేను నిలబడ్డచోటుకి వచ్చాడు. అప్పుడు నేను గుడ్డ పేలికతో ముఖం తుడుచుకుంటున్నాను. "క్రిస్లర్! డెన్‌వర్ రైలు కనీసం గంటన్నరన్నా ఆలస్యమవుతుందనుకున్నాను. ధూమయంత్రాన్ని సమయానికే బైటికి తేగలవనుకోలేదు. ఒక యంత్రశాస్త్రజ్ఞుడు ఇలాటి పనిని ఇంత తక్కువ వ్యవధిలో చెయ్యగలడని ఎవరైనా చెబితే నమ్మేవాణ్ణి కాదు."

మనిషికి భుక్తికంటె గూడా ఎక్కువ అలాటి ప్రశంస సంతోషం యిస్తుంది. నేను చాలా ఆనందపడ్డాను. హిక్కీ ఇంకా యిలా అన్నాడు.

"మీకు వచ్చే బత్తాలు స్థిరపరిచినవేనని నీకు తెలుసుననుకుంటాను. కాని నీ జీతం అధికం చెయ్యాలంటే చెయ్యొచ్చు." అతను ఓ క్షణం ఆలోచించాడు. వెంటనే సంతోషంతో "క్రిస్లర్! నీకోసం ఒక్కటి చేయగలను. ఈ మధ్యాహ్నమంతా పని చెయ్యక్కరలేదు" అన్నాడు. అప్పుడు సరిగ్గా మూడు గంటలయింది.

నేను ఇంటికి వెళ్ళలేదు. గొయ్యి పక్కన కూర్చుని, ముంతెడు అన్నం తినేసి, సిగరెట్ తాగాను. పదిహేను నిముషాలు అలా తిరిగి, మళ్ళీ పనిలోకి వెళ్ళాను. నాలో విజయోత్సాహంతో కూడిన ఒక గొప్ప అనుభూతి కలిగింది. దాన్ని ఒక్క నిముషమైనా పరిత్యజించాలని అనిపించలేదు.

అయిదునెలల తర్వాత అనుకుంటాను, యంత్రాధికారి కార్యాలయం నుంచి కబురువచ్చింది. ఆ తర్వాత నన్ను ఎవరూ "క్రిస్లర్" అని పిలవ లేదు. "వాల్టర్ ! నువ్వు ఫైర్‌మన్ పని చెయ్యగలవా ?" అన్నాడు హిక్స్.

"తప్పకుండా చెయ్యగలను. కాని స్మిత్ ఏ మయేటట్లు ?"

"స్మిత్‌కి యింకో మంచి వుద్యోగ మివ్వబోతున్నాము. అందుకని నీకు ఈ ఫైర్‌మన్ పని యివ్వాలనుకుంటున్నాము.

ఆ తర్వాతనుంచీ నాకు ఒక కార్యాలయం ఏర్పడింది. నేను చూసిన మిగతా కార్యాలయాలతో పోలిస్తే అది గోడలో రంధ్రమంత చిన్నది. కాని అందులో టెలిఫోనుతో సహా వ్రాసుకునే బల్ల వుండేది. దాదాపు శ్రీంఘ్రమందికి నేను ఫోర్‌మన్ అయాను.

ఆ రోజుల్లో ఫోర్‌మన్ పని అంగీకరిస్తే, అతను "కంపెనీ వైపు" వున్నట్లే భావించేవారు. అందుకని యూనియన్ సభ్యత్వాన్ని సాగించ టానికి వీలుండేదికాదు. పైపెచ్చు సభ్యత్వాన్ని "విరమించుకుంటున్న కార్డు" యిచ్చేవారు. అటువంటి విషయాల్లో యూనియనుకి కొన్ని నిబంధనలుండేవి. ఉద్యోగం పోతే మళ్ళీ యూనియన్‌లో చేరవచ్చు. కాని నేను ఉద్యోగం పోగొట్టుకోదలచుకోలేదు. నే సంపాయించిన డబ్బంతా యింటికి అవసరమయేది. అప్పుడే నా పెద్ద కూతురు థెల్మా జన్మించింది. ఆమె నే తర్వాత పెరన్ పాయి వివాహం చేసుకున్నాడు.

అయినా ఫోర్‌మనుగా ఆట్టేరోజులు వుండకముందే జాన్ హిక్స్‌కి వెళ్ళత్తించాను.

---

# చికాగోలో ఒక ఆకస్మిక సంఘటన

టెలిఫోనులో మాట్లాడేది రవాణాగుమాస్తా కాదని గ్రహించ గానే రాబోయేదేమిటో నాకు తెలిసిపోయింది. అచేతనుడనై టెలిఫోనులో హిక్కీ గుమాస్తా కంఠం గుర్తుపట్టాను. అంతకుముందు చాలా రోజులుగా యంత్రాధికారి దగ్గిరనుంచి పిలుపు వస్తుందని భయపడుతూనే వున్నాను.

గడచిన జీవితమంతా మనోనేత్రంముందు తిరిగి, అందులో లీనమై పోవటానికి ఒక క్షణం పట్టదు. నీళ్ళల్లో మునిగిపోతున్నప్పుడే అలాటి అనుభూతి కలుగుతుందనుకోవటం పొరబాటు. ఉద్యోగాలు అరుదైన రోజులవి. కుర్రతనంలోవుండి, వుద్యోగం పోతుందనే ఆకస్మిక భీతి పట్టు కుంటే తప్పకుండా గతం జ్ఞప్తికి వస్తుంది. అప్పుడు నాకు 27 సంవత్స రాలు. నా విచారంలో నాకు తోడుగా ఒక భార్యా శిశువూ వున్నారు. నా భార్య సౌందర్యవతి. మేమిద్దరం కలిసి బైటికి వెళ్ళినప్పుడల్లా గర్వంతో ఉప్పొంగిపోయేవాణ్ణి. ఆమెకి నాపట్ల భక్తి విశ్వాసాలుండేవి. రోజంతా వంటపనీ, యిల్లు కడగటం, బట్టలుతికడం, పాప సంరక్షణా. యితర పనులతోనూ మునిగిపోయేది. నెలపొడుగూతా నా జీతం సరిపోయేటట్లు ఆవే యింటి వ్యవహారమంతా నిర్వహించేది. నెలకి తొంభై డాలర్లు వస్తున్నందుకు మేముభయులమూ అదృష్టవంతుల మనుకునేవాళ్ళం. గుమాస్తా, "హిక్కీ మిమ్మల్ని కార్యాలయానికి రమ్మంటున్నారు" అని చెప్పినప్పుడు, నాకు వున్నదేదో పోతుందనీ, పెద్ద విపత్తు జరుగబోతున్నదనీ భయం కలిగింది.

నా చిన్న కార్యాలయమే నాకు చాలా ముఖ్యమైంది. అక్కడ నాకు అధికారముండేది. లోహాలు, యంత్రాలు విషయాలు తెలిసిన నా లాటి లెక్క లేనంత మందికి నేను యజమానిని. ఆ కార్యాలయంలో నా బల్లయేగాక ఒక గుండ్రని కడవలాటి పొయ్యివుండేది. పూర్వం అటువంటి పొయ్యిలోనే రైలుబండీలలో నిప్పు రాజేసేవారు. సామాన్యంగా నా అతిధులు పొగాకు ఉమ్మివేసేందుకు దాన్నే ఉపయోగించేవారు. ఆ గదిలో కొన్ని కొయ్యకుర్చీలుండేవి. కొందరు చముగు బట్టలతో కూర్చొ

వటంవల్ల ఆ కుర్చీలు మెఱుగుపోయి నల్లబడ్డాయి. ఫోర్‌మన్ కోసరం గానికివచ్చే వ్యక్తి బొగ్గుమసిమీదగానీ, వృత్తి పలకలమీదగానీ నిల్చో నవసరం లేదు. కింద ఒక కంబళీ పరచివుండేది. అయినా హిక్కీ కార్యాలయం నా గదికన్నా యింకా బాగుండేది. కొన్ని వేల మందికి అతను యజమాని. అతని అధికారం మైలుకట్టంతా వ్యాపించింది. అన్ని శాఖలలోని యంత్రాధికారులూ, లెక్కలేనంత మంది ఫోర్‌మన్‌లు. ఇంజనీర్లు, ఫైర్‌మన్‌లూ అతనికిందే వుండేవారు. హిక్కీ కార్యాలయంలో నేలమీద ఒక తివాసీవుండేది.

హిక్కీ పిలుపు అందుతూనే ఆ తివాసీపైనే నడిచివెళ్ళాను. పై అంతస్తులోంచి ఎవరో నన్నుచూసి చెయ్యూపారు. బహుశః అతను మాటలు నోక్కేసునిషి అనుకుంటాను. ఆ కార్ఖానాలో నాకు చాలామంది స్నేహితు లుండేవారు. అంత ఉత్సాహంగా కాకపోయినా నేను మళ్ళీ చెయ్యూపాను. నేను చిరుకోపిని. కర్కశంగా తొందరపాటుతో ప్రవర్తించేవాణ్ణి. చిక్కంతా అక్కడే వచ్చింది. అంతకు కొద్ది రోజుల క్రితమే యంత్రాధికారి దగ్గరనుంచి ఒక ఉత్తరం వచ్చింది. నేను ఏ పొరపాటుచేశానో, అతనెందుకలాటి గద్దింపుల ఉత్తరం రాశాడో యిప్పుడు గుర్తులేదు. కాని నాకు వెఱ్ఱెత్తిపోయిందని మాటుకు జ్ఞాపకముంది. నేనూ ఒక గద్దింపుల ఉత్తరం రాయగలిగాను. నేను చిన్నవాడిననే అసరా తీసుకుని అతనలాటి ఉత్తరం రాయనక్కరలేదు. ఇబ్బందల్లా నేను యువకుడ నయిపోయాను. నాలో తొందరగా నొచ్చుకునే స్వభావం ఏర్పడింది. కాలిన బొగ్గుల దారివెంట కార్యాలయం వైపు వెళుతుంటే, అతను మూడు నాలుగు రోజులు వేచి వుండటానికి కారణమేమిటో అర్థం కాలేదు. ఆ సమయంలో రెండు విషయాలని మటుకు గ్రహించగలిగాను. నన్ను గద్దించటానికీ, నా ఉత్తరానికి చిన్నబుచ్చుకోవటానికీ, అతనికి తగిన కారణాలున్నాయి. అది నా గొంతుమీదికే వచ్చింది. వచ్చినా, అతని ముందు భయంతో కొంగదల్చుకోలేదు. పళ్ళు బిగించి, ఛాతీ వెనక్కివిరిచి, యజమాని గది తలుపు తెరిచాను.

"రా వాల్ట్. కూర్చో. కొన్ని ధూమయంత్రాల చిత్రాలు చూస్తున్నాను. బ్రహ్మాండమైందికదూ?" నేను కుదుటపడినట్లు కనబడేంత వరకూ హిక్కీ అలా చాలాసేపు కబుర్లు చెప్పా డనుకుంటాను.

"వాల్ట్! నువ్వు చాలా మంచి కుర్రాడివి. కష్టపడి పనిచేస్తావు. నీ కంటె మంచి యంత్రశాస్త్రజ్ఞుణ్ణి ఎరగను. నీకు ధైర్యంకూడావుంది. కాని కొన్ని యితర విషయాలు నీతో చెప్పవలసివుంది. నాలుగైదునెలల క్రితం నిన్ను ఫోర్‌మన్‌ని చేశాను. అంతేకాదు; కార్మికులకీ, వాళ్ళు చేసే పనికీ గూడా నువ్వే బాధ్యుడి వయావు.

అప్పుడు యిక జరగబోయేదేమిటో నాకు తెలుసు. కాని హిక్కీ ఏమి చెప్పదలచుకున్నా వినటానికి తీర్మానించుకున్నాను. అతను గర్జించి వుంటే నేను అంతకంటె బిగ్గరగా గర్జించి వుండేవాణ్ణి. దానికిబదులు మెత్తనిసున్నితమైన మాటలతోనే నన్ను చిత్తుచేసేశాడు. "వాల్ట్! నిన్ను నేను బాగా ఎరుగుదును. నువ్వు పనిలోకి వెళ్ళినప్పటినుంచీ నా దృష్టి నీ మీదే కేంద్రీకరించి వుంచాను. ఆ నాలుగు కొత్త ధూమయంత్రాలని ఎప్పుడు కొన్నామో జ్ఞాపకముందా? వాటి మీటలవిషయమే నేను దిగులుపడ్డాను. వాటిని అమర్చే మనిషిని మనం ఎక్కడనుంచి తేగలం? బాల్డ్విన్ పంపిన మనిషి అదేమంత సమస్యకాదని ధైర్యమిచ్చాడు. ధూమ యంత్రాలన్ని గురించి తనకు తెలిసినంతా ఇక్కడ ఒక కుర్రాడికి తెలుసునని చెప్పాడు. ఈ కొత్త యంత్రాలని గురించీ, వాటి చిక్కుమీటలని గురించీ నువ్వు ఎలా నేర్చుకున్నదీ చెప్పాడు."

ఆ మాటలు నన్ను ఆకాశాని కెత్తేశాయి. సాల్టులేక్ సిటీకి బాల్డ్విన్ పంపిన మనిషి ధూమయంత్రాలు పెట్టేందుకు వచ్చినప్పుడు నేను అతనితో కలసివుండేవాడిని. పగలు అతనితో పనిచేసి, రాత్రి పదిపదకొండు గంటల దాకా అతను అలసట చెందేంతవరకూ ప్రశ్న లడుగుతూ కూర్చునేవాణ్ణి. అతను తూర్పు వెళ్ళిపోయినప్పుడు నాకు ఒక్కడికే ఆ ధూమయంత్రాల మీటలని పెట్టటం వచ్చును. అందులోని భాగాలు చాలామటుకు మిగతా యంత్రాల్లోకి మళ్లే వుంటాయి. కాని వాల్వుల కదలిక చిక్కుతో కూడుకు

ఘుండేది. ఒక్కొక్కప్పుడు పట్టాల మధ్యనున్న రాయి అడుగున కడ్డీకి తగిలి, రైలు వెళ్ళకుండా యంత్రం ఆగిపోయేది. అలా ధూమయంత్రం ఎందు చేత ఆగిపోయేదో మిగతా కార్మికులెవరికీ బోధపడేదికాదు. ఎన్నోసార్లు రాత్రిళ్ళు కుర్రాడొచ్చి మరమ్మత్తుకి నన్ను పిలిచేవాడు. లేచి అక్కడికి వెళ్ళి, వంగిన కడ్డీని తీసేసి, తిన్నగాపెట్టి ఒక గంటలో ధూమ యంత్రాన్ని సరిచేసేవాణ్ణి. రాత్రి పనిచేసేవాడు అప్పుడు యిలా అనేనాడు "అబ్బాయీ! పని చాలా తొందరగా చేశావు - నిజానికి మరీ తొందరగా చేశావు. పది గంటలు ఎక్కువ పని చేసినంత అది. కాని ఇంటికి వెళ్ళి పడుకో. మళ్ళీ రేపంతా పని చెయ్యొచ్చు."

బహుశః హిక్కీకి నేను ఎక్కువసేపు పని చేస్తున్న విషయం తెలుసు నేమో నాకు తెలీదు. కాని నిశ్చయంగా అతనికి మానవస్వభావాలని గురించి చాలా తెలుసు. అతను మా పనిని ప్రసంసిస్తూ మాట్లాడినా, యితర విధాల పొగడ్తలుచేసినా మేమంతా జాగ్రత్తగా వినేవాళ్ళం. నేనూ ఆ రోజు అలాగే చెవులు రిక్కించుకుని విన్నాను. "నీకు గొప్ప భవిష్యత్తు వుందనే విషయం తెలుసా వాల్ట్? అప్పుడప్పుడు మనసు నొచ్చుకునుంటే నువ్వు ఆ భవిష్యత్తుని నాశనం చేసుకోవటం నాకు యిష్టంలేదు. నీకు ఒక విషయం చెప్పనీ. ఎప్పుడైనా నాకు కోపం తెప్పించి వుడికించే వుత్తర మొస్తూంటుంది. నేనేం చేస్తానో తెలుసా?"

చేతిని బల్ల సొరుగులోకి పోనిచ్చి అందులోంచి ఒక కాయితం తీశాడు. అది నేను రాసిన ఉత్తరమేనని తెలుసుకున్నాను. నా ముఖం ఎఱ్ఱబారింది. "వాల్ట్! నాకు వెఱ్ఱెత్తించే ఉత్తరాలన్నిటినీ అక్కడే పెడతాను. నేను శాంతపడేంతవరకూ మూడు నాలుగు రోజులు వాటిని అక్కడే వుంచుతాను. కోపం పోయిందని నిశ్చయంగా తెలిశాక - హిక్కీ అప్పుడు నావంకచూసి నవ్వాడు. "వాటిని బైటికితీసి చదువుతాను."

అప్పుడతను నా వుత్తరాన్ని బిగ్గరగా బైటికి చదివితే భరించగలిగి వుండేవాడనుకాదు. అదృష్టవశాత్తు దాన్ని మా యిద్దరిమధ్యా బల్లమీద వుంచి. నెమ్మదిగా మాట్లాడటం ప్రారంభించాడు. "నువ్వు శాంత పడేంత

వరకూ నా ఉత్తరాన్ని ఒక సొరుగులో పడేసివుంటే ఇంతకంటె వివేకంతో ప్రవర్తించి వుండేవాడివి. నీకూ నాకూగూడా న్యాయం చేసి వుండేవాడివి. తెలుస్తోందా? నేను చెప్పింది గుర్తుంచుకో.!

తక్షణం క్షమాపణ కోరాను. పశ్చాత్తాప పలుకులు వాటంతటవే నోటినుంచి దొర్లిపోయాయి.

అప్పటినుంచీ ఆగ్రహంలో వున్నప్పుడు ఏ వుత్తరానికీ నేను సమాధాన మివ్వలేదు. ముఖాముఖి మాట్లాడేటప్పుడు కోపమొచ్చి పిడికిలితో బల్లమీద గుద్దేవాడిని. కాని కాయితంమీద మటుకు ఆగ్రహం రానివ్వలేదు. నిజానికి నాకు హృదయాన్ని బద్దలుచేసే వుత్తరాలొచ్చేవి. కాని ఆ ఉత్తరాలన్నిటినీ అడుగుసొరుగులో పొందుపరిచేవాణ్ణి. ఆ సొరుగుని తీస్తూనే, హిక్కీ గుర్తుకువచ్చి, నేను శాంతపడిపోయేవాణ్ణి.

హిక్కీని "తాతయ్య" అని ప్రేమవల్లనే సంబోధించేవాణ్ణి. అతను మా యజమాని కావటంవల్ల అలా పిలిచేవాళ్ళం. అతని ప్రశంసాపూర్వక వాక్యాలు, సానుభూతి మాటలు, జీతం కంటె గూడా నాకు ఎక్కువ సంతృప్తినిచ్చేవి. గడచిన జీవితమార్గం వైపు ఇప్పుడొకసారి చూచుకుంటే, హిక్కీ నా ఉత్తమ ఉపాధ్యాయులలో ఒకడుగా గుర్తుకువస్తాడు. నన్ను పెడదారులలోకి తీసుకుపోయి, అధోగతిలో ముంచేసే, కొన్ని నైజగుణాల్ని అరికట్టడ మెలాగో చూపించిన గురువు హిక్కీ.

ఫోర్‌మన్‌గా వున్న ఒక సంవత్సరానికి కొలరొడో, ట్రినిడాడ్ నుంచి తంతి వచ్చింది. దాన్ని చూస్తూనే నా సంతోషానికి అంతులేదు. కొలరొడో, సదరన్ కంపెనీ గమనశక్తి సూపరింటెంటయిన హెచ్. సి. వాన్ బన్‌సరిక్ సంతకంతో వచ్చించి ఆ తంతి. ఫోర్టువర్తు & డెన్‌వర్ సిటీ రైలు కట్టల దగ్గిరకలుస్తూ, డెక్సులైన్ ఔక్సాసు మీదుగా వెళ్ళే రైలుకట్ట అది. ట్రినిడాడ్‌లో కొలరొడో & సదరన్ కార్ఖానాల్లో హెడ్ ఫోర్‌మన్ ఉద్యోగమిస్తానని తంతి యిచ్చాడతను. అంటే నెలకి యింకా పదిహేను డాలర్లు ఎక్కువ! కాని నాకు వాన్ బన్‌కిర్కు ఎవరో తెలీదు. అతన్ని గురించి ఎప్పుడూ వినలేదు. కొన్ని గంటలు ఏమిచెయ్యాలో పాలుపోక గిలగిల్లాడాను. బహుశః హిక్కీ నాకు సాయపడవచ్చు అనుకున్నాను.

"ఏం కావాలి వాల్ట్? కూర్చో."

"ఈ విషయం అడుగుదామని వచ్చాను."

హిక్కీ తంతి చదివి, నాకేసి చూసి, మళ్ళీ తంతి చదివి, తిరిగి నా వంక చూశాడు. "ఇది చక్కని అవకాశం వాల్ట్. హెడ్ ఫోర్‌మన్ వుద్యోగం, నీకు యింకా - ముప్ఫయేనా?" అని చిన్నగా నవ్వాడు నాకు ఇరవై ఎనిమిదేళ్ళు నిండాయని అతనికి తెలుసుననుకుంటాను.

"కాని నాకు వాన్‌బస్‌కిర్క్ ఎవరో తెలీదు. అయినా నాకోసం తంతి పంపాడు."

"నాకతను తెలుసును. బహుశః నువ్వు మంచి యంత్రశాస్త్రజ్ఞుడివని ఎవరిదగ్గిరో వినివుంటాడు. ఆ కార్ఖానాలో కష్టమైన పని ఏదో వుండి వుంటుంది."

మేము గంటన్నర మాట్లాడుకున్నాం. హిక్కీ చాలా విషయాలు చెప్పాడు. అతను ఓహీయోలోని క్లీవ్‌లాండ్‌లో కుయహోగా మెషిన్ వర్క్సులో తర్ఫీదు పొందాడు. కొద్ది కాలం యంత్రకారుడిగా వుండి. ఇంజనీరు అయి, బర్లింగ్‌టన్‌లో ధూమయంత్రం మరమ్మత్తుల ఫోర్‌మన్ అయాడు. 1873 వ సం॥లో మిచిగాన్ & ఫాండుడ్యూలాక్ రైలు కట్ట యంత్రాధికారి అయాడు.

"కనుక చూడు వాల్ట్! హెడ్ ఫోర్‌మన్ తర్వాత మెట్టు ఎక్కడైనా యంత్రాధికారి అవటమే."

"కాని హిక్కీ! మీరు కళాశాలకి వెళ్ళారా."

"అవును. తర్ఫీదుపొందే మునుపు టొరొంటోలో అప్పర్ కెనడా కళాశాలలో చదువుకున్నాను. విద్యాభ్యాసంకోసం కళాశాలకు వెళ్ళ నవసరంలేదు. తపాలా శిక్షణలని సాగనియ్యి. మిగతావాళ్ళకంటె వేగంగా నేర్చుకోగలవు. ఎవరైనా చెప్పడానికి బదులు స్వయంగా వ్రాయటంవల్లా. చదవటంవల్లా చదువు బాగా అబ్బుతుంది. ఇప్పుడు నువ్వు నేర్చుకునే దేమిటి? విద్యుత్ యంత్రశాస్త్రజ్ఞుడి శిక్షణా?"

"అవునండీ. ప్రస్తుతం మసోదా వ్రాయటం నేర్చుకుంటున్నాను. కాని నాకు ఇక్కడే వుండాలనివుంది. ఇక్కడ చాలా హాయిగావున్నాను. నేను..."

"నాకు నిన్ను వదులుకోవటం ఏమాత్రం యిష్టంలేదు. కాని ఇక్కడి హెడ్ ఫోర్‌మన్ చాలా తెలివిగలవాడు. నేను చనిపోయేంతవరకో లేక నా వుద్యోగం వూడేంతవరకో అతను ఆ పని చెయ్యగలడు. పదిపదిహేనేళ్ళు కాచుకునుండాలని వుందా? నీకంటె మంచి కార్మికుడు వస్తాడనే ఆశలేదు నాకు. నీకు కావలసినంతవరకూ ఆ పని నీదే."

"కాని హిక్కీ నాకు నీ సలహా కావాలి."

"ఆ ఉద్యోగం తీసుకో వాల్ట్. నీకు ఇది ఒక గొప్ప అవకాశం. చిన్నతనంలోనే అధికారం చెలాయించట మెలాగో నేర్చుకుంటున్నావు. ఆపెయ్యకు" కొంచెం ఉత్సాహం తగ్గించి అప్పుడిలా అన్నాడు "నేనే గనుక నీ స్థానంలోవుంటే ఆ వుద్యోగం తీసుకుంటాను. ప్రవీణత సంపాయించిన ఒక వుద్యోగంలో హాయిగా వున్నావు గనుక చక్కని అవకాశం జారవిడుచుకుంటే నేను విచారిస్తాను. భవిష్యత్తుని గురించి ఆశ్చర్య పడొద్దు."

"ఆశ్చర్యపడటం లేదు. కాని నాకు ఒక భార్యా, బిడ్డా వున్నారు."

"నీ భార్య తెలివైనది. ఆమెతో మాట్లాడు. ఏ విషయం నాకు తెలియజెయ్యి. శుభం కలగాలని ఆశిస్తున్నాను" ఇంజనీర్లు ముందుకి పోయేందుకు రైలు నడిపేవాళ్ళు లాంతర్లను వూపినట్లుగా హిక్కీ పెద్దగా చేతిని వూగించాడు.

ఇంటికి వెళ్ళగానే నా భార్య బల్లమీద భోజనం సిద్ధంగావుంచింది. భోంచేస్తూ ఇద్దరం మాట్లాడుకున్నాం. ఫిల్మా ఎత్తు కుర్చీమీద కూర్చుని, కొయ్యచిప్పమీద గరిటెతో టప్‌టప్‌మని శబ్దంచేస్తోంది. "నువ్వేమంటావ్ డేల్లా? పదిహేను డాలర్లంటే రోజుకి పది సెంట్లు చొప్పున వస్తాయి. వెళ్ళటానికి ఎక్కువ ఖర్చుకాదు. సామానంతా సగం ధరకే వెళ్ళి

పోతాయి. మనకి రైలు పాసులుంటాయి. కాని ట్రినిడాడ్ కొన్ని వందల మైళ్ళ దూరముంది."

"చెప్పవలసింది మీరే. ఏమైనా నేను కోపపడనూ, విచారించనూ. తప్పకుండా ఆ డబ్బు మన అక్కరకి వస్తుంది" అంటూ డెల్లా పాపని చేతులతో చుట్టేసింది. అదే ఆమె సమాధానం.

"అల్లాగయితే వెళదాం."

ఒకప్పుడది శాంతాఫీ ట్రెయిలు. అనేక మంది అడుగుజాడలు, గుఱ్ఱపుడెక్కల ముద్రలు, బండి చక్రాల కీచుమనే శబ్దాలు ప్రతిధ్వనించే చరిత్రాత్మక మార్గం అది. బజారువీధిలో అడుగుపెట్టగానే నా పాదాలకి రాళ్ళు, పలకలు, ఇటికలు తగిలాయి.

ట్రినిడాడ్‌లో నూరికి తగలకుండా పైబట్టలు వేసుకునేవాణ్ణి. తరుచు బైట తిరిగేవాణ్ణి. పనిచేసేటప్పుడు మాసిపోయిన చుక్కల పాత పంట్లామూ, చొక్కా వేసుకునేవాణ్ణి. నేను సామాన్య కార్మికుణ్ణికానని, తెలివిగల ఫోర్‌మన్‌నని అందరికీ తెలిపేందుకు ఆ బట్టలజత సరిపోయేది. నా పై అధికారి హెచ్ గ్రెగ్సుకి 65 సంవత్సరాలు. మా శాఖకి ఉన్నత యంత్రాధికారిగా వుండేవాడు. అతనంటే నాకు అభిమానం ఏర్పడింది. కాని ఆ వృద్ధుడికి తన పని తాను చేసుకునేపాటి శక్తి వుండేదికాదు. అందుకనే ఆయన పని భారమంతా చాలామటుకు నామీద పడింది.

ఫోర్‌మన్‌గా ధూమయంత్రాలని మరమ్మత్తుచేసే భారమంతా నేనే మోయకునేవాణ్ణి. రైళ్ళు వెళ్ళేటప్పుడు మధ్యన తాత్కాలిక మరమ్మత్తులు చేయటమేకాదు, నూనె పోసి ధూమయంత్రాన్ని శుభ్రంచేయటం నేనే చూసుకోవాలి. ఇంతేగాక రైలుబండీలన్నిటినీ మరమ్మత్తు చేసే భారం నాదే. అక్కడ కొన్ని కొత్త బండీలనీ నిర్మించాను. నేను వచ్చినప్పుడు కార్ఖానాలో పని చురుకుగా సాగుతుండేదికాదు. సహజంగా అది రైలు కట్టగమనశక్తి స్థితిలో ప్రతిబింబించింది.

సంవత్సరం పైగా బండచాకిరీ చేశాను. రాత్రిళ్ళు బాగా నిద్ర పోయేవాణ్ణికాదు. బల్లదగ్గిర తొందరగా నాలుగుమెతుకులు తినేవాణ్ణి.

నిత్యం ఉద్యోగ సమస్యలని గురించి ఆలోచిస్తూండేవాణ్ణి. నాకు సహజంగా వుండవలసిన శరీరపుష్టి వుండేదికాదు. కాని కార్ఖానాలు, రైళ్ళ గమనశక్తి నేను వచ్చినప్పటికంటె చాలామటుకు అభివృద్ధి పొందాయి. ఒక రోజు నేను, సూపరిండెంటు వాన్‌బన్ కిర్క్ కలసి కార్ఖానాలో నడిచాము. హెడ్ ఫోర్‌మన్‌గా ఒక సంవత్సరం తొమ్మిదినెలలు పనిచేయటం వల్ల అదంతాచూసి గర్వపడగలిగాను. గుణవంతుడూ, విశ్వాసపాత్రుడూ, నిపుణుడూ అయిన ఒక ఫోర్‌మన్‌ని ఏరి అక్కడ వుద్యోగంలో పెట్టాను. పెద్ద జుత్తుతో పొడుగ్గా, అందంగా ఆజానుబాహువుడిలా వుండేవాడతను. అతను ఉద్యోగభారం వహిస్తున్నప్పటినుంచీ నాకు ఏ చింతా వుండేది కాదు. ఇది చెప్పటానికి కారణమేమిటంటే, గడచినజీవితం చూసుకుంటే, మనుష్యుల్ని తెలివిగా ఎంచుకోవటం నా నైపుణ్యాల్లో ఒకటనిపిస్తుంది.

"నీ కార్యాలయానికి పోదాం పద. నీతో మాట్లాడాలి" అన్నాడు బన్ కిర్క్ గంభీరంగా.

ఒక అరక్షణంపాటు. "పొరబాటు ఏమయ్యుంటుందా?" అని నన్ను నేను ప్రశ్నించుకున్నాను.

"వాల్టర్! నిన్ను అడగదలచుకుంది యిది. యంత్రాధికారి పని చెయ్యగలవా?"

"తప్పకుండా చెయ్యగలను. కాని గైగోల్టు ఏమవుతాడు. నాకీ వుద్యోగం యిచ్చేందుకు ఆ వృద్ధుణ్ణి పంపేసేట్లయితే యిది అంగీకరించను."

"ఆవేశ పడవద్దు. వాల్ట్! గైగోల్టు బాగా వృద్ధుడయిపోతున్న సంగతి నీకూ తెలుసు. సుళువుగా వుండేందుకు అతన్ని డెన్‌వర్ బైట ఒక చిన్న శాఖకి పంపుతున్నాము. ఈ వుద్యోగం అతనికి సరిపోదు. నిన్ను యంత్రాధికారిని చెయ్యదలచుకున్నాము."

కొద్దిసేపట్లో గైగోల్టు చెయ్యి జాపి నవ్వుతూ నావైపు వచ్చాడు. "నాకిది ముందే తెలుసు అభివందనాలు" అన్నాడు. రెండు మూడు వారాలలో అతను వెళ్ళిపోయాడు. ట్రినిడాడ్ ప్రాంతంలోని రెండు శాఖలకీ నేను యంత్రాధికారినయాను.

మేము నిర్వహించవలసినదేమిటో బన్‌కిర్క్ స్పష్టం చేశాడు. కొలరాడో & సదరన్ ఉత్తరశ్రేణి రైలుకట్ట అయేంతవరకూ మేము కృషి చేయాలి. మంచి కంపెనీ రైళ్ళు ఆలస్యంగా రాకూడదు.

ప్రతి రోజూ, 24 గంటలూ రైళ్ళు సకాలంలో వెళ్ళే సమస్యే నన్ను పీడించేది. బాధ్యతయనేది చాలా కష్టమైనది. కొన్నివందల మైళ్ళు రైలు కట్టలోని కార్మికులు, బండివాళ్ళు, యితర కుర్రాళ్ళు, దాదాపు వెయ్యిమంది పైగా వున్నారనుకుంటాను. ముప్ఫయేళ్ళ లోపువాడినైనా వాళ్ళంతా నన్ను "తాతయ్యా" అని సంబోధించేవారు. చిన్నవాడినైనందు వల్లే నాకదంతా అంత సరదాగా వుండేది. కాని ఇంకో ప్రతిఫలం గూడా వుండేది. నెలకి 140 డాలర్లు సంపాయించేవాణ్ణి.

రైలుకట్ట కార్మికుల తెగకిచెందిన జార్జి కాటర్ అనే వ్యక్తి నాకు మిత్రుడయాడు. నేను అక్కడికి హెడ్ ఫోర్‌మన్‌గా వెళ్ళినప్పుడు జార్జి సూపరింటెంటు అయాడు. అతనికేసి చూస్తుంటే నేనూ కళాశాలకి వెళ్ళి వుండవలసిందని లోలోపల అనుకునేవాణ్ణి. యంత్రశాస్త్రజ్ఞుడిగా వున్నప్పుడు రైలుకట్ట పరిపాలనా భాగంలో బాగా అధికారమున్న ఆ యువకుడికి తప్పక కళాశాల విద్య వుండివుంటుందని అనుకున్నాను. ఎక్కడికి వెళ్ళినా అతని శాంత స్వభావమూ, పరిష్కృత సంభాషణా నాలో అటువంటి భావం కలిగించిందనుకుంటాను. నాలోటుని భర్తీ చేసుకోవటానికి కష్టపడి తపాలా ద్వారా చదవనారంభించాను. తర్వాత కొన్నేళ్ళవరకూ జార్జి కాటర్ పధ్నాలుగేళ్ళప్పుడే పాఠశాల వదిలిపెట్టా డన్న విషయం నాకు తెలియలేదు. అతను ముందు రైలుకట్ట తంతివార్తను తీసుకుని పోయేవాడు, తర్వాత ఆపరేటర్ అయాడు. ఆ తర్వాత తన సోదరుడికి మల్లేనే రైలు డిస్పాచర్ అయాడు. చివరకి ఒక శాఖకి సూపరింటెంటు అయాడు. అదంతా తలచుకుంటే, రైలుకట్ట, అందులో పనీ, జార్జి కాటర్ చదువుకున్న విద్య అని స్పష్టమవుతుంది. ఆ పని అతన్ని పరిష్కృతుణ్ణికూడా చేసింది.

ఒకసారి అతను కార్ఖానానుంచి నా కార్యాలయంలోకి వచ్చి, ఒకటి రెండుసార్లు ఆదుర్దాగా మాట్లాడాడు.

"ఏమయింది?"

"(ఆల్ కాల్) బూడిద! నీళ్ళకొట్టు వెనుక బావిని ఏమైనా చెయ్యాలి. ఆ లోతుబావి పనిచేయకుండా వుంచేందుకు మార్గాధికారిని చాలా సేపు అక్కడే వుంచుతున్నాను. కాని అందులోని ద్రవపదార్థంలో ఎంతో నిప్పు బూడిదవుంది. అది ధూమయంత్రాలకి ఎంత చెరుపు చేస్తుందో నీకు బాగా తెలుసు."

పశ్చిమ రైలుకట్టల్లో అది ఒక పెద్ద సమస్య అయిపోయింది. ఎల్లీస్ కార్ఖానాల్లో నేను కసవు వూడ్చేటప్పుడు, అడుగున పేరుకున్న మడ్డి వూడొచ్చేంతవరకూ నీళ్ళ కొంగుగొట్టాల్ని గలగలమనే శబ్దంతో తోసు కెళ్ళేవాణ్ణి. అదే అక్కడ నేను చేసిన మొదటి పని. పశ్చిమ కాంసాస్‌లో అదొక సమస్య అనుకున్నాముగాని ట్రినిడాడ్ కార్ఖానాల్లో మటుకు ప్రాణసంకటమయిపోయింది.

"వాల్టర్! నీటికొట్టు అడుగున తీయని నీరువుంది. కాని అది సామాన్య పంపు పోలేనంత లోతుగావుంది. బహుశః ఆ లోతుబావిలోంచి నీళ్ళు తెచ్చుకునే విధం నీకు ఏమైనా తెలిసివుండొచ్చు. ఎలాగో చెప్ప గలిగావంటే నా పెద్ద సమస్యని పరిష్కరించినవాడవుతావు. నీ సమస్యా తీరిపోతుంది."

"జార్జి! నువ్వు నీటి అడుగునవుంటే వూటల్ని గురించి ఎప్పుడైనా విన్నావా?"

"ఏమిటది?"

"నీటి అడుగున వుంటేది" అందరూ ఆ బావిని గురించి వినివున్నట్లే ఆ మాటని మళ్ళీ ఒత్తిపలికాను. కొన్ని సంవత్సరాల క్రితమే ఒక వ్యాసంలో దాన్ని గురించి చదివాను. మళ్ళీ ఆ సంగతి వినలేదు. అదృష్ట వశాత్తు యంత్ర నమూనాలని గురించి చదివినప్పుడల్లా, నేను చదివేదేమిటో అర్థం చేసుకుందుకు ప్రయాసపడేవాణ్ణి."

"వాల్ట్! నువ్వు ఆ వూటలోంచి నీళ్ళు తియ్యగలిగితే—ఊ... ఇంకా చెప్పు..."

ఆ సమాచారం ఎక్కడ సంపాయించానో అతనికి చెప్పలేదు. కాని మా యింటికి భోజనానికి వెళుతున్నప్పుడు మటుకు ముఖ్య సూత్రాన్ని వివరించాను. "సామాన్య పంపు అవసరమే లేదు. దాన్ని నడిపేందుకు ఒక వాయువునొక్కేదీ, ఉక్కునీళ్ళ కొగూ కావాలి. సోడానీళ్ళు తాగడానికి కుర్రాడు గ్లాసులో సన్నపుల్ల పెట్టినట్లు, బావిలోకి ఒక గొట్టాన్ని పెట్టాలి. అప్పుడు నీటి అడుగున గొట్టంలోకి గాలి పోతుంది. ఆ గాలి నీటిని పైకి ఎగద్రోస్తుంది. దాన్నంతా జాగ్రత్తగా అంచనా వేసుకోవాలి. కానీ బావి లోతు ఒక్కసారి తెలిసిందంటే అదేమంత కష్టమైన పనికాదు."

జార్జి సంతోషంతో బల్లమీద కొట్టాడు. "అబ్బ! నువ్వది చెయ్యగలిగితే—అటువంటి దాన్ని గురించి ఎక్కడ విన్నావు"

"ఓ! అనేక విషయాలని గురించి వింటుంటాను"

"సరే నాకది చేసిపెడతావా?"

"తప్పకుండా" నిజానికి అటువంటి వాటిని నేను చూడనైనాలేదు.

"మొదట ఒక వాయువునొక్కేదాని (కంప్రెషర్) ధరలు, తర్వాత వేలంపాటలో గొట్టాన్ని కొనేందుకు ధరలు అంచనా వేసుకున్నాను. కావలసిన నీటి లోతు దాదాపు 600 అడుగులని మొదట్నుంచే మాకు తెలుసు. లెక్కవేసిన తర్వాత దాని ఖరీదు 9500 డాలర్లు అయింది. ఆ ఖర్చుని జార్జి అనుమతించాడు. నన్ను వెళ్ళి పని తనిఖీచేయమని చెప్పారు."

బావిని 600 అడుగులు తవ్వాము. 480 అడుగుల లోతున దానికి కప్పేశాము. సమాన ఎత్తున ఒక నీళ్ళకుండు తయారయింది. ముప్పాతిక అంగుళాల రంధ్రల చుట్టుకొలతవున్న 75 అడుగుల పొడవు గొట్టాన్ని నీటి అడుగున పెట్టాము. దాంతోనే నీటిలోనికి వాయువుని ఊదాలి. ఆకారాది, పునాదివేసి, ఉక్కునీళ్ళ కొగునీ. వాయువు నొక్కేదానినీ పెట్టటంతప్ప దానికి కావలసిందేమీ లేదు.

చిట్టచివరకి ఒక వారంలో నీటి అడుగు బావి పూర్తవుతుందనగా కౌటర్‌నుంచి తంతి వచ్చింది. పని అయిపోయేంతవరకూ నాతో వుండ

టానికి వస్తున్నానని అందులో వ్రాశాడు. జార్జితో గడపటం అంటే నాకు సరదాగానే వుండేది. అందుకని అతని రాకకోసం ఎదురుచూశాను. ఎంతైనా అతను వచ్చినప్పుడు మనసు చాలామటుకు తేలికపడింది. అలాటి అనుభూతి నాలో అంతకుముందెన్నడూ కలగలేదు. కాటర్ ఒక సొంత కారులో వచ్చాడు. అతనికూడా మార్గాధికారి వుద్యోగులు, వంతెన నిర్మాణం సూపరిండెంటులూ, మరికొందరూ, శాఖలలోని ఫోర్‌మన్‌లు వచ్చారు. నేను కాన్‌సాస్‌లాటి చిన్న పట్టణస్థుణ్ణి. జీవితాన్నంతా పూర్తిగా పనిలోనే లీనం చెయ్యటంవల్ల ఎన్నో విషయాల్లో అజ్ఞానంగా వుండేవాణ్ణి.

"మనం కారులోనే భోంచేస్తున్నాము వాల్ట్."

"అలాగే. కాని ఇక్కడ పని వదలిపెట్టలేను. వీళ్ళని తనిఖీచెయ్యాలి-"

"ఓ! రద్దూ! నువ్వు ఎక్కడో ఒక చోట భోజనము చేసితీరాలి కదా."

"నా అన్నం సంచీ వుంది. కాస్సేపయిన తర్వాత నిన్ను కలుసు కుంటాను."

ఆ రోజు కాటర్ వచ్చినప్పుడు తన కారులోకి రమ్మని మూడుసార్లు అడిగాడు. తప్పే యంత్రంతో పనిచేయటంవల్ల నేను మురికిగా, జిడ్డుగా తయారవటంవల్లో, బట్టలు మార్చుకోవటానికి యిష్టంలేకో, నిద్రపోవ టానికో, ప్రతిసారీ వెళ్ళకపోవటానికి ఏదో ఒక కారణం అడ్డువచ్చేది. ఆ కారులోకి వెళ్ళకుండా వుండేందుకు కారణాలని ఊహించుకుంటూ కూర్చున్నాను. నిజానికి నేను భయపడ్డాను. అంతకుముందు ఎన్నడూ నేను కారు ఎక్కలేదు. కార్లో ఎలా ఎక్కాలో నాకు తెలియదు. అందుకని కారు ఎక్కటానికి జంకాను.

రెండోరోజు మధ్యాహ్నం జార్జి నా దగ్గరకివచ్చి చెయ్యి పట్టు కున్నాడు. తర్వాత ఒక ఐరిష్ మార్గాధికారి నా రెండోచెయ్యి పట్టు కున్నాడు. అతను దృఢకాయుడు.

"భోజనానికి రా" సంచీలో నా భోజనం వుందని చెప్పేందుకు నోరు తెరిచే లోపు నాలుగడుగులు లాక్కెళ్ళిపోయారు. "పోదాం రా" కాటర్ నీలాల నేత్రాలు ఏదో "మోసం వీల్లేదు" అన్నట్లు నాకేసి చూశాయి. వాళ్ళు నన్ను బావిలో పడత్రోయటానికి ప్రయత్నిస్తున్నట్లు, భయంతో, తత్తరపాటుతో, వెనకాతలే వెళ్ళాను.

"నన్ను బట్టలు మార్చుకు రానివ్వండి."

"బట్టలు పోతేపోయె! కార్లో ఎక్కు" కార్లో ఎక్కించారు.

కొద్దిసేపట్లో బల్లముందు కూర్చున్నాను. దానిమీద తెల్లని శుభ్రమైన గుడ్డ పరచివుంది. తవ్వటంవల్ల నా బట్టలు జిడ్డుగా వున్నాయి. మురికి గుడ్డలతో నేను కదులుతుంటే బల్లమీద గుడ్డ తెల్లతనం నన్ను వెక్కిరిస్తున్నట్లుగా అనిపించింది. అన్నం వడ్డించే నల్ల జాతి పరిచారికలని కల్సుకోవటం అదే మొదటిసారి. రంగు దుస్తులు ధరించి అందరి కదలికలనీ వాళ్ళు జాగ్రత్తగా పరిశీలించటం మొదలెట్టారు. నేను ఏదైనా పొరబాటు చేస్తే తొందరగా పట్టుకునేందుకు వీళ్ళు అలా చూస్తున్నారా అనిపించింది. అప్పుడు ఘోరమైనదొకటి జరిగింది.

పరిచారిక ఉడకబెట్టిన రెండు పదార్థాలున్న పళ్ళాన్ని నాముందు పెట్టింది. అవి నా వేలంతవున్నాయి. ఆశ్చర్యకరమైన దేమిటంటే, అవి చివర్న దారంతో కట్టేసి, ధాన్యపు పొట్టుతో చుట్టినట్టున్నాయి. పచ్చిక బయలులో వేటగాడి దగ్గరనుంచి పారిపోయే సమయంకోసం కాచుకు న్న కోడి పిల్లకు మల్లే అప్రమత్తుడనై వృధాగా మిగతావాళ్ళకేసి దొంగ చూపులు చూశాను. చేతులు వూపుతూ జార్జి ఫోర్టువర్తుని గురించి మాట్లాడుతున్నాడు. ఐరిస్ మార్గాధికారి నీళ్ళు చప్పరించి, గడ్డం రాచు కోవటం మొదలెట్టాడు. పెద్ద మనుష్యులెవరూ తొందరగా భోజనం ప్రారంభించటంలేదు. అలా తీరుబడిగా కూర్చోవటం నాకు అలవాటు లేదు. మళ్ళీ పనిలోకి వెళ్ళాలి. అందుకని ఒక కత్తీ, గరిటా తీసుకుని, ఒక ముక్కని కోసి తినటం ప్రారంభించాను.

అక్కడున్న వాళ్ళంతా ఐరాను దేశస్థులే. నా ప్రవర్తన ఏ మాత్రం భరించలేక పగలబడి నవ్వేశారు. సంతోషంతో జార్జి గులాబీ వర్ణం చెంపలమీద ఆనందబాష్పాలు రాలాయి. ఆ వేడి పదార్థాలతో నన్ను తమాషా చెయ్యాలని జార్జి ముందే పథకం వేసుకున్నాడు. ఎఱ్ఱబారిన ముఖంతో ఆ ధాన్యం పొట్టుని తప్ప మిగతావన్నీ ఎలాగో అలాగ తినేశాను. అక్కడనుంచి వెళ్ళిపోవటం గురించి తప్ప మరి ఏ విషయాన్నీ ఆలోచించలేకపోయాను. మనసు నొచ్చుకుంటే తక్షణం నాకు చిరు కోప మొస్తుందని జార్జికి తెలుసు. అందుకని ఆ నవ్వుతో నా మనసు గాయపడ లేదని అతనికి గట్టినమ్మక మేర్పడేంతవరకూ వాళ్ళు నన్ను పోనివ్వలేదు.

అవేళ మధ్యాహ్నం బావి స్తంభం దగ్గిర నిల్చుంటే జరిగినదంతా కళ్ళకు కట్టినట్లు అవుపించింది. పళ్ళెంలో క్రొత్త పదార్థాలని చూడటం. వాళ్ళతో కలవలేకపోవటం, ఆడవాళ్ళకి ముఖ్యంగావుండే అనేక విషయాలు తెలియకపోవటం, ఆయాతనంతా గుర్తుకు వచ్చించి. నా భార్య కొన్ని జీవితవిధానాల్ని విచిత్ర భావంతో చూసేది. నాకూ అదే అలవాటయి పోయింది. ఎల్లీస్‌లోని అమ్మాయిలందరూ నాజూకుకోసం తెగ ప్రాకు లాడుతుంటే, డెల్లా సామాన్యమైన బల్లముందు కూర్చుని మామూలు భోజనం తినేది. బల్లదగ్గిర చూపవలసిన మర్యాదా? మధ్యాహ్నం ఈల వూదగానే యంత్రశాస్త్రజ్ఞుడు ఆకలితో యింటికి వస్తాడు. అప్పుడతను ఎటువంటి ఆలస్యాన్నీ భరించలేడు. కష్టపడి పనిచేయటంవల్ల విపరీతమైన ఆకలివుండి, మళ్ళీ ఈల వూదే లోపు తిరిగి పనిలోకి వెళ్ళవలసినప్పుడు మర్యాదంతా అతనిముందు భోజనం పెట్టి తిననివ్వటమే.

కాని కారులో ఆ మొదటి అనుభవం తర్వాత ప్రపంచంలో యంత్రాలూ, మనుష్యులేగాక యింకా అనేక విషయాలున్నాయని తెలుసు కున్నాను. ఆ రాత్రి మళ్ళీ జార్జితో భోంచెయ్యటానికి వెళ్ళాను. ఆ వార మంతా పూర్తిగా అక్కడే భోజనం చేశాను. నీటి అడుగు బావి పూర్తయి నందుకు వేడుకచేసిన రోజూ అక్కడే తిన్నాను. గొట్టాల ద్వారా నీరు పోయే అంచనాలు సరిగ్గా వుండటంవల్ల బావి మొదట్నుంచీ సరిగ్గా పని చేయటం ప్రారంభించింది. ఒక్క మీట నొక్కితే చాలు దాన్నుంచి

తీయ నీరు వస్తుంది. జార్జి అతని అనుచరులు చూస్తుండగా ప్రప్రధమంగా మీట నొక్కితే నీరు 40 అడుగులో ఇంకా ఎత్తుగానో పైకి పొంగింది.

ఆ నీటిలో బూడిదలేదు!

తర్వాత జార్జికి మరో వుద్యోగం దొరికింది. ఫోర్టు వర్తు & డన్‌వర్ సిటీకి ప్రధాన సూపరింటెంటుగా నియమింపబడ్డాడు. అవకాశమే కాదు. అర్థనా, అధికారము గూడా ఎక్కువవున్న వుద్యోగమది. ఆ మార్గం టెక్సాస్ టెక్సలైన్ దగ్గిర మా మార్గంతోకలసి ఫోర్టు వర్తు & డల్లాస్ వరకూ వ్యాపిస్తుంది. అతను వెళ్ళిపోయేముందు నన్ను చూట్టానికి వచ్చాడు.

"వాల్ట్! నువ్వు నాతో అక్కడికి ఎందుకు రాకూడదు? నీలాటి వ్యక్తితోనే నేను కలసి పనిచేయగలను. టెక్సాస్‌లో నువ్వు పరిష్కరించ వలసిన సమస్య ఒకటుంది."

"జార్జి. నువ్వు మొదట ఆ పనిని ఎలా యిష్టపడతావో చూడు."

అతను వెళ్ళిపోయిన మూడునెలలకి, ట్రినిడాడ్‌కి ముప్ఫై మైళ్ళ దూరంలోవున్న బిల్ట్రెడ్ టెక్సాస్ అనే ఒక చిన్న పల్లెలో తనని కల్సుకో మంటూ ఫోర్టువర్తు నుంచి తంతి యిచ్చాడు. ఆ పల్లె ఓక్లహోమాకి దక్షిణ పశ్చిమ కోణంగాను, రెడ్ రివర్‌కి దక్షిణంగాను వుంది. అక్కడ జార్జి నన్ను కల్సుకున్నాడు.

"పోయినవారం క్లారన్‌డన్‌లో మా కార్ఖానా కాలిపోయింది" అంటూ ప్రారంభించాడు.

"రైలుకట్ట నిర్మించేటప్పుడు కార్ఖానా అక్కడ వుండేది. కాని ఆ స్థలం సరియైనది కాదు. బిల్ట్రెడ్ అంతకంటె ఉపయుక్తమైన చోటు. అక్కడ పెద్ద శాఖ పెట్టుకుని, పనిచేస్తే బోలెడంత వెనకేయవచ్చు. వాల్ట్ నువ్వు యిక్కడికి వచ్చేయి. నీ మనసుకి ఎలా వుండాలనిపిస్తుందో అలాగే ఇక్కడ కార్ఖానాని నిర్మించు. దాన్ని నడుపు. శాఖకంతా యంత్రాధికారిగా వుండు."

"కార్ఖానా నిర్మించటంకంటె యిష్టమైంది నాకు మరొకటిలేదు.

విజయవంతంగా నడవని అనేక కార్ఖానాలు చూడటంవల్ల నాలో కొన్ని కొత్తభావాలు కలిగాయి. కాని—"

"ఊ! చెప్పు! ఏమిటది?"

"ఇది డెల్లాతో ప్రస్తావించాలి."

"అలాగే. నెలకి ఇరవై డాలర్లు ఎక్కువ వస్తాయని ఆమెతో చెప్పు"

"నాకు రావాలనే వుంది. కాని ప్రస్తుత పరిస్థితిలో యిదొక—నా పంట్లాముమీదా, జోళ్ళమీదా ఈ ఎఱ్ఱని దుమ్మంతా చూడు."

అది ఆకురాలు కాలం. మేమిద్దరం ఆ చిన్న పల్లెలో నడుచుకుంటూ వెళ్ళాము. అద్దెకి ఒకటే యిల్లు దొరికింది. ఎనిమిది ఎకరాల పొలం మధ్యవుండే ఒక పొలముకాపు యిల్లది. నాలుగు గదులతో పెట్టెకు మల్లే వుంది. కాపుతో మాట్లాడేందుకు నేనూ జార్జీ పొలంగుండా వెళ్ళాము. వాస్తవానికి ఆ యింట్లో స్త్రీలకి పనికి వచ్చేది ఏదీలేదు. నెలకి పది డాలర్లు యిచ్చేట్లయితే, కాపు తన కుటుంబాన్ని పొలంలో మరో చిన్న యింట్లోకి మార్చేందుకు ఒప్పుకున్నాడు. ఆ యింటికి నీటి సదుపాయమంతా ఒక బావి. గంధక సంబంధమైన రుచిగల నీళ్ళవి. అవి తాగితే కడుపులో తిప్పుతుంది. మేము ఆ యింట్లో వుండేట్లయితే మంచి నీటిని మరోచోటునుంచి తోడుకురావాలి.

బెల్ట్రిడ్‌లో కొత్త కార్ఖానాని నిర్మించాలనే కోరిక నా అంతరాత్మని పూర్తిగా ఆక్రమించేసింది. ట్రినిడాడ్‌కి తిరిగి వెళ్ళానేగాని నా భార్యని పాపతో అటువంటి కొంపలో ప్రవేశించమని ఎలా అడగాలో బోధపడలేదు.

"చాలా చిన్న యిల్లు డెల్లా! సరిగ్గా పొలంలోవుంది. ప్రస్తుతం ఇక్కడ నీకు స్నేహితులున్నారు. మనం హాయిగానే వుంటున్నాము. అక్కడ ట్రినిడాడ్‌కంటె తక్కువలోనే బ్రతకొచ్చు. నెలకి ఇంకా 12 డాలర్లు ఎక్కువ వస్తాయి. అన్నిటికంటె ముఖ్యమైంది నాకు ఇదొక చక్కని అవకాశం. బిల్‌ట్రెడ్‌లో కార్ఖానా నిర్మించానని చెప్పుకో గలగటం తర్వాత నాకు ఉపయోగపడుతుంది. నీకు బావి నీళ్ళని గురించి

చెప్పానా? ఆ నీళ్ళు పాపని ఒక చుక్కగూడా తాగనివ్వరు. పొలంలో ఆ యిల్లు—"

"మనం ఆ చోటికి వెళ్ళవలసి వుందనుకుంటే నా విషయమై విచారించకండి. మీ భవిష్యత్తుకోసం ఎక్కడ వుండదలచుకున్నా నేను సంతోషంగానే వుంటాను." ఇంతవరకూ నా భార్యకోసమని నేను ఏ చోటా అలాగే వుండిపోలేదు. వాస్తవానికి నా స్నేహితుల భార్యలు రాగాలుతీసీ. కీచులాడీ భర్తల జీవితాలని నాశనం చేశారు. ఎప్పుడైనా నా భార్యగనుక "వీల్లేదు. అటువంటి చోటవుంటే ప్రమాదానికి పాపని గురిచెయ్యను. నన్ను ఆ గూట్లోకి లాక్కెళ్ళాలని ప్రయత్నించటంలో మీరు మూర్ఖంగానూ, స్వార్థంతోను ప్రవర్తిస్తున్నారు" అని వుంటే, నేను ట్రినిడాడ్‌లోనో, సాల్టులేక్ సిటీలోనో, లేక ఎల్గీస్‌లోనో వుండి పోయేవాణ్ణి. కాని నిరాశాపూరితుణ్ణిమటుకు అయేవాణ్ణి. నేను యంత్ర శాస్త్రజ్ఞుణ్ణిగా వున్నన్నాళ్ళూ. మొదట్నుంచీ డెల్లా నన్ను విశ్వసించింది. నా జీవితంలో ఆ విశ్వాసాన్ని మించి ఏదీ నాకు ఎక్కువ గర్వకారణాన్నీ; సంతృప్తినీ ఇవ్వలేదు. తర్వాత మేము టెక్సాస్‌లోని బిల్ ట్రెడ్‌కి వెళ్ళాము.

ప్రతిసారీ మేము మారినప్పుడెల్లా సామాను పాడవటం మొదలెట్టింది. మా కంబళీ అన్నిటికంటె ఎక్కువ చెడిపోయింది. అందుకని దాన్ని బిల్ ట్రెడ్ యింట్లోకి వెళ్ళినప్పుడు పరుపుకింద తిప్పివేశాము. సామాన్లు సాల్టులేక్ సిటీలో 170 డాలర్లకి కొన్నప్పుడే అంత బాగా లేవు. మామూలుగా వాడుకోవటమేగాక, రైళ్ళల్లో దూరప్రయాణాలు చెయ్యటంవల్ల, అవి చాలా ఘోరంగా తయారవటం మొదలెట్టాయి. అయినా నా భార్య ఒక్కసారి గూడా "ఎల్గీస్‌లో నాకు ఇలాటి సామాన్లు వుండేవి కాదు" అనటం నేను వినలేదు.

క్రొత్త కార్ఖానాలని నిర్మించటానికి ఆకురాలు కాలమేకాదు, శీతాకాలమూ సగం పూర్తయింది. అంతవరకూ ఎడతెరిపి లేకుండా పనిచేశాను. అవి పూర్తయిన తరువాత ఒక రోజు ఐవా, ఓలిమ్‌నలో జాన్. ఇ. బిసామ్

దగ్గిరనుంచి ఒక తంతి వచ్చింది. అందులో చికాగో వెస్టరన్ రైలు కట్టలో యంత్రాధికారి వుద్యోగం నాకు యిస్తానని వ్రాశాడతను. అక్కడతనికి అంతకన్న పెద్ద వుద్యోగం రాబోతోంది. అంటే అప్పుడు నేను సంపాయిస్తున్న దానికంటె నలభై డాలర్లు ఎక్కువవస్తాయి. కాని ఇతర ముఖ్య విషయాలు ఆలోచించవలసివుంది. పశ్చిమ ప్రాంతంలో నేనూ, బిసోమో స్నేహితులమయాం. అప్పట్లో ఓవలీన్ కార్ఖానాని గురించి అతను చాలా డంబాలు కొట్టాడు. ఒక చోటనుంచి మరొక చోటికి ధూమయంత్రాన్ని ఒక బొమ్మకు మల్లే తీసుకువెళ్ళే బల్లలూ. శుభ్రమైన నీళ్ళ గదీ, కార్మికులకి బట్టలూ, మొదలైన చిత్ర విచిత్రమైన వాటిని గురించి చెప్పాడు. బిల్ర్డెడ్‌లో అందరం యింకా ఒక తొట్టె లోని నీళ్ళే తాగేవాళ్ళం. ఒళ్ళు శుభ్రం చేసుకోవటానికి, ఎల్లిస్‌లోవున్న లాంటి తొట్టి తప్ప మరొకటి వుండేదికాదు.

నాకు చాలా అద్భుతమైన వుద్యోగమొచ్చిందనీ, వెంటనే అంగీకరించటమో, నిరాకరించటమో చెయ్యాలనీ ఫోర్టువర్తులోని జార్జి కాటర్‌కి తంతి పంపాను. అతనితో మాట్లాడేందుకు స్వయంగా వెళ్ళలేక పోయాను. చీఫ్ సూపరిండెంటేకాదు అతను నా స్నేహితుడు గూడా. అందుకని రాత్రి రైలులో ఫోర్టువర్తునుంచి వచ్చి, నాతో మాట్లాడగలిగితే సంతోషిస్తానని తంతి యిచ్చాను. జార్జి వచ్చాడు. దివ్యంగా మాట్లాడాడు.

"ఇది ఎలా వదులుకోను జార్జి? నిన్ను విడిచి వెళ్ళటం నాకు యిష్టంలేదు. కాని—"

"వాల్ట్! ఇది చాలా చక్కని అవకాశమని ఒప్పుకుతీరాలి. నేను ఎంతైనా 200 డాలర్లకంటె ఎక్కువ యివ్వలేను. ఓవలీన్‌లో ప్రారంభం లోనే నీకు 200 డా॥ వస్తాయి. అక్కడి కార్ఖానాలు బాగుండి వుండాలి. మంచి పట్టణంలో డెల్లాకిగూడా చాలా బాగుంటుంది. కాని నీ స్థానంలో ఎవరిని పెట్టను?"

"కార్ఖానాలో ఫోర్‌మన్‌గావున్న జార్జి లిటిల్‌ని నువ్వు ఎరగవు. కాని అతను నాకు బాగా తెలుసు. ట్రినిడాడ్‌లో అతన్ని ఫోర్‌మన్‌ని చేశాను. అప్పటినుంచీ అతను నాకూడా వుంటున్నాడు.

ఆ తర్వాత రవాణా కార్యాలయానికి వెళ్ళి, బిసోమ్‌కి వుద్యోగం అంగీకరించానని, ఒకవారంలో బయలుదేరుతానని తంతి యిచ్చాను.

రవాణా ముఖ్యోద్యోగి తంతి యిస్తుండగా నేను వెళుతున్న విషయం తెలుసుకున్నాడు.

"నువ్వు నిజంగా వెళిపోతున్నావా వాల్టర్ ? నువ్వు వుంటున్న యిల్లుని నేను అద్దెకు తీసుకోవచ్చునా ? నా భార్య మూడు నెలలుగా ఇక్కడే వుంటోంది. మేము చాలా ఘోరమైన చోట వున్నాము. ఏమంటావ్ ?"

"నా సామాన్లు కొనేట్లయితే ఆ యింటిని తీసుకోవచ్చు."

"వెళ్ళి చూద్దాం పద."

ఒంటి గుఱ్ఱంబండీ ఎక్కి, రైలు కట్ట మీద ఎఱ్ఱని ధూళి మధ్యనుంచి ఆ యింటికి వెళ్లాము. దూరాన పొలంలో బావురు మంటున్నట్లుంది యిల్లు. పడక గదిలోని సామాన్లు చూట్టానికి వెళ్ళినప్పుడు పాప నిద్రపోతోంది. వెండి సామాన్లు, బల్లమీదవేసే నార పట్టుగుడ్డలూ, దుప్పట్లు, కొన్ని ఇతర వస్తువులూ తప్ప మొత్తం అంతా అతనికి 100 డా॥కు అమ్మేశాను. వంటసామాన్లూ, మిగతా కొయ్య సామాన్లంతా అతనికి నచ్చాయి. అయిదు రోజుల తర్వాత అతను ఆ యింట్లో ప్రవేశించాడు. నేను, డెల్లా. థెల్మా ఉత్తరం వైపు ప్రయాణమై వచ్చేశాము. పాప బండీ, చిన్న పెట్టె తప్ప, మిగతా సామాన్లన్నిటినీ ఒక పెద్ద పెట్టెలో కట్టేశాము. బిల్ ఫ్రెడ్‌లో వున్నప్పుడు 500 డా॥ తప్ప మిగతా అంతా దాచాము.

ఫిబ్రవరిలో ఓ చక్కని రోజున డెక్సాన్ చేరుకున్నాము. నా భార్యతో "ఈ స్థలం నీకు చాలా బాగుంటుంది. ఓవలీన్ దాదాపు 6000 మంది వున్న పట్టణం. అన్నిటికంటె ముఖ్యంగా వైద్యుల ఆసరా వుండే స్థలానికే నిన్ను తీసుకెళ్ళవలసిన సమయం వచ్చింది" అన్నాను.

వూరు చేరుకునేటప్పటికి తెల్లవారింది. రైలుదిగి పద్దెనిమిది అంగుళాల లోతున మంచుగడ్డలున్న ఉత్తర ధృవ ప్రాంతంలో అడుగు

పెట్టాము. మేము ధరించిన బట్టలతో ఓక్సాలో వణకటం ప్రారంభిం చాము. రైల్లో సామాన్లు వేసుకునే వుద్యోగి దగ్గర పాప బండీ తీసుకున్నాను. పాపని దుప్పట్లతో కప్పి, హోటలుకి బయలుదేరాము. ఒకసారి పాప బండీ తోస్తూ జారి కింద పడ్డాను.

హోటల్లో గది తీసుకుని భోజనం చేసిన తరువాత వుద్యోగానికి బయలుదేరాను. తోవలో నేను నిర్వహించబోయే కొత్త బాధ్యత కనుపించింది. తెల్లని మట్టి దిబ్బలమీద అంతులేనన్ని పెద్ద మంచుగడ్డలు పడివున్నాయి. అవే రైళ్ళని వేగంగా పోనీకుండా చేస్తున్నాయి. అయినా రైళ్ళు వెడుతూనే వున్నాయి.

బిల్లమ్ నన్ను తిన్నగా కార్ఖానాలోకి తీసుకు వెళ్ళాడు. నా వొళ్ళంతా పులకరించింది. చలిని గురించి పూర్తిగా మరచిపోయాను. అంత పెద్ద కార్ఖానాని నేను ఎన్నడూ చూడలేదు. వాటి లోపల పదహారు లేక పద్దెనిమిది ధూమయంత్రాలని చూడవచ్చు. శీతాకాలంలో చీకటిగా వున్నప్పుడు ఆ కార్ఖానాలు నీలిరంగు దీపాలకాంతి రేఖలతో మిలమిల లాడుతుంటాయి. గొలుసులతో ధూమయంత్రాన్ని ఎత్తేందుకు పైన పెద్ద యంత్రాలున్నాయి. ప్రతీదీ అద్భుతంగా వుంది. యంత్రాల్ని తిప్పి పెట్టే బల్లలు చూస్తూనే మితిలేని సంతోషం కలిగింది. అంతేకాదు; కార్ఖానాలోని ఆ వస్తువులన్నీ నా ఆధీనంలో వుండబోతున్నాయి. కాని నేను ఒక్క క్షణం గూడా విచారించలేదు. అది చాలా పెద్ద వుద్యోగమే. నాలో చెయ్యగలననే ఆత్మవిశ్వాసముంది.

ఓవలీన్‌లో ఒంటి అంతస్తు మేడ అద్దెకు తీసుకున్నాము. దానికి చక్కని వసారా వుండేది. వేసంగిలో ద్రాక్ష తీగలు పాకించడానికి అది చాలా బాగుంటుంది. ఇల్లు బాగా విశాలంగా పెద్దదిగా వుంది. పెరట్లో ఒక పెద్ద తోట వెయ్యటం ప్రారంభించాము. అక్కడ ఒక ఖాళీ గాదె వుంది. నిజానికి మేము క్రొత్త సామాన్లు కొనుక్కు తీరవలసి వచ్చింది. కొనుక్కున్నాము గూడా. ఆ 500 డా॥ మినహాయింపు సేవింగ్సు బ్యాంకిలో వెయ్యాలనుకున్నాము. ఓవలీన్ చేరిన కొద్ది రోజులకి

మరో శిశువు కలిగింది. ఆమె బెర్నైస్. పెద్దయాక ఎడ్గార్ విలియమ్ గార్బిష్ ఆమెను వివాహమాడాడు.

మనుష్యులతో ఎలా మసలుకోవాలో తెల్సుకున్నాను. అధికార ముండటమే కాదు న్యాయమార్గ మెలాటిదో కూడా తెలిసింది. కాని నేను యంత్రశాస్త్రజ్ఞుడననే విషయం మటుకు ఎవరూ కాదనేవారు కాదు. చికాగో గ్రేట్ వెస్టరన్ అధ్యక్షుడు ఎ. బి. స్టిక్నీ న్యాయవాది ఇంజనీరు కూడా. ఆ రైలుకట్టని అతనే నిర్మించాడు. అతని కొడుకు సామ్యూల్ క్రాస్బీస్టిక్నీ కంపెనీ ఉపాధ్యక్షుడు, కార్యనిర్వాహకుడిగా వుండే వాడు. అతను మసచ్యూసెటికీ ఇన్స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ పట్ట భద్రుడు. చాలా మంచి ఇంజనీరు. కార్ఖానాలో నాకు చాలా మంది స్నేహితులుండేవారు. 1936 వ సం॥లో ఓవలీన్ లో నేను వుద్యోగం మానేసిన చాలా సంవత్సరాలకి ఓవలీన్ లో పరిచయమైన ఒక ఇంజనీరు నా కార్యాలయానికి వచ్చాడు. తను ప్లయిమవుత్ కార్లో వెళుతున్న సంగతి తెలియబర్చటానికి నన్ను వీధిలోకి తొంగి చూడమన్నాడు.

నేను ఐవీ వచ్చిన ఒక సంవత్సరం మూడు నెలల్లోనే జాన్ బిచ్చమ్ వెళ్ళిపోయాడు. అతని వుద్యోగం నాకు దొరికింది. మూడునెలల తర్వాత మళ్ళీ నా వుద్యోగం మారింది. గమనశక్తి సూపరింటెండెంటునయాను. చికాగోనుంచి ఓవలీన్ కి ఓవలీన్ నుంచి మిన్నెపోలిస్ వెళ్ళే రైలుకట్ట లోని ఇంజనీర్లు, బండివాళ్ళు, ఫైర్ మన్ లు, దుకాణదారులు మొత్తం నా అధికారంలోనే వుండేవారు. నిజానికి అంతకంటె పెద్ద రైలు కట్టలుం డేవి. కాని యంత్రశాస్త్రం వుద్యోగులందరికంటె ఉన్నత పదవిలో వుండే వ్వాణ్ణి. కొత్త విషయాలను నేర్చుకోవాలనే ఆసక్తి యింకా సమసిపోలేదు. అప్పటికి నాకు 350 డా॥ జీతం వచ్చేది.

తరుచు కార్యరీత్యా చికాగోకి ప్రయాణం చెయ్యవలసివచ్చేది. 1908 వ సం॥లో మోటారుకారు ప్రదర్శనం చూట్టానికి చికాగో వెళ్ళాను. అక్కడే స్థానిక మోటారుకారుని చూడటం తటస్థించింది. తెలుపు రంగు పూసిన కారులోపల ఎఱ్ఱని మెత్తని దిళ్ళున్నాయి.

కొయ్యతో చేసిన కారు పైభాగమంతా పచ్చరంగులో వుంది. దానిపక్కగా రెండు తోలు నాడాలు వేళ్ళాడుతున్నాయి. ఎక్కే పలకమీద ఒక చక్కని పనిముట్లు వేసుకునే పెట్టెవుంది. దాన్ని తెరవాలని నాకెంతో అనిపించింది. దాని పక్కనే ఒక తొట్టినిండా కారుముందరి భాగం దీపాల కోసం వాయువుపెట్టివుంది. గుఱ్ఱపు బండీలమీద వున్నట్లుగానే కారుపైన రెండు వైపులా దీపాలున్నాయి. గంధర్వ కన్యగానం మల్లే ఆ ప్రదర్శనం నన్ను సమ్మోహితుణ్ణి చేసింది. ప్రదర్శనం చూస్తూ 4 రోజులు తిరిగాను.

అనేకమార్లు వాకబుచేయగా కారుమీదవేసిన ధరకే దాన్ని అమ్ముతారని తెలిసింది. నాదగ్గర వున్నది 700 డా॥. దాని వెల 5000 డా॥ రొఖం. ఆ కారుని నేను కొనితీరాలా, అంతస్తోమత నాకు వుందా అని నన్ను నేనే తరచి తరచి ప్రశ్నించుకున్నాను. ఆ డబ్బుని ఎక్కడ పుట్టించ గలననే ప్రశ్నే నన్ను పట్టుకుంది.

# హార్సుపవర్ (గుఱ్ఱపు శక్తి)తో పరిశోధన

రచయిత కార్ల్ వాన్ వెచన్ సోదరుడు రాల్ఫ్ వెచెన్‌తో నాకు పరిచయముంది. అతనొక బ్యాంకి వుద్యోగి. కాంటి నెంటల్ నేషనల్ బ్యాంకి రెండవ ఉపాధ్యక్షుడుగా వుండేవాడు. డబ్బు గలవాడు. ఆరు అడుగుల పైగా పొడుగుంటాడు. 200 పౌన్ల బరువు. బ్రహ్మాండమైన విగ్రహం అతనిది. అతని సాహచర్యం నాకు చాలా బాగుండేది. సామాన్యంగా హోటలు బ్రెవుర్టులో మేము కలుసుకునే వాళ్ళం. రైలు కంపెనీ వుద్యోగుల సాంకేతిక స్థలమది. మాడిసన్ స్ట్రీట్ నుంచి చలువ రాతి మెట్లు దిగి ఆ చిన్న హోటలులో ప్రవేశించాలి. అక్కడ వాన్ వెచన్ కోసం కాచుకునుండేవాణ్ణి. అతను తప్పకుండా వచ్చేవాడు.

"వాన్ ! మోటారు కార్ల ప్రదర్శనంలో ఆ తెల్లని కారుని చూసే వుంటావు. ఆ కారు నన్ను మంత్రముగ్ధుణ్ణి చేసింది. దానికి నాలుగు తలుపులున్నాయి. తెల్ల సీట్లూ కాకీ రంగు టాపు."

"ఈ విషయం ఇవేళ పొద్దుటా మధ్యాహ్నమూ నాకు చెప్పావు."

అది నిజమే. అప్పు చీటీమీద 4300 డా బదులు యిస్తాడేమోయని చాలా రోజులుగా అతన్ని పీడిస్తున్నాను. నేను ఏదైనా చెప్పబోయినప్పుడల్లా "జామీనుల విషయమేమిటని" అతను నాకు అడ్డు తగిలేవాడు.

జామీను అనబడేది ఏదీ నాదగ్గరలేదు. నేను కూడబెట్టిన 7000 డాలర్లు వాన్ యిస్తే, 4300 డాలర్లు కలిపి ఆ కారుని 5000 డాలర్లకి కొనాలి. ఆ కారు మీద నాకు వెఱ్ఱి మోజు కలిగింది. ఎలాగైనా వాన్ దగ్గరనుంచి అప్పు తీసుకునేందుకు ఎన్నో రకాల వితండ వాదనలు చేశాను.

"వాన్ ! రవాణా వ్యాపారాన్ని గురించి నాకు ఎంతో తెలుసు. ఇక్కడ ప్రతిరోజూ రైలు కంపెనీలలో నువ్వు వ్యాపారం చేస్తున్నావు. కారు గూడా రవాణా వ్యాపారమే. రైలు కంపెనీలవల్ల మన దేశ సంపద అధికమయింది కదూ ?"

"తప్పకుండా"

"సరే! అయితే ప్రతి వ్యక్తీ ఒక సొంత కారున్నండీ, అన్ని చోట్లకీ ప్రయాణం చెయ్యగలిగితే మన దేశం ఎలా వుంటుందో ఊహించుకో. ఒక రోజు........"

"అవివేకంగా మాట్లాడకు వాల్ట్! నీకు నెలకి వచ్చేది 350 డాలర్లయితే ఒక కారు కోసం 5000 డాలర్లు ఖర్చు చెయ్యాలనుకుంటు న్నావు. "అతను పలికిన తీరు నా వాదనని నాశనం చేసేసింది.

"విను వాన్! త్వరలోనే నేను యింకా డబ్బు చేసుకోబోతు న్నాను. నీకు కావలసివుంటే కారు కూడే ఒక తాకట్టు పత్రం వ్రాసి యిస్తాను."

"నోటు మీద సంతకం పెట్టేందుకు ఎవరినైనా తెచ్చుకో. అప్పు యిస్తాను. నీతో సంతకం పెట్టే వ్యక్తికి సిరా కలమే కాకుండా యింకా ఏమైనా ఆస్తి వుండాలి."

"నిజంగానా? నేను ఎవరినైనా తెస్తే........"

"ఎవరినైనా డబ్బు గలవాడిని తీసుకురా. నువ్వంటే నాకు యిష్టం. మోటారు కారుకంటె నిరర్థకమైన దానికోసం నీకు డబ్బు కావలసి వచ్చినా అది నా డబ్బే అయితే సహాయపడేవాణ్ణి. కాని ఇప్పుడు నువ్వు బదులు పుచ్చుకో ప్రయత్నించేది బ్యాంకి డబ్బు. ఇది........"

"బిల్ కాజే సంగతేమిటి?" బిల్ బివుడా యిన్ కాజే ఒక సివిల్ ఇంజనీరు. వర్జీనియా దేశస్థుడు. చికాగో గ్రైల్వే శాఖకి సూపరింటెంటుగా వున్నాడు. అతను వాన్ వెచన్ కి సన్నిహిత స్నేహితుడు. చికాగోలోనే వున్నాడు. అతను నాకూ మిత్రుడే. మొదటి ప్రపంచ యుద్ధంలోనూ ఆ తరువాత ఆస్ట్రియన్ ప్రభుత్వానికి సాంకేతిక సలహాదారుడిగా వున్నప్పుడు అతను గొప్ప పేరు సంపాయించుకున్నాడు.

"నీతోపాటు నోటు మీద సంతకం చేయటానికి బిల్ ని తేగలిగితే ఇది స్థిరం చేసెయ్యొచ్చు. బిల్ దగ్గర కొంత డబ్బుంది"

నా మొదటి మోటారు కొనేందుకు ఆవిధంగా డబ్బుచేశాను. సాల్టులేక్ సిటీలోనూ ఓవలీన్ లోనూ సామాన్లు కొన్నప్పుడు మటుకే నేను అప్పుల్లోకి దిగాను. నాకు ఆ కారుమీద వున్న మోజు మిగతా వాళ్ళకి పిచ్చిలాగే కనుపించి వుండాలి. నిజానికి కాజేతోనూ, వాన్ వెచన్‌తోనూ నేను పిచ్చిగానే వాదించి వుండాలి. నాకు కారు కావలసింది తిరగటానికే కాదు. అందులోని ఇంజనుని తెచ్చుకుని దానిని గురించి మొత్తం నేర్చుకోవాలి. దాన్ని గురించి నేనెందుకు తెలుసుకో కూడదో నాకు అర్థం కాలేదు. ఆ బండీలు తమంతట తామే ముందుకి నడచేటట్లు చేసే యంత్ర సాధనాలవి. వాటిని చూస్తే మాకు ఆశ్చర్యంగా వుండేది. అటువంటివి మా కింతవరకూ చిక్కలేదు.

కొన్నేళ్ళ తర్వాత వాన్ వెచన్ వడ్డీవ్యాపారస్థుల ముఠా సభ్యులలో ఒకడయ్యాడు. ఎల్లిస్ ఓవర్‌లాండ్‌కి అప్పు యివ్వడంవల్ల బ్యాంకు 5.000.000 డాలర్లు నష్టపోతోందని తెలిసినప్పుడు వెచన్ నాకు ఆ అప్పు యిచ్చినందుకు సంతోషపడ్డాడు. ఆ కంపెనీని నష్టపోకుండా కాపాడేందుకు నన్ను వాళ్ళ వ్యవహారం చూచుకోమన్నారు. ఒక ఒడంబడిక తయారయింది. దానిప్రకారం సంవత్సరానికి 1,000,000 డాలర్లు చొప్పున రెండు సంవత్సరాలు నేను పనిచెయ్యాలి. వాన్ మంచి హాస్యగాడు. ఆ తర్వాత చాలా రోజులవరకూ నోటుమీద అతని బ్యాంకినుంచి అప్పు తీసుకుని మోటారుకార్లని గురించి నేను ఎలా నేర్చుకోవటం మొదలెట్టానో చెప్పి ఎగతాళిచేసేవాడు.

ఓవలీన్‌లో వున్నప్పుడు మా పెరట్లోనిగాదెలో తోటపనిముట్లు పెట్టుకున్నాము. కాని ఆ గాదెలో సగానికి పైగా ఉపయోగంలేని చిన్న చక్రాలుండేవి. ఆ యింట్లో మేము రాకముందు అద్దెకున్నవాళ్ళు ఆ సామాన్లని వదిలేసివెళ్ళారు. ఆ తుక్కంతా కాల్చిపారేశాను. ఒక బండీ చక్రం, గుఱ్ఱపుజీను, గుఱ్ఱపుతైలం వున్న బుడ్డీలు ఆ మంటలో పడేశాను. మంట బాగా కాలేంతవరకూ గడ్డీయితర తుక్కూబండీ లాగే కొయ్యలతో మోసుకొచ్చి దాంట్లో కుక్కాను. అదంతా చూసి నా భార్య చాలా ఆశ్చర్యపోయింది.

"ఇది ఒక కార్ఖానాకి ఉపయోగపడుతుంది."

"ఏం చెయ్యదలచుకున్నారు?"

"డెల్లా! నే నొక కారు కొన్నాను."

దాచిపెట్టిన రొఖాన్ని ఎలా ఖర్చుచేసిందీ, ఒక సంవత్సరంలో నేను సంపాయించుకోగలిగిన దానికంటె ఎక్కువ డబ్బు ఎలా అప్పుచేసిందీ.— అంతా ఆమెకి చెప్పాను. నన్ను ఆమె కోప్పడలేదు. కాని వంటయింటి తలుపు మూసినప్పుడు మాత్రం అది మామూలుకంటె కాస్త ఎక్కువ శబ్దం చేసినట్లనిపించింది. బహుశః ఆమె తలుపుని గట్టిగా తోసివుంటుంది.

గూడ్సుబండీలో కారు వచ్చింది. దాన్ని నడపటం నాకు తెలియదు. కాని నిస్సందేహంగా మరో వ్యక్తిచేత మటుకు మొదట ఆ కారుని నడప నివ్వదలచుకోలేదు. గుఱ్ఱపు బండీ వాడి సాయంతో కారుని గాదె దగ్గరికి తీసుకువెళ్లాను. కారుని పెరట్లోకి త్రిప్పుతుంటే ధెల్మా సంతోషంతో గంతులు వేసింది. బెర్నిస్‌ని ఎత్తుకుని డెల్లా నాకేసి చూసింది. ఆక్షణంలో నేను పొందినంత ఆనందం మరెప్పుడూ అనుభవించలేదనుకుంటాను. అది ఒక బ్రహ్మాండమైన రత్నమైనా నేను అంత జాగ్రత్త పడివుండను.

నా భార్య ఉత్సాహానికి అంతులేదు. వెంటనే కారు ఎక్కి ఒక సారి తిరగాలంది. కాని నేను కారుని చాలా రోజులు పాకలో వుంచాను. ఇక కారు ఎక్కి తిరిగే అవకాశముండదని ఆమె నిరాశ చెందింది. కొంటె ప్పుడు నేను ఇంజనుని వుత్తినే నడిపిస్తుంటే ఆమె కారులో కూర్చునేది.

ప్రతిరోజూ చీకటి పడేదాకా పాకలో పనిచేసే వాణ్ణి. కొంటె ప్పుడు రాత్రిళ్ళు బాగా పొద్దు పోయేదాకా కారుని వదలి వెళ్ళేవాడనే కాను. శనివారం మధ్యాహ్నాలూ, ఆదివారాలూ పూర్తిగా ఆ కారు పనిలో వుండేవాణ్ణి. మోటారు కారు పుస్తకాలు తెప్పించి, వాటిలో జాబితాలని చదివీ, అందులో చిత్రాలు చూసీ, మరికొన్ని చిత్రాలని నేనే స్వయంగా వేసేవాణ్ణి. నేలమీద కాయితాలు వేసి ఇంజను లోపలిభాగా లన్నీ పరిచాను. ఇంజను ఒక్కొక్క భాగం పనిచేసే తీరు పదే పదే పరీక్షించాను. చివరకి వాటిని మళ్ళీ కలిపి, ఇంజను గురించి బాగా తెలిసి

పోయిందని రూఢి చేసుకున్నాను. అప్పుడు ఇంజను తిప్పితే గడియారం మళ్లీ పని చేస్తోంది.

"ఎక్కి తిరగని కొటికి కారు వుండి ప్రయోజనమేమిటి?"

"తొందరపడక డెల్లా!"

"తొందరా! కారు తీసుకువచ్చి మూడు నెలలయింది. పాకలోంచి ఒక్కసారి కూడా బైటికి తియ్యలేదు."

ఆవేళ శనివారం. మధ్యాహ్నం బాగా ఎండ కాస్తోంది. పై కోటు తీసేసి చొక్కా చేతులు పైకి మడుచుకున్నాను. భోజనం చెయ్యటం పూర్తయింది.

"పాకలో మూడు నెలల నుంచి వుండంటున్నావుకదూ! సరే. ఇవేళ మధ్యాహ్నం అది బైటికి వస్తోంది. వచ్చి చూడు."

అప్పటికే ఆ చుట్టుపక్కలంతా మోటారు కారు విషయం అందరికీ తెలిసిపోయింది. కాని ఆరోజు మటుకు ఏదో విశేషం జరగబోతోందని అంతా పాకిపోయింది. కారులో కూర్చుని, ఒక చేత్తో చక్రాన్ని తిప్పుతూ, ఇంకో చేత్తో కారుని నడిపించే మీటని లాగుతుంటే, ఇరుగు పొరుగు గుంపుగా చేరారు. ఆరోజుల్లో స్టీరింగు ఇంకా కుడివేపునేవుండేది. కారు చక్రాలని గొలుసులే త్రిప్పేవి. అందుకని నేను మీటని ముట్టుకున్నప్పుడల్లా పెద్ద శబ్దం అయేది. ఆ కారు బయలుదేరటానికి పడే అవస్థ మటుకు హాస్యాస్పదంగానే వుండేది. కాని ఇంజను సరిగ్గానే తిరుగుతోంది. వెనక్కి తిరిగి చూసినప్పుడు వెనుక ఎక్కువ పొగ రావటంలేదు. అప్పుడు నోట్లో వేరే పొగ చుట్ట పెట్టుకుని కారుని బయలుదేరతీశాను.

మొదటిసారి బండీకి కట్టిన అడవి గుఱ్ఱం లాగా కారు ముందుకి నడిచింది. ఇరుగు పొరుగు కొందరు కేకలు పెడుతుంటే మేము సాగిపోయాం. అలా వెళ్ళి వెళ్ళి అది ఒక గొయ్యిలో పడిపోయింది. దొర్లుకుంటూ పోయి నా స్నేహితుడి తోటలో ఆగింది.

ఆ కాస్సేపట్లో చుట్ట ముక్కాలి వంతు కాల్చేశాను. గుఱ్ఱపు బండీ

వాడి కోసరం కబురు పంపాను. అతను రాళ్ళమీద గలగలమనే శబ్దంతో గొలుసు ఈడ్చుకుంటూ వచ్చాడు. గుఱ్ఱాల కాళ్ళనిండా దట్టంగా బురద వుంది. "గొలుసులు పెట్టేటప్పుడు జాగ్రత్త! కారు రంగు చూసుకో! నా కారుని పాడుచెయ్యదలచుకున్నావా?"

"నేనింతకు ముందు కార్లని లాగాను. మీరు చొక్కా తియ్యవద్దు. గుఱ్ఱాలని నేనే పట్టుకుంటాను."

కారుని బైటికి లాగాము. బండీ వాడికి కూలీ యిచ్చి ఆగ్రహంలో వున్న స్నేహితుడికి మళ్ళీ అటువంటి పొరబాటు జరగదని మాట యిచ్చాను. కొందరు ఎగతాళిగా నవ్వటం వినిపించింది: కారు ఎక్కి ఒక్కుమ్మడిన ముందుకి సాగాను. చక్రాన్ని మటుకు గట్టిగా పట్టుకుని కారుని యథేచ్ఛగా పోనిచ్చాను. మలుపులో తిరగవలసి వచ్చినప్పుడు కారు పెద్ద శబ్దమే చేసింది. రెండు చక్రాలు మటుకు నేలని తాకుతున్నట్లు దాన్ని పరుగెత్తించాను. కారు కుదుట పడేసరికి తిన్నగా ఓవలీన్ సరి హద్దులు దాటి పోయాము.

నాముందు కొన్నివందల మైళ్ళ దూరంలో ఒక ఆవు సందుచివర్న వున్న కంచెలోంచి రావటం కనుపించింది. అది తిన్నగా రోడ్డువైపే వస్తోంది. నాలుగయిదుసార్లు నేను గట్టిగా హారను కొట్టాను. కాని అది తిన్నగా నడిచిరావటం మానలేదు. నేను కారు గమనాన్ని ఆపలేక పోయాను. చక్రాన్ని చేతితో గట్టిగా పట్టుకుని పళ్ళు కొరకటం తప్ప యింకేమీ చెయ్యలేకపోయాను.

బాగా దగ్గిరగా వెళ్ళినా ఆ ఆవుని తప్పించుకున్నాను. ఆ రోడ్డు పొడుగూతా కొన్ని గుంటలనీ, పల్లాలనీ తప్పించుకుంటూనే వచ్చాను. కాని ఆ రోడ్డుకి మరో రోడ్డు కలిసే మలుపుదగ్గిర కారుని నెమ్మదిగా తిప్పాను. మరో మైలు వెళ్ళి చతుష్కోణంలోని మూడోవైపు తిరిగి ఇల్లు చేరుకున్నాను. ఇంటికి పోయే దారిలో ఇంజనుకి యింకా గాలిపోసాను. ఈ రోజుల్లోని అంచనాలని బట్టి ఆ కారు గుఱ్ఱపు శక్తి 80 వుంటుంది. కాలానుక్రమంగా గంటకు దాదాపు 20 మైళ్ళ వేగంలో వెళ్ళేవాడను.

కారుని పాక దగ్గరకి తీసుకెళ్ళాను. దాన్ని లోపలికి తొయ్యటానికి అంతా సాయపడ్డారు. తలుపు మూసేసిన తర్వాత అలసటతో నేనెంత వణకి పోతున్నానో బోధపడింది. ఆ సంబరంలో, బలహీనతలో, చెమటపోసి, ఒంటిమీద బట్టలన్నీ తడిసిపోయాయి. అప్పటికి సాయంత్రం ఆరు గంటలయింది. ఇంట్లోకి వెళ్ళి, ఆ బట్టలు విప్పేసి, స్నానంచేసి పడు కున్నాను. కారు నడపడము ఆ విధంగా నేను నేర్చుకున్నాను.

అలా ప్రారంభించిన తర్వాత దాన్ని బాగా వేగంగా నడపడం అలవడింది. నాటు రోడ్లమీదే కాదు, ఓవలీన్ పట్టణంలోనూ నా కుటుంబ మంతా కార్లో తిరిగేవారు. అందులో వెళ్ళేటప్పుడు నేనూ నా భార్యా దుమ్ము సులభంగాపోయే నారపట్టు బట్టలు తొడుక్కునేవాళ్ళం. ఆ తర్వాత అనేకసార్లు ఆ కారు భాగాలన్నీ వూడదీసి, క్రిందపరచి, చీకట్లోకూడా వాటిని సమంగా పెట్టగలననే నమ్మకం కలిగేంతవరకూ వాటిని పరీక్షించడము జరిగింది. ఎంతైనా నాకు ఇతర పనులుండేవి.

రైలుకట్టకి ధూమయంత్రం ప్రాణమువంటిది. నేనే కాదు నా స్థానంలోవున్న వాళ్ళెవరైనా సవ్యంగా పనిచేయటం చికాగో గ్రేట్ వెస్టరన్ రైల్వేవారికెంతో అవసరం. ఎప్పుడైనా ధూమయంత్రం విరిగినా, రైలు ఆలస్యమైనా, అసలు తప్పు ఎవరిదైనాసరే గమనశక్తి సూపరింటెం డెంటు దానికి బాధ్యుడవుతాడు. అందుకని నేను ఇతర వుద్యోగాలకోసం వెతుకుతూనే వున్నాను. ఓవలీన్‌లోని చక్కని కార్ఖానాలేకాదు, మిన్నె పోలిస్ సెయింటుపాల్, ఓమహా, కాన్‌సాస్‌లలో ఇంకా యితర కార్ఖానా లున్నాయి. కొన్ని కోట్ల డాలర్ల ఖరీదుగల సామాన్లు నా ఆధీనంలో వున్నాయి. అంతేగాక, కొత్త ధూమయంత్రాలు, బండీలు, బొగ్గు, యితర వస్తువులు అన్నీ నా ఆజ్ఞమీదే కొన్నారు. యంత్రశాస్త్ర శాఖలోవుండే వందల మందిలో ప్రతి ఒక్కరికీ నేనే బాధ్యతవహించాలి. ముప్పైనాలుగో పడిలోకి వస్తున్న యువకుడికి అది చాలా పెద్ద భారమే. నిజానికి అక్కడి వాళ్ళందరూ నాకు కనీసం 28 సంవత్సరాలన్నా వుంటా యని అనుకున్నారు. కొంతప్పుడు అంతకంటె పెద్దవాణ్ణికూడా అనుకునే

వారు. వయసు తక్కువవటమే ఒక లోపమైనట్లు కాలం వెళ్ళబుచ్చటమనేది చాలా విచిత్రమైనది.

మనుష్యుల్ని ఏరుకోవటం గురించి చాలా నేర్చుకున్నాను. నా స్నేహితుడొకడు ఆ కాన్‌సాస్ సిటీలో పని మానేసి, వుద్యోగంకోసం వెతుకుతున్నాడని విన్నాను. తంతి యిచ్చి, అతను ఓవలీన్‌కి వచ్చే ఏర్పాటు చేశాను.

నేను తన కొడుకే అయినట్లు గర్వంగా, ఆప్యాయంగాచూస్తో నన్ను పలకరించాడు గస్ న్యూబర్టు. ఉభయులం కౌగలించుకున్నాము.

"గస్. ఈ శాఖకి నువ్వు యంత్రాధికారిగా వుండు. నాకు నీ సాయంకావాలి."

గస్ పరిస్థితి అంత బాగా లేదు. అకస్మాత్తుగా ఇప్పుడది కుదుట పడింది. మాట్లాడేటప్పుడు అతను యిబ్బంది పడ్డాడు. నేను కొంత కలవర పడ్డాను. మొదట్లో నేను కసవు వూడ్చేవాడిగా వుండటం, తర్వాత తర్ఫీదు పొందటం, కార్ఖానాలో చెడుగుడు ఆడినందుకు గస్ నన్ను పనిలోంచి తీసెయ్యటం, మళ్ళీ పెట్టుకోవటం, అన్నీ జ్ఞాపకం చేసుకున్నాము. నిజంగా గస్ నాకు అవసరమయాడు. తతిమ్మావారికీ అతనంటె యిష్టం ఏర్పడింది. ఒకే వృత్తిలో వుండటంవల్ల మా ఉభయులకీ పరస్పర గౌరవం వుండేది.

ఓవలీన్‌లో పనిచేస్తున్నప్పుడు, నా జీవితంలో మొదటిసారిగా, సాంకేతిక వుద్యోగస్థులతో సన్నిహిత పరిచయమేర్పడింది. యంత్రాలని గురించి వాళ్ళు కళాశాలలో చదువుకున్నారు. అందులో రోడ్డు నిర్మాత్ల, అధ్యక్షుడి కొడుకు సామ్‌స్మిత్ ఒకడు. స్టిక్నీ నిర్వాహకాధికారిగానూ, ఉపాధ్యక్షుడిగానూ వుండేవాడు. అతని కార్యాలయంలో గోడమీద మసచ్యూటిస్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ పట్టా వేళ్ళాడుతుండేది. అది చూసినప్పుడల్లా నాకు ఈర్ష్య పుట్టుకొచ్చేది. స్టిక్నీయేగాక కళాశాల తర్ఫీదు పొందిన ఇంజనీర్లు, యంత్రశాస్త్రజ్ఞులూ ఉన్నత వుద్యోగాలలో వుండేవారు. వాళ్ళందరితోనూ పెట్టుకు రావలసివచ్చేది.

ముఖ్యంగా గమనించతగ్గ విషయమొకటుంది. కొందరు సాంకేతిక వుద్యోగస్థులు, కార్ఖానాలోని మోటు మనుష్యులకి, తమకి కావలసినవేవో వివరించటంలో నిష్ఫలులై, పనులని పాడుచేసుకునేవారు. 6 లేక 7 నెలలు తపాలా శిక్షణ పత్రాలని తుణ్ణంగా చదివి వారు ఉపయోగించే ప్రతి సాంకేతిక పదాన్నీ బాగా అర్థంచేసుకున్నాను. వారి విద్యా సారాంశం నాకు బోధపడింది. అంతేకాదు; సుత్తి, గోపురంలాటి తరిణిపెట్టెసాధనం, ఇతర పనిముట్లు తీసుకుని, ఏ కార్ఖానాలోనైనా, ఎవరి పనైనా, క్రింద కూర్చుని చెయ్యగలిగేవాడను. తపాలా ద్వారా విద్యాభ్యాసం చేయటం నాకేమీ లోటు కలిగించలేదు. అందుకు సంతృప్తితో ఉప్పొంగిపోయాను. ఏదైనా కష్టమైన పని మొదలెట్టినప్పుడు, నేను కోరుకుంటే సాధించలేనిదేదీ లేదని అనిపించేది.

ఓవలీన్‌లో వున్నప్పుడు నాకు విచారంగావుండేది. కొంతప్పుడు నా ఆశయం సిద్ధించింది అనిపించేది. రైలుకట్టలో గమనశక్తితో పనిచేసే వ్యక్తిని ఉన్నతాధికారుల కూటంలోకి పంపేవారుకాదు. అప్పట్లో పరిజ్ఞానమున్న యంత్రశాస్త్రజ్ఞుడికంటె ఏవర్తకుడికో, న్యాయవాదికో, వ్యాపారస్థుడికో ఉన్నతాధికారి అయే అవకాశం ఎక్కువవుందని అనిపించేది. రైలుకట్ట ఇతర శాఖలలోని పనీ నేను నేర్చుకోగలనని తెలుసుకున్నాను.

కాని జీతం తక్కువవటంవల్ల మనశ్శాంతి లభించలేదు. ప్రతిరోజూ, తక్కువ బాధ్యతతో కూడుకున్న పనికే ఎక్కువ జీతం తెచ్చుకుంటున్న యితర వుద్యోగులతో పనిచేయవలసి వచ్చేది. ఆ విషయం ధూమ యంత్రాలు, బొగ్గు, బండీకి కావలసిన వివిధ పరికరాల విక్రయదారులతో మాట్లాటప్పుడు స్పష్టమయేది. 350 డాలర్లు పెద్ద మొత్తమే. కాని నాకు అప్పటికి ముగ్గురు పిల్లలున్నారు. వాళ్ళకి చదువు చెప్పించి పోషించాలి. బెర్నిస్ లాగే వాల్టర్ క్రిస్లర్ జూనియర్ ఓవలీన్‌లో పుట్టాడు. థెల్మా సాల్టులేక్ సిటీలో పుట్టింది.

మధ్యప్రాచ్యంలో స్టిక్నీ కుటుంబాలకి మంచి పేరుంది. ఎ. బి. స్టిక్నీ అఖండమైన వ్యక్తి. అతన్ని సంతోషపరచాలంటే అతని వాదనలు

ఖండించకూడదు. ధైర్య సాహసాలు ప్రదర్శించాలి. స్టిక్నీలని గురించి చాలా చిత్రకథలు చెప్పుకు నేవారు. అతను ఎవరిచేతా మోసగింపబడేవాడు కాదు. వెనుకటి రోజుల్లో సమాచారాలు వివరించే పట్టీలుండేవి కావు. అప్పుడు జాన్ బిల్లు తన గ్రేట్ నదరన్ మార్గాన్ని, ట్విన్ సిటీస్ నుంచి తీసుకు వచ్చి చికాగోలో కలపటానికి బర్లింగ్టన్ కొన్నాడు. బిల్, హిల్నీ కలసి వ్యాపారంలోకి దిగాలనుకున్నారు. ఒక రోజు బిల్లు, "చాలాసార్లు నన్ను సెంటుపాలునుంచి నీ మార్గంమీదుగా చికాగో ప్రయాణం చెయ్యమని అడిగావు. నీ కిష్టమైతే పై మంగళవారం ఉదయం వెళదాం" అన్నాడు స్టిక్నీతో.

ప్రత్యేకంగా ఏర్పాటుచేసిన రైలు పెట్టెలో వాళ్లు సెంట్ పాలు వెళ్ళారు. కుర్చీలో కూర్చున్నాక, బిల్ జేబులోంచి ఒక పుస్తకం తీసి తన రైలు కట్ట పద్ధతిని గురించి బిగ్గరగా చదవటం ప్రారంభించాడు.

"స్టిక్నీ ఐరన్ రేంజ్ శాఖలో పోయిన మాటు మేము..." స్టిక్నీ ఏదో మనసులోనే లెక్క వేసుకున్నట్లు గొణిగి. "ఏదీ చూడనీ—మూడు - నాలుగు- ఊ...తర్వాత— అయిదు - అయిదు డాలర్ల చొప్పున పది కోట్ల టన్నుల బండీలనీ పదికోట్ల టన్నుల మైళ్ళు."

"అదే మంత గొప్ప కాదు" స్టిక్నీ ముఖం చురుగ్గా, అందంగావుంది. జేబులోంచి పుస్తకం తీసి ముఖాని కెదురుగా పెట్టుకున్నాడు. "పోయిన మాసం ఓమహా చికాగో శాఖలో వెయ్యి టన్నులకు మైలుకి నాలుగు డాలర్ల చొప్పున పన్నెండు కోట్ల టన్నులు తీసుకెళ్లాము,"

"స్టిక్నీ నువ్వు అబద్ధమాడుతున్నావ్ ?"

"ఓస్ ! నువ్వూ అదే చేస్తున్నావ్"

అప్పుడు సూక్ష్మంగా అర్ధ స్ఫూర్తితో నిండిన వారి కళ్ళముందు మిసిప్పీ లోయ సౌందర్యం కనపడుతూంది. పుస్తకాలకని పెట్టేసి వాళ్ళిద్దరూ దాన్ని చూడటం మొదలెట్టారు.

ఆ తర్వాత కొన్నాళ్ళకి గ్రేట్ వెస్టరన్ రైల్వే ముఖ్య కార్యాలయం సెంటుపాల్ నుంచి చికాగోకి మార్చబడింది. దాంతో

ఉన్నతాధికారంలోవున్న కొందరి స్నేహితుల వుద్యోగాలు పోయాయి. స్ట్రైక్లు వెళిపోయిన తర్వాత ఒక కొత్త జట్టు దానిని స్వాధీనపరచుకున్నారు. చికాగోలో యజమానిని చూట్టానికి వెళ్ళినప్పుడు స్ట్రైక్ కనపడేవాడు కాదు. సామ్యూయెల్ మార్సు ఫెల్టన్ దానికి అధ్యక్షుడయాడు. అతనితో మొదటిసారి సంభాషించిన తర్వాత "ఇకనుంచీ ఇక్కడ జీవితం తెరిపిన పడుతుంది" అనుకున్నాను.

సామ్యూల్ ఫెల్టన్ రైలు మార్గానికి కొత్తవాడు కాదు. అతను ఇంతవరకూ చాలా చోట్ల అధ్యక్షుడిగా వున్నాడు. అంతేకాదు. ఇక ముందూ చాలా చోట్ల అధ్యక్షత వహించబోతాడు. వాటి జాబితాలని తెలపాలంటే ఎంతో స్థలం కావాలి. 1868 సం॥లో పదిహేనేళ్ళప్పుడు అతను ఈ వృత్తి ప్రారంభించాడు. మొదట కొయ్యలు పెట్టేవాడిగానూ, తర్వాత ఇంజనీరు, ముఖ్య ఇంజనీరు, హెడ్ సూపరిండెంటు అయాడు. ఎల్గిన్ కార్ఖానాల్లో నేను కసవు వూడ్చేటప్పుడు అతను ఈస్టు టెన్నిసియా, వర్జీనియా అండు జార్జియా రైల్వే అధ్యక్షుడిగా వున్నాడు. నేను అతన్ని చూడక ముందే లెక్కలేనన్ని రైలు కట్టలు అతని ఆధీనంలో వున్నాయి. నిజానికి అప్పటికింకా చిన్నవాడినే. కాని పని సక్రమంగా జరిగేందుకు అవసరమైతే రోజుకి 19 గంటలు పనిచేయ తీర్మానించుకున్నాను. ఉద్యోగంలో ఏ అంశాన్నీ అలక్ష్యం చేయలేదు. రైలు కట్టమీద దాదాపు ఎడతెరిపిలేకుండా తిరిగి కూలీలని తనిఖీచేస్తూ, ప్రశంసిస్తూ, చివాట్లు పెడుతూ, ధూమయంత్రాలలోనూ, బండీలలోనూ పనిలో నిమగ్నుడనయేవాడను. వారంలో నాలు గయిదు సార్లు రాత్రిళ్ళు మాత్రమే ఇంటికి వెళ్ళే నియమం చేసుకున్నాను. చాలా రోజులు అ లాగే గడిచిపోయాయి. నా మనసులో యంత్రశాస్త్ర రీతి యావత్తూ గాఢంగా నాటుకు పోయేందుకు అలా ప్రయత్నించాను.

వారం రోజుల ప్రయాణానంతరం, ఒక రోజు ఇంటికి వెళ్లాను. అప్పటికి 6 గంటలయింది. అలసిపోయి పడుకున్నాను. టెలిఫోను మోత విని అర్ధరాత్రి నిద్ర లేచాను. ఓవలీన్ రవాణాధికారి కంఠం,

"ఫెల్టన్ దగ్గరనుంచి తంతి. రేపు ఉదయం చికాగోకి నువ్వు వెళ్లాలిట" అని పలికింది.

బాగా మెలుకువ రావటానికి, కళ్ళు నులుపుకుని మెడ విరిచాను. బట్టలు తొడుక్కుని, తోలు సంచీని జాగ్రత్తగా తీసుకున్నాను. రైలు మార్గాలన్నిటికీ ఉపయోగపడే సాంవత్సరీక రైలు పాసులతో ఆ సంచీ గుండ్రంగా తయారైంది. అది తీసుకుని, నిద్రపోతున్న భార్యా పిల్లల్ని వదిలి వెళ్ళిపోయాను. చికాగో వచ్చిన తర్వాత రైలు అందుకున్నాను. అధ్యక్షుడి కార్యాలయం చేరేటప్పటికి 8-30 అయింది. కార్యదర్శి తిన్నగా నన్ను లోపలికి వెళ్ళమన్నాడు.

ఫెల్టన్ ముందు అడుగు ఎత్తు ఉత్తరాల కుప్ప పోసివుంది. అతని కళ్ళద్దాలు ముక్కు మీదికి జారి వున్నాయి.

"నమస్కారం ఫెల్టన్"

అతను నాకేసి తీక్షణంగా చూశాడు. కళ్లు కిందికి వాల్చి చదువు కుంటూ కూర్చున్నాడు. ఒక్క మాట మాట్లాడలేదు. అతని బల్లముందు కొన్ని నిమషాలు కదలకుండా నుంచున్నాను. ఆగ్రహం పొంగుకొచ్చేస్తోంది.

అది ఒక పెద్ద గది. బల్లమీద ఒక పక్కగా చికాగో దినపత్రికలు చక్కగా అమర్చి వున్నాయి. అందులో ఒక పత్రిక తీసుకుని. కిటికీ దగ్గిర కుర్చీవైపు నడిచాను. కిటికీలో కాళ్లు పెట్టి కుర్చీలో కూర్చుని, పేపరు తెరిచాను. చేతిలో పట్టుకున్న వార్తా పత్రికలో నేను ఏమీ చదవటంలేదు. కాని ఒక వరుస చదివానో లేదో ఫెల్టన్ "ఇక్కడేం చేస్తున్నావు క్రిస్లర్?" అని అరిచాడు.

లేచి నిలబడ్డాను. "నాకు తెలియదు ఫెల్టన్! ఉదయమే ఇక్కడికి రమ్మనిపోయిన రాత్రి మీరు నాకు తంతి యిచ్చారు." ఓక్షణంపాటు అతను నావైపు ఉరిమిచూశాడు.

"ఆ. అవునవును" సొరుగులో చాలా కాయితాలు వెతికాడు. దండించేందుకు సాక్ష్యంలాగా రైలు సమాచారాన్ని ఒక చేత్తో పట్టుకుని

లేచి నిలబడ్డాడు. "క్రిస్లర్ నెం. 2 ధూమయంత్రం సంగతి ఏమిటి ? మూడు నిమషాలు ఆలస్యమైంది."

"నాకు తెలియదు."

"నీకు తెలియదా ? గమనశక్తి సూపరిండెంటుకి తెలీదా ?"

"ఒకవారంగా కార్ఖానాలు తనిఖీచేసేందుకు శాఖకివెళ్ళాను. ఆ ఆలస్యం విషయమై నా ముఖ్య గుమాస్తా తప్పక పరిశోధన ప్రారంభించి వుంటాడు." ఉద్రేకాలని అణచిపెట్టి, మర్యాదగా మాట్లాడటం కష్ట మయింది. కాని చాలామటుకు అణచుకోగలిగాను. "కార్యాలయంలో కొస్త తీరుబడికాగానే ఆ విషయాన్ని గురించి పూర్తిగా తెలియచేస్తాను."

"ఇప్పటికే నీకావిషయం తెలిసివుండాలి. నేను అడగవలసిన అవసరంలేదు."

"ఇంతకుముందు చెప్పినట్లు ఒకవారంగా ప్రయాణం చేస్తూండటం వల్ల ఆ విషయం గురించి వివరాలు తెలియలేదు."

అప్పుడు ఫెల్టన్ నామీద పెద్దగా అరుస్తూ కేకలుపెట్టడం మొద లెట్టాడు. నాకేమీ పాలుపోలేదు. ఒళ్ళంతా ఆవేశంతో వణికిపోయింది. ఉన్నట్లుండి పక్క జేబులోకి చెయిపోనిచ్చాను. దాంతో ఫెల్టన్ కుర్చీమీద చేతులుపెట్టి మాట్లాడటం ఆపాడు. నా వుద్యోగానికీ, అధికారానికీ చిహ్నమైన రైలు పాసులున్న తోలుసంచీని బైటికి తీశాను. దాన్ని ఎగిరిపడేట్లుగా అతని బల్లమీదికి గట్టిగావిసిరి కొట్టాను—అంతే, దాని అర్థమేమిటో ఫెల్టన్‌కి స్పష్టమయింది.

ఫెల్టన్ ఆశ్చర్యంతో నాలిక వెళ్ళబెట్టుకుని నిలబడ్డాడు. అతని కార్యాలయంలోంచి బైటకురికి గట్టిగా తలుపువేసాను. అంతవరకూ అతనలా కొయ్యలా వుండిపోయాడు. ఆ విధంగా నేను రైలు కట్ట మాజీ వుద్యోగినయాను.

అది డిశంబరు నెల. ఫెల్టన్ కార్యాలయంనుంచి తిన్నగా బ్రెవుర్టు హోటలికి వెళ్ళాను. పాతబడిన పాలరాతి మెట్లమీంచి కిందికి దిగాను.

ఎఱుపు, గోధుమవర్ణం కలసిన ఆ హోటలు తలుపు చతుష్కోణంగా వుంటే దనుకుంటాను. ఆ హోటలుని తలుచుకున్నప్పుడల్లా రైలుకట్టలో పనిచేసే పాత స్నేహితుల ముఖాలే జ్ఞాపకమొస్తాయి. అంతలో బిల్ కానే అక్కడి వచ్చాడు. అతను నన్ను చూసి "వాల్ట్! ఇంత పెందరాళేయిక్కడేం చేస్తున్నావు అని అడిగాడు.

ఫెల్టనుతో వచ్చిన పోట్లాట విషయం చెప్పాను.

"వాల్ట్! ఫెల్టను నీ తండ్రివంటివాడు. నువ్వుకోపం తెచ్చుకుని వెళ్ళిపోవడం మంచిదికాదు" అన్నాడు.

"అతను నాకు అపాయం కలిగించేందుకు అవకాశం యివ్వతలుచుకో లేదు" అన్నాను నేను.

ఓల్వీనుకు టిక్కట్టు కొనుక్కుని రైలు ఎక్కాను. బిల్ కూడా నాతో ప్రయాణంచేశాడు. మంచి మాటలతో నన్ను సమాధానపరిచేందుకు ప్రయత్నించాడు. కాని నాకు ఫెల్టను దగ్గర తిరిగి వుద్యోగం చేయడం యిష్టంలేదు.

రైలు దిగి నేను యింటికి వెళ్ళేటప్పటికి నా భార్య థెల్మాని స్కూలుకు పంపే పనిలోవుంది. జరిగినదంతా చెప్పాను నేను.

"నాన్నా! మరి యింకేం పనిచేస్తావు?" అడిగింది థెల్మా.

"ఇంతకంటే మంచి వుద్యోగం సంపాదిస్తాను" అన్నాను నేను.

మా దుస్థితికి ఆమె భయపడేవుంటే అది పైకి కనబరచనీయలేదు. ఆమె నన్ను ఎప్పుడూ అర్థంచేసుకునేది. నా పట్ల తెలివిగా ఎలా ప్రవర్తించాలో ఆమెకి తెలుసు. గొంతువరకూ అప్పులున్నాయనే విషయం జ్ఞాపకంచేసి, అప్పుడే గనుక ఆమె నన్ను విమర్శించివుంటే పిచ్చెత్తిపోయేది. దానికి బదులు ఆమె కప్పులో కాఫీ పోసినంత వేగంగానే నా మనసు కుదుటపడింది.

వెళ్ళిపోతున్నానని పెద్ద గుమాస్తాతో చెప్పేందుకూ, నా వస్తువులు కొన్ని తెచ్చుకునేందుకూ, తిరిగి కార్యాలయానికి వెళ్ళాను. తర్వాత

ఇంటికి వెళ్ళిపోయి మోటారుకారుతో పని ప్రారంభించాను. ఒకటి రెండురోజులు ఇంట్లోనే గడిపాను. తర్వాత వుద్యోగానికి ధరఖాస్తు పెడుతూ అమెరికను లోకోమోటివ్ కంపెనీ అధ్యక్షుడు కొల్లో, హెచ్. మార్షల్ కి తంతి యిచ్చాను.

పోయినమాటు మార్షల్ తో వున్నప్పుడు, ధూమయంత్రాలని కొంటున్నాను. అతని దగ్గిర చాలా యంత్రాలు కొన్నాను. అప్పటికి మూడు సంవత్సరాలుగా అతను అమెరికను కంపెనీ అధ్యక్షుడిగా వుంటున్నాడు. మేమిద్దరం స్నేహంగా వుండేవాళ్ళం. అతనికి నేనంటే చాలా యిష్టం. చురుగ్గా. ధైర్యంగా వుంటానని ఎదురుగానే పొగిడేవాడు. అందుకనే వుద్యోగం కావలసివచ్చినప్పుడు అతని సాయం కోరాను. ధూమ యంత్రాలని నిర్మించే పనే నాకు తెలుసు. "నువ్వు తమాషా చేస్తుండాలి. సి. జి. బ్ల్యూని వదలివేయడం - అసంభవం" అని మార్షల్ తిరిగి తంతి యిచ్చాడు. ఆ తర్వాత తంతి వార్తలు. ఉత్తరాల ద్వారా అతనికి నమ్మకం కలిగించాను. అప్పుడు పీట్సుబర్గు వెళ్ళి, కంపెనీ ఉపాధ్యక్షుడు జేమ్సు మెక్నాటన్ తో మాట్లాడమన్నాడు. జేమ్సు విక్రయాధికారిగా వుంటున్నాడు. అతనికి యాభై సంవత్సరాలుంటాయి. అతను నాలాంటి వాడే. రైలుకట్టలో అన్నిరకాల వుద్యోగాలు చేశాడు. ముందు తర్ఫీదుతో ప్రారంభమై, యంత్రాధికారి, గమనశక్తి సూపరిండెంటు, బ్రూక్ వర్కు-అమెరికన్ లోకోమోటివ్ కంపెనీ బెనక్టడ్ వర్కుకీ ఛీఫ్ సూపరిండెంటు అయాడు. అతను నా పట్ల చాలా దయ కనబరచాడు. నా శక్తిసామర్థ్యాలు ఉపయోగపడేచోటుకే వస్తున్నానని ధైర్యం చెప్పాడు.

"క్రిస్లర్! నీకు అనుభవంవుంది. మాకు కావలసింది అదే. మొదట ఎల్లిగనీ సూపరిండెంటుగా తీసుకుంటాము" సూపరిండెంటు అనే వదం వినటానికి బాగానేవుంది. కాని రైలుకట్టలో నేను చేసిన యితర ఉద్యోగాలతో పోల్చిచూస్తే చాలా అంతస్థులు కిందకి దిగజారిపోయాను. ఆ ప్రకారం నేను సామాన్య ఫోర్ మన్ ను మటుకే. పనికి వెళ్ళేటప్పుడు పైబట్టలు గూడా వేసుకునేవాణ్ణి. ఎల్లాగైనా నెలకి 275 డాలర్లు చొప్పున మిగతావారికంటె ఎక్కువ జీతమే యిచ్చేవారు.

అప్పట్లో ఎల్లిగనీ యంత్రాగారానికి ఒక వృద్ధుడు కార్యనిర్వాహకుడిగా వుండేవాడు. చల్లారిన ఇంజను పొయ్యికి మల్లే వుండేది అతని ముఖం. సన్నగా, పొడుగ్గా, గంభీరంగా వుండేవాడు. నిడుపాటి గుబురు గడ్డం వల్ల అతని ముఖం విషాదభావంతో కూడుకున్నట్లు వుండేది.

ఆ వృద్ధుడు విచారగ్రస్తుడవటానికి ఒక కారణముంది. ఖర్చులు తగ్గించటానికిగాను కంపెనీవాళ్ళు పట్టీ ప్రకారం వుద్యోగాలని నిర్ణయించారు. అందుకని అన్ని శాఖలలోని వుద్యోగాలకీ ఒకే రకమైన ఆదాయం వస్తుంది. కొన్ని నెలలుగా అతను ఈ కొత్త పద్ధతివల్లే బాధపడుతున్నాడు. ఎల్లీగనీ యంత్రాగారంలో అనేక సంవత్సరాలుగా పనిచేస్తున్న కొందరు వృద్ధులకి ఈపద్ధతి చాలా చిరాకు పుట్టించింది. ఈ కుట్రకంతా కారకుడు అమెరికన్ లోకోమోటివ్ కంపెనీ ఉపాధ్యక్ష్యుడు మార్షల్. పూర్వం అతను చికాగోలో గమనశక్తి సూపరింటెంటుగా వున్నప్పుడు, అతనితో నాకు పరిచయమేర్పడింది.

నెలకి నలభై డాలర్లు యిచ్చేటట్లు ఒక ఇల్లు అద్దెకు తీసుకున్నాను. అది ఓవలీన్‌లో మేమున్న యిల్లంతా ఉంది. బాగుందికూడా. క్రిస్టమస్‌కి ఇంకా కొద్ది రోజులున్నాయనగా భార్యా పిల్లల్నీ కలుసుకునేందుకు స్టేషనుకి వెళ్ళాను. వారి రాకతో నాకు మళ్ళీ ప్రాణములేచి వచ్చినట్లయింది. శీతాకాలం మంచులో పీట్సుబర్గులో చాలా ఒంటరితనం అనుభవించాను. ఏమీ మార్పు జరగనట్లే క్రిస్టమస్ పండుగ చేసుకోవటానికి నిశ్చయించుకున్నాము. సామాన్లు తెప్పించే ఏర్పాటుచేసి, పండుగ రోజున ఇంట్లో చక్కగా అమర్చాను. టెలిఫోనుకూడా పెట్టుకున్నాము. సామాన్లు తెప్పించటానికీ, ప్రయాణాలకీ, వెచస్ బ్యాంకిలో అప్పు తీర్చటానికీ డబ్బంతా ఖర్చయిపోవటం వల్ల చేతిలో ఎక్కువ రొఖ్ఖము మిగలలేదు. అయినా మేము చిన్న క్రిస్టమస్ వేడుక చేసుకున్నాము.

పండుగపూట, పిల్లలు బహుమతులు చూసుకుని సంతోషంతో గంతులు వేస్తుండగా టెలిఫోను మోగింది. ఒక తోపుడు బండీ, కొన్ని ఆటవస్తువులు, దాటుకుని వెళ్ళి టెలిఫోను తీశాను.

అది కార్యనిర్వాహకుడి కంఠం. పండుగ శుభాకాంక్షలు చెప్పటానికి నన్ను పిలవలేదతను. "నిన్ననే నీ స్నేహితుణ్ణి న్యూయార్కు. ఉపాధ్యక్ష్యుడి వుద్యోగంనుంచి తీసేవారు. న్యూయార్కు వెళ్ళి నీ సంగతేమయిందో చూచుకో."

మర్నాటి ఉదయం అతని దగ్గిర పనిచేయటానికి వెళ్ళబోతున్నాను. పరాయి వూరిలో కొత్తగా వుద్యోగం చెయ్యటానికి వచ్చాను. ఆ వార్త విని బాకా వూదుతున్న పాపని నిశ్శబ్దంగా వుండమని చేతితో సంజ్ఞ చేశాను. మెక్నాటన్‌కి వుద్యోగం పోయిందని అతను ఇంకా చెబుతూనే వున్నాడు. ఆ వార్త నన్ను ఏమాత్రం బాధపెట్టలేదు. కంపెనీ అధ్యక్షుడు మార్షల్ నా స్నేహితుడనే విషయం అతనికి చెప్పదలచుకోలేదు. కాని కార్యనిర్వాహకుడు నన్ను పనిలోకి రావద్దని చెప్పినప్పుడు మటుకు, అహంకారం దెబ్బతింది. అతను మళ్ళీ యిలా అన్నాడు.

"నువ్వు చెయ్యవలసిన పనల్లా రైలెక్కి న్యూయార్కు వెళ్ళు. నీ సంగతేమయిందో కనుక్కో."

"నా కంఠకంటె నుంచి ఆలోచనొకటి తట్టింది. నా సంగతేమయిందో కావాలంటే మీరే రైలెక్కి న్యూయార్కు వెళ్ళి స్వయంగా తెలుసుకోండి" టెలిఫోను పెట్టేసి ఆ వార్త అతనికి బాధకలిగించి వుంటుందని ఆశించాను. బొమ్మ బాకా తీసుకుని కాస్సేపు విలియత్ డెల్ పాట వాయించాను.

నేను ఎప్పుడూ నిరాశపడలేదు. చాలా ఆత్మవిశ్వాసంతో మెలగడమే నా స్వభావం. మర్నాడు ప్రొద్దుట పైబట్టలు తొడుక్కుని పనిలోకి వెళ్ళాను. మూడునెలల తర్వాత కార్యనిర్వాహకుడు నా ప్రాణ స్నేహితుడయాడు.

ముఖ్యమైనదేమంటే నాలో మార్పు కలిగింది. కుర్రతనంలో వస్తువులు చేస్తున్నప్పుడున్న సరదా, పెద్దవాడినై యంత్రాలు చేయటం మొదలెట్టిన తర్వాత వందరెట్లు అధికమయింది. యంత్రాలు నిర్మించటం

లోనూ ఒక సృజనాత్మకమైన ఆనందంవుంది. అది కవులొక్కరికే తెలుసు. ఎప్పుడైనా ధూమయంత్రం చిత్రం వేసి నిర్మించటమంటే ఎలావుంటుందో ఒక కవికి చూపెట్టాలని వుండేది.

పీట్స్బర్గులో వున్నప్పుడు చాలా మార్పులు జరిగాయి. అతి వేగంగా వచ్చిన ఆ సంఘటన ప్రభావంతో మా జీవితాలు మార్పు చెందాయి. మొదటిసారిగా ఇంట్లో ఒక పనిపిల్లని పెట్టుకున్నాము. ఆ అమ్మాయి తల్లి విదేశస్థురాలు. పనిలో శిక్షణ పొందలేదు. ఆ పిల్లని పెట్టుకునేంతవరకూ ఇంటిచాకిరీ అంతా నా భార్యే చూచుకునేది. ఆమె వంటచేసిన తర్వాత వంటయిల్లు శుభ్రం చేయటానికి, ముందువసారా వూడవటానికీ, బట్టలుతకటానికీ ఒక పనిదాని సాయం అవసరమయింది. అప్పుడు మాకు డబ్బూ వుండేది. ఆ తర్వాత మేము మిచిగన్ వెళ్ళిన తర్వాత రెండేళ్ళు ఆ పిల్ల మాతో నేవుంది. పీట్స్బర్గుకి వివాహం చేసుకోవ టానికి వెళ్ళినప్పుడే ఆమె మా దగ్గిరనుంచి వెళ్ళిపోయింది.

చికాగోలో వెచన్ బ్యాంకి అప్పుతీర్చేసిన తర్వాత ఒక కొత్త స్టీవన్సుడర్యా కారు కొన్నాను. పీట్స్బర్గు కొండలమీద తిరగటానికి ఏదైనా కొత్త వాహనం కావాలనిపించింది. రైలుకట్టలో పనిమానేసి యంత్ర నిర్మాణం ప్రారంభించిన ఒకటిన్నర సంవత్సరం లోపున అమెరికను కంపెనీ కార్యనిర్వాహకుడనయాను.

మొదట్నుంచీ నన్ను సహాయ కార్యనిర్వాహకుడనే పిలిచేవారు. కాని కంపెనీ పని బాగా నేర్చుకునేంతవరకూ తరుచు ఉద్యోగాధికారాన్ని చెలాయించలేదు. కంపెనీ కట్టడాలు కొన్ని ఎకరాల స్థలంలోవుండేవి. చాలా రోజులపాటు అందులో వివిధ రకాల పనులని నేర్చుకోవటంలో నిమగ్నుడనయాను. కంపెనీకి ఒక ప్రక్కగా ఓహియోనది వుండేది. దాని ప్రక్కనే ఇనుము కరిగించి పోసే కొలిమి వుండేది. ఇంకో పెద్ద కట్టడంలో బండ్ల దుకాణ ముండేది. మరొక దాంట్లో ఇత్తడి కరిగించి పోసే కొలిమి వుండేది. ఆ తర్వాత యంత్రాలని నిర్మించే కార్ఖానా వుండేది.

అంతకు ముందెన్నడూ లేనిది, ఆ తర్వాత మూడు సంవత్సరాలు ఎల్లిగనీ డబ్బుచేసుకోవటం మొదలెట్టింది. వ్యాపారస్థులకి నచ్చేటట్లుగా ప్రతి ధూమయంత్రాన్ని ప్రత్యేకతతో నిర్మించే వాళ్ళం. కార్ఖానాలో చాలా కొత్త యంత్రాలని నిర్మించాం. ప్రతి యంత్ర నిర్మాణమూ పూర్తి కాకముందే అమ్ముడు పోయేది. డ్యూక్వెస్నె క్లబ్బునుంచీ, ఆ నోటా ఈ నోటా మా దగ్గిర యంత్రాల గురించి విన్నవారి దగ్గిరనుంచీ, కొన్ని కోట్ల డాలర్ల ఖరీదుగల కొత్త యంత్రాల కోసం ఆర్డర్లు వొచ్చేవి.

డేవిడ్ ఫ్రాన్సిస్ క్రాఫర్డు యిలా ఫోను చేసేవాడు. "క్రిస్లర్! క్లబ్బుకి రా! కలిసి భోజనం చేదాం. ధూమ యంత్రాలని గురించి మాట్లాడాలి." పిట్సుబర్గుకి పశ్చిమాన వున్న పెన్సిల్వేనియా రైలురోడ్డు లైన్సు గమనశక్తి సూపరిండెంటు అతను. ఉభయులమూ భోంచేస్తున్నంతసేపూ ఆల్టూనా కార్ఖానాలో తర్ఫీదుతో పని ప్రారంభించి ఒక కొత్త రకం ధూమ యంత్రాల సరణి వివరాలని గురించి ఆలోచిస్తూ సాంకేతిక సంభాషణలో మునిగిపోయాం. అప్పట్లో చాలా రకాల ధూమ యంత్రాలని నిర్మిస్తుండే వాళ్ళం. అందులో కొన్ని న్యూయార్కు సెంట్రల్ లైన్సు వారికోసం నిర్మించాం. కొన్ని స్థానిక రైలు పట్టాలకి ఉపయోగపడేవి. మా కంపెనీ ఉత్తమ వ్యాపారస్థులలో పీట్సుబర్గు & లేర్‌పర్ రైల్వే గమనశక్తి సూపరిండెంటు లోరన్ హెచ్. టర్నన్ ఒకడు. ఒక రోజు భోజనం దగ్గిర మాట్లాడుకుంటుంటే టర్నర్ ఇరవై అయిదు క్రొత్త యంత్రాలు కావాలని అడిగాడు.

"గంటకు అరవై మైళ్ళ చొప్పున వన్ పర్సెంటు గ్రేడ్ పుల్‌మాన్ బండీలు పన్నెండు లాగటానికి ధూమయంత్రాలు కావాలి. అలాటివి ఇరవై అయిదు కొనదలుచుకున్నాను. కార్ఖానాకి వెళ్ళి ఖరీదు కట్టు."

"విడి భాగాలు మామూలువా? నూనె పోసేవా?"

"అవును. అవే. కాని యంత్రాలు గంటకి 60 మైళ్ళు ఈడ్చగలిగేవిగా వుండాలి. జ్ఞాపకం వుంచుకో."

బరువు తప్ప ఆ వివరాలతోనే యంత్రం తయారు చేశాము. మొత్తం 1,250.000 డాలర్లు వచ్చాయి. త్వరలోనే టర్నన్ దగ్గరనుంచి మరో పెద్ద ఆర్డరు వచ్చింది. అప్పుడు ఉభయులం నా ముంజేయంత చాప ముక్కని తింటున్నాము.

"క్రిస్లర్ ! నువ్వు వెళ్ళిపోతున్నావని విన్నాను."

"ప్లింటాకి వెడుతున్నాను. మా యింట్లో యింకో పాప పుట్ట బోతోంది. అంతవరకూ వెళ్ళను."

"అయితే నాకు కొన్ని యంత్రాలని చేసి యిచ్చేందుకు వీలుంటుం దనుకుంటాను. ఆ యంత్రాలని తయారు చేసేంతవరకూ నువ్వు కార్ఖానాలో వుంటావని ఒప్పుకుంటే ఆర్డరు తీసుకుంటాను. అర్థమయిందా?"

"ఓ ! అలాగే."

"అయితే నాకు ఇరవై అయిదు స్విచ్ ఇంజన్లు కావాలి"

"మేము పండుగరోజుల్లో పనిచేయవలసివచ్చినా సరే అవి తయారు చేసి పెడతాను."

న్యూయార్కులో తనని కల్సుకోమంటూ జేమ్స్ జె. స్టోరో అనే అపరిచిత వ్యక్తినుంచి ఒక తంతి వచ్చింది. వెంటనే ప్లెంటాకి బయలు దేరాను.

డ్యూల్వెన్సీ క్లబ్బులో ఒక బ్యాంకి వుద్యోగిని నేను ఎరుగుదును. స్టోరో ఎవరని అతన్ని అడిగాను.

"ఏమంత గొప్పవాడు కాదు లే. హిగిన్సెన్ & కంపెనీ అధికారి మటుకే. నువ్వు పనిచేస్తున్న కంపెనీకి అతను పై అధికారి గూడా."

"సరే. అతను నన్ను చూడాలనుంటే నేను వెళ్లాలనుకుంటాను."

"వెళ్ళటం మంచిది" అన్నాడతను.

"తంతిలో నాతో ఒక ముఖ్యవిషయం చర్చించాలని అన్నాడు"

"క్రిస్లర్ ! స్టోరే నీతో మాట్లాడదలచుకుంది ఏదైనా ముఖ్యమైందే అయ్యుంటుంది. అతను అమెరికను లోకో మోటివ్ కి పై అధికారనే విషయం నీకు ఎలా తెలీకుండా పోయింది?"

"మార్షల్, మెక్నాటక్లను గురించి నేను ఆలోచించవలసివుంది. వాళ్ళు నా స్నేహితులు."

1911 వ సం॥లో న్యూయార్కులో లీహిగన్ & కంపెనీ చిరునామా నెం 43 ఎక్స్ఛేంజి ప్లేస్. అంతకు ముందెప్పుడూ నేను న్యూయార్కుకి వెళ్ళలేదు. అందుకని చిరునామా కనుక్కోవటానికి కష్ట పడ్డాను. స్టోరో కార్యాలయంలోకి వెళ్ళినప్పుడు, విపరీతమైన ఎత్తుగల న్యూయార్కు భవనాల సుందర దృశ్యాలు నా మనో నేత్రం ముందు మెరుగులుతున్నాయి. స్టోరే లేచి నిలబడి, "మా ఎల్లిగనీ యంత్రాగారాన్ని పడిపోకుండా నిలబెట్టింది నువ్వే నన్నమాట" అంటూ పలకరించాడు. నిజానికి అల్లాటి మార్పు తెచ్చింది నేను కాదు. పీట్సుబర్గులో నేను చేసిందల్లా సరియైన వుద్యోగస్థుల్ని ఏరుకోవటం మటుకే. నేను రాకముందు ఉద్యోగంలోంచి తీసేయబడిన అనేక మంది మంచి కార్మికులని మళ్ళీ పనిలో పెట్టుకున్నాను. కాని స్టోరో అమెరికను కంపెనీ వ్యవహారాలు చర్చించటానికి నన్ను అక్కడికి ఆహ్వానించలేదు. మోటారుకార్ల నిర్మాణం గురించి నా వుద్దేశమేమిటో తెలుసుకోగోరాడు.

"అవునండీ. అయిదేళ్ళనుంచీ నేనా విషయం ఆలోచిస్తూనే వున్నాను."

"అలాగయితే సరే. కావాలంటే మిచిగాన్ లో ఫ్లింట్ బ్రీక్ మోటారుకంపెనీలో నీకు వుద్యోగ మిచ్చే ఏర్పాటు చేయ్యగలను. జనరల్ మోటార్లుచేసే కంపెనీల కూటంలో కల్లా అది చాలా ముఖ్యమైంది. ప్రస్తుతం నేను దాని ఆర్థిక సభాధ్యక్షుణ్ణి. పోయిన శీతాకాలం జనరల్ మోటార్సుకి నేను కొద్దినెలలు అధ్యక్షుణ్ణిగా వున్నాను. ఒక కంపెనీలో నీకు నిర్వాహకపడి వుద్యోగం ఇవ్వాలనివుంది."

"మీరు చెప్పింది నాకు నచ్చింది."

"బిల్ అధ్యక్షుడు ఒక మేధావి. ఈ వూరివాడే. బండీల నిర్మాతగా గొప్పకీర్తి సంపాయించు కున్నాడు. ప్రస్తుతం కంపెనీనడిపేందుకు అతనే సరియైన వాడని మేమంతా అంగీకరించాం. ఎంతైనా మోటారుకార్ల వృత్తితో ఆతనికింకా పరిచయంలేదు. కార్ఖానాలు నడిపేందుకు యంత్ర శాస్త్రంలో బాగా అనుభవమున్న వ్యక్తి సాయం కావాలని అతను ఒప్పుకుంటున్నాడు.

తలవూపి, ఎక్కువ సంతోషంలో వున్నట్లు కనబడకుండా వుండేందుకు ప్రయత్నించాను.

"మోటారు కార్ల వృత్తిలో నీకు గొప్ప భవిష్యత్తు వుంటుంది. బ్యాంకి వుద్యోగస్తుడిగా నా అభిప్రాయం అది."

"నాకూ అలాగే అనిపిస్తోంది. నేను రవాణా వుద్యోగిగా వుంటున్నాను. ఇది వ్యక్తిగతంగానడిచే రవాణా - ఆనందంలో యేమీ మాట్లాడేస్తానో నని భయమేసి అక్కడ ఆపేశాను.

"పిట్సుబర్గులో నాష్‌ని కల్సుకుంటావా?"

"ఆ, కల్సుకుంటాను."

"సరే ఏర్పాటు చేస్తాను. బహుశః బ్యూక్ కర్మాగారానికి చూడడానికి నిన్ను ఆహ్వానిస్తాడు. జ్ఞాపకముంచుకో అతను చాలా తల బిరుసు మనిషి—

"అలాగే"

"ఒక్క సలహా! సామర్థ్యమున్న వాడికి ఇది గొప్ప అవకాశం."

న్యూయార్కునుంచి పిట్సుబర్గు వచ్చిన ఒక వారం తర్వాత నాష్ దగ్గిరనుంచి తంతి వచ్చింది. పిట్సుబర్గుకి తను త్వరలోనే రాబోతున్న తేదీ తెలుపుతూ, నేను తనతో కలసి భోజనం చేస్తానేమో తెలియపరచమన్నాడు. నా అంగీకారాన్ని తెలుపుతూ తిరిగి తంతి యిచ్చాను. ఆ తర్వాత కొద్దిరోజులకే మొదటిసారిగా అతను నా కార్యాలయం లోకి

వచ్చాడు. కరచాలనం చేసుకున్న తర్వాత ఫోర్టు నిట్ హోటలుకి భోజనానికి వెళ్ళాము.

అప్పటికే చార్లీ నన్ను గురించి ఒక అభిప్రాయ మేర్పరుచు కున్నాడనుకుంటాను. అతను ఎక్కువగా మాట్లాడలేదు. మా ఉభయులకీ విభిన్న వ్యక్తిత్వా లున్నట్లు కనిపించింది. కానీ మర్యాదగానే మెలిగాం. భోజనం పూర్తయేవరకూ ప్రశాంతంగానే వున్నాము.

"చుట్ట కావాలా?"

"ఆ, చుట్టలు తాగుతాను" అని చెబుతుండగా నన్ను మెచ్చుకుంటున్నట్లు చిన్నగా నవ్వాడు.

"అరె! తమాషాగా వుందే! నేను అదే తాగుతాను" ఆ సన్నని గోధుమ రంగు చుట్టలని కాల్చేలోపు. మా యిద్దరికీ బాగా పరిచయమేర్పడింది. నన్ను బ్యూక్ కంపెనీకి రమ్మ నడిగాడు.

మెక్లొటన్ నన్ను వెళ్ళకుండా చేసేందుకు ఎంతో ప్రయత్నం చేశాడు. అప్పటికి సంవత్సరానికి 8000 డాలర్లు సంపాయించే వాణ్ణి. అతను నా జీతాన్ని 12,000 చేస్తానన్నాడు. అంటే నెలకు వెయ్యి డాలర్లన్నమాట! చికాగో రైల్వే కంపెనీలో పని మానేసినప్పుడు సంపాయించినంతా వుంది ఆ జీతం, జీతం హెచ్చు అవుతుందనే భావం కలుగుతూనే నేను నా భార్యా సంతోషంలో మునిగిపోయాము. అయినా బ్యూక్ కంపెనీలో నాష్‌ని కలుసుకుందుకు తొందర పడ్డాను.

కరచాలనం చేసిన తర్వాత అయిదు నిమిషాలు గూడా చార్లీ దగ్గిర లేను. "అన్ని చోట్లకీ వెళ్ళే రైలు పాసు యిస్తాను. రేపు మధ్యాహ్నం వరకూ ఈ ప్రదేశమంతా చూడు. భోజనం చేసిన వెంటనే వచ్చెయ్. కూర్చుని మాట్లాడుకుందాం."

అతనికి చిరునామా యిచ్చి హోటలుకి వెళ్ళాను. నా కోసం ఏర్పాటు చేసిన గదిలో సంచీ పెట్టేసి, మోటారుకారు యంత్రాగారాన్ని పూర్తిగా చూసేటందుకు వెళ్ళాను.

బ్యూక్ కంపెనీలో చూసినవన్నీ నన్ను ఆశ్చర్య చకితుణ్ణి చేశాయి. యంత్రశాస్త్రజ్ఞుణ్ణి కావటంవల్ల కొయ్యతో పనిచేసే కార్మికులని చూశాను. అక్కడ ముఖ్య భాగాలన్నీ కొయ్యతో తయారవుతున్నాయి. ఒక పెద్ద వడ్రంగి దుకాణములో నిడుపాటి వెడల్పయిన బూరుగు చెట్టు పలక లున్నాయి. లోహాలను కరిగించే దట్టీలకు మల్లే కొయ్యలని వొంచాలి. అందులో చాలామంది బండీలను నిర్మించేవారు గనుక కొయ్య పనితనం బాగా సాగుతోంది. కాని లోహాల విషయంలో మటుకు చాలా అభివృద్ధికి అవకాశ ముందనిపించింది. అలాటివి ఒక వంద అవకాశాలు కనుపించ గానే ఆతురతతో నాలో నేను "నేనే గనక అధికారినైతే ఎంత అభివృద్ధి చేయవచ్చు" అనుకున్నాను.

నాష్ కార్యాలయంలోకి వెళ్ళిన తక్షణమే అతను నా వంక సూటిగా చూశాడు. "నీ వుద్దేశం ఏమిటి?"

"నాష్! నాకు ఇక్కడికి రావాలనుంది. ఈ కంపెనీకి నేను ఉప యోగపడతాననుకుంటాను. ఈ వ్యాపారంలోకి దిగాలని ఉబలాటంగా వుంది."

"చాలా తొందరగా నిర్ణయించావనుకుంటాను."

"నిర్ణయించుకోవటానికి కావలసినంత చూశాను."

"ఉదాహరణకు ఏమేం చూశావ్?"

"రైలు బండీ తలుపులకీ, బల్లలకీ పూసినట్లే కారు అడుగు భాగాలకి రంగు పూస్తున్నారు కార్మికులు. కారు నడుపుతాను గనుక నాకు ఒక విషయం తెలుసు. కొత్త కారుని ఇంటికి తీసుకువెళ్లేలోపున దాని అడుగు భాగమంతా బురదయిపోతుంది. ఆ తర్వాత దాన్ని ఎవరూ చూడరు."

చివరకి, "నీ కెంత జీతం కావాలి క్రిస్లర్" అనడిగాడు.

"ప్రస్తుతం నా జీతం ఎక్కువ చేశారు. నేను వేరే వుద్యోగం చూసుకోబోతున్నానని చెప్పినప్పుడు మెక్నాటన్ సంవత్సరానికి 8000 డాలర్ల నుంచీ 12,000 డాలర్లకి నా జీతం హెచ్చించాడు.

తక్షణమే నాష్ తన మనసుని మరి దేనిమీదో లగ్నం చేస్తున్నట్లు స్పష్టమయింది. ఆతనికి నా విషయంలో శ్రద్ధ పోయింది. గాలిపోయిన బండి చక్రంలాగా సొమ్మసిలేట్లు కనపడ్డాడు.

తలని అడ్డంగా తిప్పుతూ, "ఈ వ్యాపారంలో అలాటి జీతాలివ్వం" అన్నాడు. అతను నాతో బేరం చెయ్యటం లేదు. ఆనాటి వ్యవహారాన్ని పూర్తి చేస్తున్నాడంతే. అందుకు ఒక కారణముంది. నిజానికి 1911 వ సం||లో ఫ్లింటులో 12,000 డాలర్లు చాలా పెద్ద మొత్తమే. అదీగాక నేను పరాయివాణ్ణి కావటంవల్ల అతనికి పరిచయం లేను. కాని ఆ అవకాశం నేను జారవిడుచుకో దలచుకోలేదు.

"నాష్ ! మీరెంత యిస్తారు ?"

పెదిమలు బిగపెట్టి ఓ క్షణం ఆలోచించాడు. తల గోక్కున్నాడు. నా జీవితపు తునకలతో అంచనాలు వేస్తున్నాడు. నేనంటే యిష్టపడే వారి దగ్గర 12,000 డాలర్లు సంపాయిస్తున్నప్పుడు ఆవుద్యోగం వదలాలనే ఆశపుట్టటానికి అంతకంటె పెద్ద మొత్తం సంపాయించ గలగాలి. ఉన్నట్లుండి అతను సర్దుకు కూర్చుని యిలా అన్నాడు.

"క్రిస్లర్ ! 6000 డాలర్ల కంటె ఎక్కువ ఇవ్వలేము."

"అలాగే నాష్." అతను ఆశ్చర్యపడినట్లు కనుపించాడు. మూడు నెలల్లో మా యిద్దరికీ చక్కటి మైత్రి ఏర్పడింది. నిజానికి మేమిద్దరం జీవితాంతం స్నేహితులుగానే వున్నాము. చార్లీ చాలా మంచివాడు.

---

# నూతన జీవితంలోని పోరాటాలు

"నేను కోరేది సంపూర్ణాధికారం"

పిట్సుబర్గులో నా ఆఖరి కొడుకు జాన్ క్రిస్లర్ పుట్టాడు. మెలిగన్ వెళ్ళాలని చాలా ఆతురత పడుతున్నా నా భార్యకీ, కొడుక్కీ స్వస్థత చేకూరేంతవరకూ అక్కడే వున్నాను.

భవిష్యత్తు ఉత్సాహపూరితంగా కనబడనప్పుడల్లా నేను దిగులు పడే వాణ్ణి. అంతవరకూ నా జీవితమంతా ధూమయంత్రాలకే అర్పించాను. ఆ యంత్రాలు చాలా గొప్పవి. అవంటే నాకు చాలా యిష్టం. బ్యూక్ కంపెనీలో చేరాలనే తీర్మానంవల్ల ధూమయంత్రాలతో సంబంధము, రైలు కట్ట కార్మికుల సాహచర్యం, శాశ్వతంగా పోతాయనే విషయం గ్రహింపుకు వచ్చినప్పుడల్లా పశ్చాత్తాప పడేవాణ్ణి. అంతేకాకుండా నేను ఇంతవరకు సంపాయించిన వుద్యోగాలన్నింటిలోకి పిట్సుబర్గులోది చాలా ఉత్తమమైంది. అక్కడ నా భార్యా పిల్లలూ కులాసాగా వున్నారు. వాళ్ళని అలాటి స్థలంనుంచి తీసుకువెళిపోవటం గురించే నేను ఆలోచించవలసి వుంది. అమెరికా దేశం ఏర్పడకముందు సముద్రందాటి ఉత్తర కెనడా, పశ్చిమ కాన్సాస్ బయళ్ళకి తరలివచ్చే అవకాశాలని మా పూర్వీకులెప్పుడూ వదులుకునేవారు కారు. అలాగే ఈ కొత్త అవకాశం నన్ను ఉత్సాహపరచింది. ఫ్లింటుకి బయలుదేరేటప్పుడు నాలోనూ అటువంటి గగుర్పాటే కలిగింది.

నిజానికి మోటారుకారు నిర్మాణంలో నేను మంచి తరుణంలోనే ప్రవేశించాను. డోటన్‌లో చార్లెస్ ఎఫ్. కెటరింగు అనే వ్యక్తి ప్రప్రథమంగా కాడలిక్‌లో కారుని స్వయంగా బయలుదేర తీసే యంత్రం పెట్టాడు. దాన్ని ఓడమీద డెట్రాయిట్‌లో హెన్రీ లెనాడెకి పంపాడు. విద్యుచ్ఛక్తి దీపాలు గురించి పరిశ్రమలోని వారంతా ఒకటే కలలు కని వుంటారు. ఈ రెండు సదుపాయాలు వుంటే స్త్రీలు పురుషులంత సుళువుగా కార్లు నడపవచ్చు. మోటారుకార్ల భవితవ్యాన్ని గురించి మేము ఘనంగా ఊహించినదంతా వాస్తవమవటం ప్రారంభమయింది.

కాని చాలా మోటారుకార్లు నిర్మించటానికి అధిక వ్యయమయేది. దాని కారణం త్వరలోనే తెలుసుకోవటం మొదలెట్టాను. దేశంలో ప్రజల ఆర్థిక పరిస్థితి బాగున్నప్పుడే మోటారు పరిశ్రమ పెంపొంద సాగింది. కొందరు డబ్బుని నిర్లక్ష్యంగా ఖర్చుచేసేవారు. కొందరు డబ్బుని మితంగా వాడుకోవటం తెలియక వృధాచేసేవారు. కార్మికులందరికీ వేగంగా పని చేయవలసిన వత్తిడి వుండేది. ఏ కంపెనీయైనా కొత్తరకం యంత్రాగారాన్ని కోరితే అధికారి దానిని తప్పక వేగంగా నిర్మించమని అడుగుతాడు.

బ్యూక్ కంపెనీలో కార్యనిర్వాహకుడిగా చేరిన తక్షణమే వివిధ శాఖలలో నిర్వహించే పనుల జాబితాని అడిగాను. గుమాస్తా నావంక భావశూన్యంగా చూశాడు. "జాబితానా! ఇక్కడ పనిచేసేవారి కలాటివి లేవే?" నేను కొంత కలవరపడ్డాను. కాని కార్యాలయంలో అటువంటి జాబితా ఏదీ కనుపించలేదు. ఆ కార్యాలయ భవనంనుంచి గురుతులువేసే యంత్రాగారానికి వెళ్ళాను.

గురుతులువేసే శాఖ కార్మికులతో యంత్రాలతో నిండివుంది. అప్పుడు బ్యూక్ కంపెనీలో 3 లేక 4 వేలమంది పనిచేస్తున్నారు. అక్కడ నా సహాయకుడిగా వున్న వుద్యోగితో నాకు బాగా పరిచయముంది. అతను మర్యాదస్థుడు. "నీ కార్యాలయంలోకి వస్తావా? నీ జాబితాని చూడాలి" అన్నా నతనితో.

"ఓ! అదా! నా జేబులోనేవుంది" అంటూ ఒక చిన్న కాయితాన్ని తీసి చదవటానికి మడిచాడు. అందులో నేను తెలుసుకోగోరినవి లేవు. ఎల్లిగనీ కంపెనీలో ఒక యంత్రం నిర్మించటానికి 40,000 డాలర్లో ఎంతో ఖర్చుచేసేవాళ్ళం. తక్కువ వ్యయానికి వాటిని నిర్మించినా లాభం చేసుకునే వాళ్ళం. ఒక చిన్న రంధ్రం చేయటానికి కొద్దిగా కరిగించటానికీ ఎంత వ్యయమవుతుందో తెలుసుకునేవాళ్ళం. అదేమంత సులభమైంది కాదు. లెక్కలని సక్రమమైన పద్ధతిలో వేసేందుకు ఒక సంఘుమైన నిబంధనని ఉపయోగించేవాళ్ళం. నమూనాలు చేసేవారి పని ఎప్పుడు పూర్తవుతుందో,

ఒక సిలండర్‌ని కరిగించటానికి ఎన్నాళ్ళు పడుతుందో, అచ్చుపోసేవాళ్ళు. యంత్రశాస్త్రజ్ఞులు, యితర కార్మికులు విడివిడిగా తయారుచేసినవి యివ్వటానికి ఎప్పుడు వీలవుతుందో ఖచ్చితంగా తెలుసుకు నుండేవాళ్ళం. ఆ విధంగా అన్ని పనుల వివరాలనీ కష్టపడి తెలుసుకు నుండటంవల్ల ఫలానా రోజున యంత్రం పూర్తిచేస్తామని మాటయిచ్చి, ఆ మాట నిలబెట్టుకో గలిగేవాళ్ళం. అంతే కాకుండా తక్కువ వ్యయానికే నిర్మాణం పూర్తి చేసి కంపెనీకి లాభం చేకూర్చగలిగేవాళ్ళం. పిట్సుబర్గులో పనిచేయక ముందుగూడా ఖర్చులని జాగ్రత్తగా కనిపెట్టవలసిన నిర్బంధం వుండేది. రైల్వే కర్మాగారంలో వస్తువుల ధర, యంత్రనిర్మాణం ప్రారంభించక ముందు కావలసిన శ్రమ, మేము తప్పకుండా తెలుసుకు నుండాలి.

కాని ఫ్లింటులో ఒకటి రెండూ కాదు. రోజుకి బోలెడన్ని కార్లు నిర్మించేవాళ్ళం. అప్పటినుంచీ బ్యూక్‌లో మాకు పనుల జాబితాలుండేవి.

బ్యూక్ కంపెనీలో చాలామంది మంచివాళ్ళుండేవారు. అందులో బిట్‌స్మిత్ ఒకడు. అతను నా ఉత్పత్తి నిర్వాహకుడయాడు.. రెండు వారాల తర్వాత కార్ల అడుగు భాగాలు తయారవుతున్న గదిలో ఒక రోజు మేమిద్దరం వాటినిచూస్తూ నిలబడ్డాము. ఆ రోజుల్లో మా కంపెనీ రోజుకి 45 కార్లని తయారుచేసేది. హెన్రీ ఫోర్డు రోజుకి కొన్నివందల కార్లు తయారుచేసేవాడు. మరుసటి సంవత్సరం 1913 లో అతని ఉత్పత్తి రోజుకి 1000 కార్లు అయింది.

కార్ల అడుగు భాగాలు నిర్మించే గది 70 అడుగుల వెడల్పు, 60 - అడుగుల పొడవువున్న ఒక పెద్ద కట్టడంలో వుండేది. ఆ యింటిపై కప్పు కొయ్య స్తంభాల నానుకుని వుండేది. 20 అడుగుల దూరంలో ఒక్కొక్క స్తంభం చొప్పున యింటినిండా లెక్కలేనన్ని స్తంభాలుండేవి. బల్ల ఎత్తున వరుసగా చిన్న కట్టడాలుండేవి. వాటిమీద కారు అడుగు భాగాలుండేవి. నలుగురు కార్మికులు చట్రపు భాగాలని తీసుకువచ్చి మేకుతో బిగించేవారు. కొందరు కారుని కుదించే వాటిని పెట్టుతుంటే, మిగతావాళ్ళు వంపు టిరుసుని తెచ్చి తగిలించేవారు. అప్పుడు ఆ కార్మికుల గుంపు మరోబల్ల

దగ్గరకెళ్ళి పని ప్రారంభించేవారు. మెరుగు కాగితంతో లోహానికి మెరుగు పెట్టిన తర్వాత చట్రాలకి దట్టంగా రంగు పూసేవారు. పన్నెండు గంటల వరకూ ఆ రంగు ఎండిపోదు. మర్నాడు మళ్ళీ కాయితంతో మెరుగుపెట్టి పచ్చగా రంగు పూసేవారు. ఆ తర్వాత మూడోసారి మెరుగు పెట్టిన తర్వాత నిగనిగలాడే తైలం పూసేవారు. అది ఎండటానికి మరో పన్నెండు గంటలు పట్టేది. రంగులు పూసే వృత్తిని కార్మికులు రైలుబండీ కార్ఖానాల్లో నేర్చుకున్నారు.

చార్లీ నాష్ నేను బాధ్యత వహించాలన్న పనులన్నీ దాదాపు ఇలాటివే.

"బిల్ ! ఇదంతా తప్పు. ఒక చట్రాన్ని నాలుగు రోజులకి బదులు రెండు రోజుల్లో ఇక్కడనుంచి తీసుకొని వెళ్ళాలి."

"అలా చేస్తే యింకా బోలెడన్ని కార్లని నిర్మించవచ్చు."

"తప్పకుండా మన ఉత్పత్తి పరిమాణాన్ని రెండింతలు చెయ్యవచ్చును. అందుకు ఇంకా చాలా కట్టడాలు కార్మికులు కావాలి. కొయ్యని సాఫు చేసినట్లు లోహానికి మెరుగు కాగితం పూయటం మానేశాము. ఆ విషయం మీద ఎవరైనా వాదించదలచుకుంటే నా సమాధానం యిది. "కారు అడుగు భాగాలకి రంగు పూయటంవల్ల ఉపయోగమేమిటి? మొదటి రోజునే ఆ భాగానికి దట్టంగా రోడ్డు బురద అంటుకుంటుంది." నిజానికి పట్టణాలు దాటితే అన్నీ నాటు రోడ్లే. బహిరంగ మార్గాలు చాలా కొద్దిగా వుండేవి.

ఆ మార్పువల్ల రెండు రోజుల్లో ఒక చట్రాన్ని నిర్మించగలిగాము. తర్వాత ఆ మార్పు కనుగుణంగా ఇతర యంత్రాగారాలలోనూ సర్దుబాట్లు చేశాము. కాని అప్పటికి ఇంకా ప్రారంభదశలోనే వున్నాము. ఆరు నెలలు మళ్ళీ ఆ చట్రాల ఉత్పత్తిని గురించే ఆలోచించసాగాము. శీతోష్ణ పరిమాణాన్ని కాస్త హెచ్చించి ఒక పూటలో రెండు సార్లు రంగు పూసి వాటిని ఎండబెట్టాం. ఖర్చులు తగ్గించి ఉత్పత్తి ఆవిధంగా అభివృద్ధి చేయ ప్రారంభించాము. కంపెనీలో ప్రతి నిముషం రైలు బండీల నిర్మాణంలోని పనితనాన్ని మోటారు కార్ల నిర్మాణంలో అనుసరించటానికి మార్గాలు

వెతుకుతుండేవాళ్ళం. ఆ మార్పులతోనే ఒక రోజుకి 45 బదులు 75 కార్లు నిర్మించి ఉత్పత్తి అభివృద్ధి చేయటంలో కృతకృత్యులయ్యాము. వాస్తవానికి నిర్ణీతకాలంలోనే చాలా తక్కువ వ్యయానికి ఫలితం దక్కింది. అన్నిరకాల దుబారా ఖర్చులనీ తగ్గించుకుంటూపోతే యింకా అభివృద్ధి కలగవచ్చని తెలుసుకున్నాము.

ఒక సంవత్సరం తర్వాత మరో చక్కని మార్పు చేశాను. కారు చట్టాలు నిర్మిస్తున్న గదిలోనే కార్మికులకి అడ్డువస్తున్న స్తంభాలని తీసేసి. పై కప్పుకి కొయ్య బంధాలు వేశాము. ఒక్కో బల్లమీద చట్టనిర్మాణం పూర్తయేంతవరకూ. చట్టపు భాగాలని బిగించటం. మొదలైన పనులతో గదినిండా బల్లలుండే బదులు 45 బల్లలు మాత్రం మిగిల్చి. మిగతా గదంతా ఖాళీ చేశాము. దూలాల ఆధారంగా వున్న ఆ బల్లల సమీపంలో చిన్న బల్లలుండేవి.

ఇవేగాక గది చివరి వరకూ పొడుగ్గా ఒక గొట్టి, రెండు దోవలు వున్నాయి. ఇరుసులతో చక్రాలతో ఒక చట్టము పూర్తికాగానే. ఆ త్రోవమీదుగా దాన్ని బల్లమీద నుంచి గొలుసుతో ఎత్తి నేలమీద పెట్టే వాళ్ళం. అప్పుడు కార్మికు లొక్కొక్కరే దాన్ని తోసుకుంటూ పోయే వారు. ఇద్దరు ఇనుప చట్టాలని పెడితే మిగతావారు వాయువు గొట్టాన్ని తగిలించేవారు. చివరకి చట్టం ముఖ్యభాగం తయారయేది. ఆవిధంగా ఒకసారి కార్లు నిర్మించటం మొదలు పెట్టాక భారీ ఎత్తు ఉత్పత్తి పద్ధతి రూపొందినది. కాని ఆ తర్వాత కొన్ని సంవత్సరాలవరకు భారీ ఉత్పత్తి అనే మాట వాడుకలోకి రాలేదు.

కారు భాగాలు బిగించకముందే రంగులు పూసేవాళ్ళం. మిగతా కార్మికులు కాచుకు నుండక్కరలేకుండా వివిధ భాగాలకి రంగుపూసి సిద్ధపరిచేవాళ్ళం. చిమ్మన గొట్టాలతో నీళ్ళు జల్లే పాత పద్ధతిలో వాయువు నొక్కిదాన్ని ఉపయోగించి రంగుని చల్లటం ప్రారంభించాము. ఆ గదిలోనే రోజుకి 45 కార్లకి బదులు 200 కార్లు ఉత్పత్తి చేసేంతవరకూ క్రమంగా మార్పులు చేస్తూనే వున్నాము.

మా కంపెనీ వృద్ధిచేసిన తర్వాత హైలేండ్‌పార్కు గొలుసులతో కార్లని నూర్చే పద్ధతిని కనిపెట్టాను. ఆ తర్వాత మేమూ ఆ పద్ధతిని ఉపయోగించినాము.

ఈ రోజుల్లో మోటారు కార్ఖానాల్లోకి వెడితే కారు భాగాలని ఎంతో సునాయాసంగా, చక్కగా అమర్చటం చూడవచ్చు. మొదట చూసినప్పుడు వృత్తి చట్టంగా వున్నదే పదిహేను నిమిషాలలో పెట్రోలుతో నూనెతో నిండి, స్వశక్తితో నడిచే మోటారుకారయిపోతుంది. ఆ రోజుల్లో చట్రాలని నిర్మించేందుకు నాలుగు రోజులు పట్టేది. 1912 వ సం॥లోని ఖరీదుగల కార్ల చిత్రాలని గుర్తు తెచ్చుకుని, 1937 వ సం॥లోని చౌకధర కార్లతో ఒక సారి పోల్చిచూస్తే తేడా తెలుస్తుంది. నిజానికి ఈ పరిశ్రమ అభివృద్ధి కోసం పాతిక సంవత్సరాలు మేము బుఱ్ఱలు బద్దలు కొట్టుకునీ, చెమటోడ్చి పనిచేశాము.

కంపెనీలో పనిచేసే క్రొత్తిలో పరికరాల కోసం కాచుకునున్న కార్మికుడు కనుపించినప్పుడల్లా, అభివృద్ధి చేయటానికి ఒక అవకాశం ఏర్పడేది.

"ఏం! ఇక్కడేమయింది?"

"ఈ వంపు టిరుసులు వేగంగా రావటంలేదు. కాచుకోవటంతోనే సగం వేళయిపోతోంది" సూచనంతా అందులోనే వుండేది. వంపుటిరుసు వేగంగా పోయేందుకు ఒక మార్గాన్ని కనిపెట్టినప్పుడు, మరో చిక్కు బహిర్గత మవుతుంది. అలాగే కారు చట్టపు భాగాలతో ప్రారంభించి, కంపెనీలోని ప్రతి అంశము సక్రమంగా నడిచేంతవరకూ పూర్తి మార్పులు చేశాము. ప్రతి క్రొత్త మార్పు కల్పనాశక్తితో సృష్టించినదే. ఒక సమస్య బహిర్గతమై, పరిష్కార మయేలోపు మరో ఇరవై సమస్యలు తల ఎత్తేవి. గొలుసు మీద కార్లు వెళ్ళటంతోనే వాటికొక ఆకృతి ఏర్పడటం మొదలు పెట్టింది. ఆ తర్వాత ఇరుసులూ. వంపుటిరుసులూ, చక్రాల కట్టలు ఉపయోగపడతాయి. ఇంతవరకూ మునపటివలె కార్మికులు కష్టపడనవసరం లేకుండానే యంత్రాలే పనులన్నీ చేసేస్తాయి.

కొనుగోలుశక్తి అధికమవటం వల్ల యంత్రపు పనిముట్లు వృద్ధిపొందాయి. విక్రయదారుడు మా కార్యాలయంలోకి వచ్చి రావటంతోనే "మాకు ఆ యంత్రాలు కావాలని ప్రారంభించే వాళ్ళం. పెన్సిలు తీసి మాకు కావలసినదేమిటో రాసుకు నేవాడు. సొంత కార్ఖానాకి వెళ్ళి "మనం అవి ఎలా చెయ్యగలం?" అంటూ ఆ సమస్యని ఇంజనీర్లముందు పెట్టే వాడు. ఒకొక్కప్పుడు పనిముట్లని తొందరగా చేసేసేవారు. మరొక్కప్పుడు నెలలే కావు సంవత్సరాలు పట్టేవి అవి పూర్తవటానికి. దక్షిణంలోని పత్తిచేను, యంత్రపు పనిముట్ల వ్యాపారం, ఉక్కు పరిశ్రమ పరిణామాలలో మార్పులు రూపొందేంతవరకూ, మేము కొత్త పంథాలో అభివృద్ధి సాధిస్తూనే వున్నాము. ఒకప్పుడు అతి వేగంగా ముందుకి సాగిపోయే వాళ్ళం. అలా ప్రప్రథమంగా ప్రపంచ చరిత్రలో కల్లా పెద్ద పరిమాణమున్న యంత్రాన్ని నిర్మించాము. సామాన్యులకి కూడా ఆకారు అందుబాటులో వుండేది.

బ్యూక్ అధ్యక్షుణ్ణి కావటానికి ఫ్లింట్ నుంచి వచ్చినప్పుడు, జనరల్ మోటార్ల పరిస్థితిని సరిదిద్దగల సమర్థత ఒక నాష్ కే వుండేది. వూళ్లో అంతా అతన్ని మెచ్చుకునేవారు. విలియమ్ డ్యూరెంటు నాష్‌ని జేమ్సు స్టోరోకి సిఫారసు చేశాడు. అప్పుడు స్టోరో పెట్టుబడి దార్ల కూటంలో వుండేవాడు. 1910 వ సం॥లో వ్యాపారం ప్రారంభించినప్పుడు నాష్‌కి మోటారుకార్లని గురించి చాలా కొద్దిగానే తెలుసుండవచ్చు. కాని కార్మికులని ఉపయోగించుకోవటం మట్టుకు తెలియదు.

ఒక కార్ఖానాని నడపటం అంటే ఏమిటో తెలుసు. అన్నిటికంటె గూడా అతను నమ్మకస్థుడు, నిజాయితీపరుడు. ఇతర్ల డబ్బుని నిర్లక్ష్యంగా ఉపయోగించేవాడు కాదు. కంపెనీ డబ్బంతా వృధాగా ఖర్చుకాకుండా తన చేతుల్లో బిగించుకు కూర్చునేవాడు. చిన్న కుర్రాడికివలె "చార్లీ! దయచేసి నువ్వు మొట్టమొదట సంపాయించిన కాసుని చూపించు. స్టోరో నువ్వు దాన్ని ఎక్కడో దాచావని అంటాడు" అని బతిమాలేవాడను.

1886 వ సం॥లోనో 87 వ సం॥లోనో బిల్లీ బండీల వ్యాపారం

మొదలుపెట్టినప్పుడు నాష్ డ్యూరెంటు దగ్గిర పనిచేసేవాడు. చార్లీ బాల్యంలో ఒక మిగిసెట్ కాపు దగ్గిర పనిచేశాడు. ఆ తర్వాత ఫ్లింటుకి వెళ్ళి వైటింగు & రిచర్డుసన్ అనే ఇనుపసామాన్ల కొట్టులో వుద్యోగం సంపాయించాడు. అక్కడ ఒక పెద్ద వ్యవసాయపు వ్యాపారం జరుగుతుండేది. వ్యవసాయపు యంత్రాలు పెట్టడంలో చార్లీకి చక్కటి నేర్పు వుండటంవల్ల, ఆ ప్రాంతానికి అతను ఉపయోగపడ్డాడు. అతను చాలా కష్టపడి పనిచేసేవాడు. సహజంగా బిల్ దృష్టిని ఆకర్షించాడు.

"నాష్! నా కార్ఖానాకి వచ్చి పనిచేస్తావా?"

చార్లీ అందుకు అంగీకరించాడు. డ్యూరెంటు రోజుకి 125 జీతమిచ్చి అతన్ని ఒక కమ్మరి దుకాణంలో పెట్టాడు. కొద్ది రోజులైన తర్వాత అతను డ్యూరెంటు దగ్గిరకెళ్ళాడు.

"కమ్మరి మెక్రటన్‌కి ఇనుము కొట్టియిస్తున్నానేగానీ కాలం వృధా చేస్తున్నాను. మరి కొంత గట్టిగావున్న సుత్తిని తీసుకురండి. 35 డాలర్ల కంటె ఎక్కువకాదు. నెల్లాళ్ళు చేసేపనిని ఒక రోజులో చేస్తాను."

బిల్లీ సుత్తిని కొని, చార్లీని మరోపనిలో పెట్టాడు. బండీలు బిగించే నొక్కేయంత్రం దగ్గిర అతను పనిలో చేరాడు. కాని నొక్కేయంత్రం పైన ఒక బిసపెట్టి, రెండుచేతులు వదిలేసి, కాలితో నొక్కుతూ దాన్ని త్రిప్పాడు. మునుపున్న కార్మికుడికంటె నొక్కే యంత్రంతో అయిదు రెట్లుత్కువగా పనికానిచ్చాడు.

"చార్లీ! ఇక్కడ ఇంకో మనిషిని పెడతాం. యంత్రాలని సిద్ధపరిచే దుకాణం బాగుచేయగలవేమో చూడు."

ఆ చిక్కు ఏమిటో చార్లీ తొందరగా తెలుసుకున్నాడు. "వస్తువులు కొనే ప్రతినిధి చౌకరకం మేకుల్ని కొంటున్నాడు. మొరటుగా వున్న మేకులు కార్మికుల వేళ్ళని గాయపరుస్తున్నాయి. అంతేకాకుండా మేకులు చిన్నవయిపోవటం వల్ల కార్మికులు ఉపయోగించేవాటికంటె ఎక్కువ కింద పడేస్తున్నారు."

పనిముట్లు తయారుచేయటంలో నాష్‌కి ఒక సహజ నైపుణ్యముంది. క్రమంగా డ్యూరంటు అతని స్నేహితుడు జె. డల్లా డోర్టు కలసి నిర్మించిన పెద్ద బండీల వ్యాపారానికి కార్యనిర్వాహకుడయాడు. ఆ కంపెనీ సంవత్సరానికి 1,50,000 బండీలని ఉత్పత్తిచేసేది. బ్యూక్ కంపెనీలో చేరినప్పుడు నాష్ జనరల్ మోటార్సులోలేదు. డ్యూరెంటుతో పనిచేయలేదు. అయినా తర్వాత జనరల్ మోటార్సు అధ్యక్షుడయాడు. డ్యూరెంటుకీ నాష్‌కీ మధ్య మనస్పర్థలు కలిగాయి. ఎక్కువగా నాష్‌కీ స్టోరోకి మధ్య ఏకాభిప్రాయాలేర్పడేవి. ఆ తర్వాత కొద్ది సంవత్సరాలవరకూ డ్యూరెంటుకీ నాకూ పరిచయమేర్పడలేదు.

మూడు సంవత్సరాలైనా గూడా నేను మొదట కార్యనిర్వాహకుడిగా చేరినప్పుడు యిచ్చిన జీతాన్నే యిచ్చేవారు. అప్పటికి ఫ్లింట్ ఆర్థిక పరిస్థితి బాగుంది. సాక్షేపముగాచూస్తే నాకు చాలా కొద్దిజీతమెస్తున్నట్లు స్పష్టమయింది.

అధికారులు ఎత్తైన బల్లకి వెడల్పాటి మేజాకి మధ్య తిరుగుడు కుర్చీల్లో కూర్చునేవారు. ఒక రోజు నాష్ కార్యాలయంలోకి వెళ్ళి, బల్లమీద చేతులుపెట్టి, "చార్లీ ! నాకు సంవత్సరానికి 25,000 డాలర్లు కావాలి" అన్నాను.

"వాల్టర్ !" అని చిన్నకేక పెట్టాడతను.

"మన వ్యాపారం బాగా సాగుతోంది. ఇదొక్కటే లాభం చేసుకుంటున్న కంపెనీ."

"వాల్టర్"

"నేను పూర్తిచేసేంతవరకూ ఒక నిముషం ఆగు. ఇది చెప్పేముందు చాలా రోజులు కాచుకుచూశాను. నేను ఇక్కడికి వచ్చినప్పుడు 12,000 డాలర్లు సంపాయించేవాణ్ణి. 6000 డాలర్లకి ఈ పని అంగీకరించాను. మీరు అప్పటినుంచీ జీతం హెచ్చించలేదు. నాకు సంవత్సరానికి 25,000 డా|| కావాలి. లేదా ఈ వుద్యోగం వదిలిపెట్టదలచుకున్నాను."

"వాల్టర్! ఈ విషయాన్ని గురించి నేను స్ట్రోర్‌తో మాట్లాడవలసి వుంది" అని చుట్ట పీలుస్తూ బైటికి వెళ్ళిపోయాను.

కొద్ది రోజులకి స్ట్రోర్ న్యూయార్క్‌కివచ్చాడని విన్నాను. నాష్, స్ట్రోర్ సమాలోచన చేశారు. చార్లీ కార్యాలయంలో కలుసుకుందుకు రమ్మని నాకు కబురు పంపారు.

"వాల్టర్! ఇదంతా ఏమిటి?"

"ఏమీలేదు. నేను ఇక్కడికెలా వచ్చానో మీకు తెలుసు 12,000 డాలర్లు తెచ్చుకునేవాడికి ఇప్పుడు 6,000 డాలర్లు వస్తున్నాయనీ మీరు ఎరుగుదురు. మా జేళ్ళు కష్టపడి పనిచేసిన - నాకు సంవత్సరానికి 25,000 డాలర్లు కావాలి—"

"ఆవేశపడక వాల్ట్. నీకు 25,000 డాలర్లు రాబోతున్నాయి" అని గారాబు గుర్రాన్ని తట్టినట్టుగా నన్ను బుజ్జగించాడు.

"కృతజ్ఞుణ్ణి. అంతేకాదు. పై సంవత్సరం నాకు 50000 డాలర్లు కావాలి" అప్పటికి నాకు 40 ఏళ్ళు. నిజానికి ఇంటికి వెళ్ళినప్పుడు, జీతం ఎక్కువయినందుకు సంతోషపడ్డాను. ఆ విషయం భార్యతో చెప్పాను.

"మీరు అలా చేస్తారని నాకు తెలుసు."

నేను వినగోరినదంతా ఆ మాటలోనే ఇమిడివుంది. మా జీవిత కాలంలో ఎప్పుడూ నా పద్ధతులని మార్చుకోమని ఆమె నన్ను ఏ మాత్రం తొందర చెయ్యలేదు. ఎప్పుడూ నసపెట్టి ఎరగదు. ఎట్టినేరాన్నీ పూర్తిగా నా మీదే మోపలేదు. అయినా నా భార్య సక్రమమైనవిగా భావించే విషయాలని గ్రహించి, దాన్నే మూలకారణంగా పెట్టుకుని, అంచనాలువేసి తీర్మానాలు చేసుకునేవాడను. జీతం ఎక్కువవుతుందనగానే మేమిద్దరం కొత్త గౌనుని గురించి చర్చించాం. ఆమెకి చాలా సౌకర్యాలుం తేవికావని నాకు తెలుసు.

"రెండు తీసుకురా." కాని ఆమె తల విదిలించింది. మేము యింకా ఈ భూమ్మీద వుండగలిగామంటే దానికి 70 వంతులు నా భార్యే కారణం.

1915 వ సం॥లో నేను సంవత్సరానికి 25,000 డాలర్లు జీతం తీసుకోవటం మొదలుపెట్టాను. ఆ సంవత్సరమే జనరల్ మోటార్స్‌లో ఒక ముఖ్య సంఘటన జరిగింది నా జీతంలో. కొంత డబ్బుపెట్టి కంపెనీలో వాటాలు కొనటానికి ప్రయత్నించాను. కొని ధర వేగంగా హెచ్చిపోవటం వల్ల కావలసినన్ని కొనలేకపోయాను. బ్యూక్ కంపెనీలో వుద్యోగస్థు లందరికీ గర్వకారణంగా తయారయింది. మా కెవరికీ అప్పట్లో తెలియదు కానీ, జనరల్ మోటార్స్‌ని స్థాపించి, బ్యూక్ కంపెనీకి కీర్తి తెచ్చిన వ్యక్తి గాసంకల్పించాడు. అతనొక మేధావి. ఎల్బానుంచి తిరిగివచ్చిన నెపోలియన్‌తో, అతని విజయోత్సాహాన్ని పోల్చవచ్చు. కాని ఈసారి మటుకు నెపోలియన్ 100 రోజులకంటె ఎక్కువ కాలమే విజయం సాధించాలి.

కాన్సాస్‌లో పది పదకొండేళ్ళ బాలుడిగా నేను గోళీలాడేటప్పుడు. ఫ్లింట్‌లో డ్యూరెంటు ఒక భీమా వుద్యోగి. ఉత్పత్తిదారుడయేందుకు అతనికి ఒక అవకాశంవచ్చినప్పుడు భీమా వ్యాపారంలో సంవత్సరానికి 900 డాలర్లు లాభమొస్తోందని నాతో చెప్పాడు. వ్యాపారం ప్రారంభిం చేందుకు 2000 డాలర్లు అప్పుచేశాడు. 1500 డాలర్లకి ఒక చేతిబండీ, కంపెనీ అధికార పత్రాలనీ యితర హక్కులనీ కొన్నాడు. తక్షణమే స్నేహితుడికి అందులో 100 డాలర్లకి ఒక ఆరవవంతు వాటా అమ్మాడు. 40 ఏళ్ళ లోపునే కోటీశ్వరుడయాడు. ఎటువంటి కఠిన పరిస్థితుల వల్ల, తను మక్కువతో ప్రారంభించిన బ్యూక్, జనరల్ మోటార్స్ అధికారాలని అతను పోగొట్టుకున్నాడో చెప్పటానికిది సమయంకాదు. కాని అవి పోవటంతోనే చెవర్‌లెట్ అనే మరో కంపెనీ స్థాపించాడు. 1918 వ సం॥ ఏప్రిలులో మొట్టమొదట చెవర్‌లెట్ నిర్మించబడింది. రెండేళ్ళ తర్వాత సాక్షేపముగా చిన్నదైన చెవర్‌లెట్ కంపెనీతోబాటు బ్రహ్మాండమైన జనరల్ మోటార్స్ అధికారాన్ని తిరిగి సంపాయించేందుకు ఒక పథకంవేసి, అందులో కృతకృత్యుడయాడు. దానికి కొన్ని కారణా లున్నాయి. జనరల్ మోటార్స్ పెట్టుబడిలో అతనికి చాలా భాగాలుం డేవి. వాటిని అలాగే వుంచాడు. అతని ప్రతిభలో నమ్మకమున్న బంధు

వులు, వ్యాపారపరిచయస్థులూ, పాత స్నేహితులు వారి భాగాల నలాగే వుంచారు. ఎప్పుడో ఒక రోజున బిల్లీ తిరిగి అధికారాన్ని సంపాయించ గలడనుకున్నారు. 1912 వ సం॥లో ఇంకో సంవత్సరానికి మొదటి చెవర్‌లెట్ అమ్ముడు పోతుందనగా, అతని పథకం పరిపూర్ణత చెందటం ప్రారంభించింది.

మూడేళ్ళ తర్వాత, 1915 వ సం॥ సెప్టెంబరు 16 వ తేదీన బిల్లీ డ్యూరెంటు జనరల్ మోటార్సు భాగస్థుల సమావేశంలో ప్రవేశించాడు. తక్షణమే కంపెనీ వ్యవస్థాపకుడైన తను మళ్ళీ అధికారంలోకి వచ్చానని అతి ప్రశాంతంగా వెల్లడించాడు. అంటే డ్యూరెంట్ డ్యూపాంటుతో సహా చెవర్‌లెట్ అధికారి అయింది. జనరల్ మోటార్సు దాని ఆధీనంలో మాత్రమేవుంది. చెవర్‌లెట్ జనరంజకమైన పేరు కాకపోవటంవల్ల, కంపెనీలు ఒకదాని పేర్లొకటి మార్చుకున్నాయి. కంపెనీలో ఒక విభాగం ఏర్పడింది. అప్పటినుంచీ బ్యూక్, కాడలిక్, మిగతా పేర్లేగాక చెవర్‌లెట్ అనే కొత్త విభాగం ఏర్పడింది. అది సాధించటానికి డ్యూరెంటు డ్యూపాంటుకి 27,000,000 డాలర్లు వ్యయంచేశాడు.

మరుసటి సంవత్సరం జూన్‌లో స్టోరో కార్యనిర్వాహక వర్గంలోంచి విరమించుకున్నాడు. ఆర్థిక శాఖ సభాధ్యక్షుడిగా అతని స్థానంలో న్యూయార్కులోని చితమ్ అండ్ పినొనిక్సు బ్యాంకు, లూయీస్ కె. కాఫిమాన్ నియమింపబడ్డాడు. డ్యూమెంటు పోరాటంలో కాఫి మాన్ సాయపడ్డాడు. ఆ తర్వాత కొద్ది రోజులకి, బ్యూక్ కంపెనీలో ప్రవేశిస్తుండగా, మొదటి సారిగా కాఫిమాన్‌ని చూసినట్లు జ్ఞాపకం. అప్పటినుంచీ మేమిద్దరం స్నేహితులంగానే వుండిపోయాం. అనేక సంవత్సరాలు అతను జనరల్ మోటార్సులో పనిచేశాడు.

ఈలోగా నాష్, స్టోరో, నేనూ కలసి ఒక వ్యాపారం చెయ్యాలని ఉబలాట పడ్డాం. మా పథకం కొనసాగేటట్లయితే నేను అంగీకరిస్తానన్నాను. యంత్రాగారాలూ, ప్రతినిధులూ అంతా కలసి పాకర్డ్ మోటారు కారు కంపెనీ కొనాలనుకున్నాము. ఆ వ్యాపారం కోసం స్టోరో డ్రోటికీకి బయలుదేరి వచ్చాడు. వాస్తవానికి వ్యవహారం

స్థిరపడినట్లే అంతవరకూ బేరాలు సవ్యంగా సాగిపోయాయి. 1916 వ సం॥ జూన్ 1 వ తేదీన జనరల్ మోటార్సు అధ్యక్షుడి పదవికి నాష్ రాజీనామా యిచ్చాడు. నేను అప్పుడు బ్యూక్ కంపెనీ కార్యనిర్వాహకుడిగా వున్నాను.

డ్యూరెంటులో నాష్ వుద్యోగాన్ని తీసుకున్నాను. ఒకరోజు అతను నా కార్యాలయంలోకి వచ్చి, తిన్నగా వ్యవహారంలోకి దిగాడు.

"క్రిస్లర్ ! నిన్ను బ్యూక్ కంపెనీ అధ్యక్షుణ్ణి చెయ్యాలని వుంది"

"మీతో పూర్తిగా నిష్కపటంగా వుండదలచుకున్నాను. నేను సమాలోచిస్తున్న వ్యవహారమే స్థిరపడితే, ఇక్కడనుంచి వెళ్ళిపోతున్నాను."

"ఇది పేరున్న కంపెనీ. నువ్వు అద్భుతంగా చేస్తున్నావు."

"ఈ పథకం కొనసాగేటట్లయితే నేను వెళ్ళి తీరాలి."

బిల్లీ నన్ను అర్థం చేసుకున్నట్లు నవ్వుతూ తల పంకించాడు. "రూఢిగా తెలియటానికి ఎన్నాళ్ళు పడుతుంది ?"

"30 రోజులనుకుంటాను."

"ఈ 30 రోజులూ నేను ఫ్లింట్‌లో వుంటాను. నిర్ణయం చేసుకున్న తర్వాత నన్ను పిలు. నీతో మాట్లాడాలి."

అతనిలోని ఆకర్షణని మాటలతో వర్ణించలేను. అలాటి వ్యక్తిత్వమున్న మనిషిని నేను మళ్ళీ కలుసుకోలేదు. చెట్టుమీద వున్న ఒక పక్షిని కిందికి దిగేట్లు చేసే చాకచక్యముందనుకుంటాను. అతనికి మొదటిసారిగా నేనూ నా భార్యా, అతనింటికి వెళ్ళటం జ్ఞాపకముంది. ఆ ఇంట్లో గోడలకి పట్టు తెరలు వేళ్ళాడుతున్నాయి. బిల్ అంత ఐశ్వర్యవంతుణ్ణి మరి ఎక్కడా చూడలేదు నేను. నాతో చాలా చనువుగా మాట్లాడాడు. అయిదు నిముషాలలో అది నా సొంత యిల్లు అనుకునేట్లు చేశాడు.

పాకార్డ్ వ్యవహారం ఫలించలేదు. అయినా నాష్ ఈ లోపు విస్కాన్సన్, కెనోషాలోని జెఫ్రీ కంపెనీ చూశాడు. స్టోరో దాన్ని 51000,000 డాలర్ల కంటె తక్కువలోనే కొనవచ్చని నాతో చెప్పాడు.

దాన్ని కొనాలని చార్లీ స్టోర్ చాలా తొందరపడ్డారు. జనరల్ మోటార్స్ లోని డబ్ల్యూ, హెచ్. ఆల్ ఫ్రడ్, సి. బి వారన్ గూడా మాతో కలుస్తామన్నారు. స్టోర్ నన్ను తొందరచేస్తూ "నీ సొంత కంపెనీకి పనిచేస్తున్నావనే తృప్తి వుంటేట్లు, సొంతదారులలోనూ భాగస్థుల్లోనూ నువ్వే ముఖ్యుడివిగా వుంటావు" అన్నాడు. మొదట్లో చిన్న కంపెనీగా ప్రారంభమైనా దానికి భవిష్యత్తువుంది. ఒక్క నష్టమేమిటంటే, మేము మళ్ళీ యింకో పరాయి వూరు వెళ్ళాలి. ఇప్పటికే చాలా కొత్త వూళ్ళు తిరిగాము. నిజానికి మొదటిసారిగా ఓల్క్ లోనే నేనూ నా భార్యా స్థిరపడ్డాము. చివరికి ఆ కారణంవల్లనే చేరటంలేదని స్టోరోకి తంతి యిచ్చాను. నాష్ స్టోరోలు నా స్నేహితులవటం వల్ల అది నా జీవితంలో పెద్ద మార్పు తెచ్చింది. తర్వాత స్టోర్ యిలా సమాధాన మిచ్చాడు.

పియమైన వాలర్.

భవిష్యత్తులో నీకు శుభం చేకూరాలని ఆశిస్తున్నాను. ఏ సమయంలోనైనా మేము అవసరమైతే, మా శక్తికొలదీ సాయపడటానికి సిద్ధంగా వున్నామని నమ్ము. మేము ఏమి చేస్తున్నదీ తెలియపరచటానికి, నాష్ మోటారు కంపెనీ భాగాలు విక్రయించే విధానం సూచించే ఒక ప్రకటన పత్రికని దీనితో జతపరుస్తున్నాను. ఎప్పుడైనా నువ్వు న్యూయార్కు వచ్చే సమయం తెలియపరచు. నేను ఒడ్డర్ లోవుంటే నిన్ను కలుసుకునేందుకు, చూసేందుకు ప్రయత్నిస్తాను. మన స్నేహితం తెగిపోవటం నాకు యిష్టంలేదు. అందుకు నిన్ను తోడ్పడమని ప్రార్థిస్తున్నాను.

మా స్నేహం తెగిపోలేదు. అతను చనిపోయేంతవరకూ నా ప్రాణ స్నేహితుడిగానే వున్నాడు.

చార్లీ నాష్ రాజీనామాతో జనరల్ మోటార్స్ లో ఒక పెద్దలోటు ఏర్పడింది. మా కంపెనీ విజయానికి మూలకారకుడతనే. అతను వెళ్ళిపోవటం నాకు యిష్టంలేదు. అతను ఒక నమ్మకమైన స్నేహితుడు, గొప్ప వ్యక్తేగాక, అమెరికాలోని ఒక సమర్థనీయుడైన పారిశ్రామికుడు. అతను మిగిగాన్ నుంచి విస్కాన్సిన్ వెళ్ళినరోజునుంచే రెసైనలో మోటారు

కంపెనీతో అతను ఘనవిజయాన్ని సాధిస్తాడనే విషయం జనరల్ మోటార్సు స్నేహితులెవరైనా చెప్పగలిగివుండేవారు.

నేను తీర్మానం చేసేసుకున్న తర్వాత డ్యూరెంటుకి టెలిఫోను చేశాను. "నన్ను ఎప్పుడు కలుసుకుంటావ్" అనడిగాడు.

"ఉదయం ఏడుగంటలకి"

కార్ఖానాలగుండా నడుస్తూ, కార్యాలయాలు తెరవకముందే బల్ల దగ్గరకి వెళ్ళటం నాకలవాటు. అవేళ పెందరాళే పనికి వెళ్ళాను. సరిగ్గా ఏడుగంటలకి బిల్లీ నాగదిలో అడుగుపెట్టాడు.

మేజాకీ బల్లకీ మధ్యవున్న తిరుగుడు కుర్చీలో కూర్చున్నాను. డ్యూరెంటు నా కెదురుగ్గా బల్లమీద కూర్చున్నాడు. జీతం హెచ్చిస్తానని చెప్పదల్చుకున్నాడు.

"బ్యూక్ అధ్యక్షుడిగా ఇక్కడే వుండిపోయేందుకు సంవత్సరానికి 500,000 యిస్తాను. ఆవార్తని కొంచెంకూడా తొణక్కుండా వెల్లడించాడు. కొద్దిక్షణాలు ఏమీ ఆలోచించలేకపోయాను.

"డ్యూరెంటు! మీరు యిస్తానన్న జీతం నేను ఆశించినదానికంటె ఎక్కువైనదే. కాని...!

"వాల్టర్ (అప్పటికి మేము బాగా స్నేహితులమయాం) ప్రస్తుతానికి సొంత వ్యాపారంచేసే ఆలోచనలని కట్టిపెట్టు. నీకు అలాంటి కోరిక వున్నందుకు నిన్ను నిందించను. కాని మరో మూడేళ్ళవరకూ నా దగ్గర పనిచెయ్యమని అడుగుతున్నాను."

"ఒక్క విషయం......"

"నేను చెప్పిన ఒడంబడికని నువ్వు కాదనకూడదు వాల్టర్. నాష్ వెళ్ళిపోతున్నాడు. కాని ఇక్కడి కుర్రాళ్ళంతా నిన్నే నమ్ముకున్నారు. ఇప్పుడు........"

"మీరు చెప్పినట్లు వాళ్ళు నన్ను నమ్ముకున్న మాట నిజమే. కాని వాళ్ళని నమ్ముకునే నేను సంపూర్ణాధికారం కోరుతున్నాను. అలా గయితేనే అంగీకరిస్తాను. వాళ్ళ సహాయంతో ఈ కంపెనీని నడపగలను.

ఇందులో ఒకరి జోక్యం వద్దు. మీరు తప్ప మరే యితర యజమానీ నాకు వద్దు. ఏదైనా సక్రమంగా జరగటం లేదని అనిపించినా, నా పని నచ్చక పోయినా, నా దగ్గరకే రండి. మరొకరి దగ్గరకి వెళ్ళి నా అధికారాన్ని వారి కప్పగించేందుకు ప్రయత్నించవద్దు. ఫ్లింటుకీ, డ్రెయిటుకీ మధ్య మీకూ నాకూ ఒకే నిష్కపటమైన మార్గముండనివ్వండి. నేను కోరేది సంపూర్ణాధికారం.”

అప్పుడతను సంతోషంతో నాకేసిచూసి నవ్వాడు. “ఇది ఒక ఒప్పందం” అని ఆ మాటని ధృఢపరిచేందుకు బల్లని చేతివ్రేళ్ళతో మృదువుగా స్పృశించినాడు.

ఆ ఒడంబడిక కార్యాలయంలో నిర్ణయించిన దానికంటె ఉపయుక్తంగా వ్రాయబడింది. జనరల్ మోటార్సులో మూడు సంవత్సరాలు పనిచేయటానికి ఒప్పుకున్నాను. ప్రతినెలా నాకు 10,000 డాలర్ల రొఖ్ఖం వచ్చే ఏర్పాటయింది, ఒక్కొక్క సంవత్సరం పూర్తవుతూనే, రొఖ్ఖరూపంలో గానీ, వాటాల రూపంలోగానీ, మూడు సంవత్సరాలూ మిగతా డబ్బుని తీసుకుంగుకు హక్కువుంది. మేము ఒడంబడికమీద సంతకం పెట్టిన రోజునవున్న ధరకే ఆ వాటాలు తీసుకోవచ్చు. నిజానికి నేను ఎక్కువగా వాటాలనే తీసుకున్నాను.

బహుశః బిల్ కోపిష్టి అవటంవల్ల అనుకుంటాను తగాదాలు తప్ప లేదు. సెయింటు లూయీస్‌లో ఒకటీ, కాన్సాస్ పట్టణంలో ఒకటీ, న్యూయార్కులో ఒకటి. మిగతా చోట్ల కొన్ని, మొత్తం 16 శాఖలున్నాయి. కాని అన్నిట్లోకి మంచిది డ్రెయిట్‌లోవుంటేది. ఒక్కొక్క దానిమీద సంవత్సరానికి 2,000,000 డాలర్లు వస్తూ కంపెనీకి చక్కని వ్యాపారం సాగేది. నేను బ్యూక్ అధ్యక్షుడైన మూడునెలల తర్వాత, ఒక రోజు ఆ శాఖలను గురించి కొత్త ఏర్పాటు చేశాము.

అంతకుముందు విక్రయ నిర్వాహకుడిగావున్న రిచర్డు కాలింసు నన్ను చూట్టానికి వచ్చాడు.

డ్యూరెంటుకి సమీపంగా వుండటానికనుకుంటూను అతను బిల్‌ని వదిలిపెట్టి డెట్రాయిట్‌కి వెళ్ళిపోయాడు. నిజానికి అతను డ్యూరెంటు సన్నిహితుల్లో ఒకడవటంవల్ల అలా వెళ్ళిపోయాడు.

"ఏమి మాట్లాడదలచుకున్నావ్ బిల్ ? ఇవేళ నేను తొందరపనిలో వున్నాను."

"డ్యూరెంటు దగ్గరనుంచి బ్యూక్‌లో ఒక శాఖని కొన్నానని చెప్పేందుకు డెట్రాయిట్ నుంచి కార్లో వచ్చాను."

"లేదు. నువ్వు కొనలేదు. నేను బ్యూక్ అధ్యక్షుణ్ణి."

"నిజంగా కొన్నాను" నన్ను కొద్దిగా వెక్కిరించినట్లుంది ఆ మాట. "అందుకే నే ఇక్కడికి వచ్చాను. ఆ విషయమై నీతో మాట్లాడాలి."

"ఆ విషయమై నాతో మాట్లాడేందుకేమీ లేదు. జనరల్ మోటార్స్‌కు డ్యూరెంటు అధ్యక్షుడైనా బ్యూక్ మోటారు కంపెనీని నేను నడుపుతున్నాను. ఒప్పుకుంటావా ?" అంటూ కోటు వేసుకుని, టోపీ పెట్టుకుని గుమ్మం దగ్గరకి వెళ్ళాను.

"కాని నేను ఏర్పాటు చేసేసుకున్నాను."

"నువ్వు ఏ ఏర్పాటు చేసుకోలేదు. కిందికి వెళ్ళి కారెక్కి తిరిగి డ్యూరెంటు దగ్గరకెళ్ళు. డెట్రాయిట్ శాఖని కొనలేదని చెప్పు. నేనూ తిన్నగా బయల్దేరి అక్కడికే వస్తున్నాను."

అవేళ మధ్యాహ్నమే బిల్లీ కార్యాలయంలోకి వెళ్ళాను. "నేను బ్యూక్ కంపెనీ నడిపేందుకు మీతో చేసిన ఒడంబడికని మరచిపోయారా?"

"ఎన్నటికీ మరచిపోలేదు. ఏం జరిగింది ?"

"కాలింగు తను డెట్రాయిట్ శాఖని కొన్నానని నాతో చెప్పాడు. అతను కొన్నట్లయితే నేను వెళ్ళిపోతాను."

"ఆవేశపడక వాల్ట్. నువ్వు కాలింగ్‌ని ఎరుగుదువు. కొన్ని నెలలుగా ఆ శాఖ విషయమై అతను నన్ను తొందరచేస్తున్నాడు......"

"బ్యూక్ అధ్యక్షుడిగా వున్నంతకాలం నేనే దీన్ని నడుపుతాను. కాడలిక్, ఓల్డ్సమొబైల్, బ్యూక్, చెవర్లెట్ మొదలైన కంపెనీ లన్నిటికీ సంబంధించిన పద్ధతులేవైనా మార్చవలసివుంటే నాతో చెప్పండి. మీ ఉత్తరువులని అమలుజరుపుతాను. కాని బ్యూక్ కంపెనీతో మటుకు జోక్యం కల్పించుకోవద్దు. నన్ను గురించి మీరు అభిప్రాయం మార్చు కుంటే తప్ప, బ్యూక్ కి, నేనే బాధ్యుడనుగా వుంటాను. లేదా ఇప్పుడే రాజీనామా యిచ్చేస్తున్నాను."

"కాలింగ్ బ్యూక్ శాఖని దేన్నీ కొనలేదు."

"కొన్నానని నాతో చెప్పాడు."

"ఆ విషయం నాకు వదిలెయ్."

"అలాగే. డెట్రాయిట్ శాఖని అమ్మలేదని ఒక పత్రం వ్రాసి యివ్వండి." టైపుకొట్టే వ్యక్తిని పిలిచి, నేను అడిగినదిచెప్పి, టైపు చేయించాడు. తేలికపడ్డ మనసుతో తిరిగి ఫ్లింట్ కి వెళ్ళాను. ఒక సంవత్సరం తర్వాత అనుకుంటాను మరో అభిప్రాయభేదం వచ్చింది.

నా దగ్గిర పనిచేస్తున్న లోహాలను కరిగించే సూపరింటెంటుకి 8000 డాలర్లు యిచ్చేవాళ్ళం. అతనొకరోజు నా దగ్గిరకివచ్చి, "డ్యూరెంటు నన్ను జనరల్ మోటార్సు కర్మాగారంలో పనిచేయమంటున్నాడు" అన్నాడు.

"ఫ్లింటునుంచి వెళ్ళిపోవాలనుందా?" అని అడిగాను.

"లేదు. కాని డ్యూరెంటు నాకు 12,000 డాలర్లు యిస్తానన్నాడు."

"అలాగయితే వెళ్ళు" అన్నాను.

బిల్లీ కనపడుతూనే "ఇక్కడ పనిచేస్తున్న వుద్యోగి కావాలంటే నాతో చెప్పు. సాయంచేస్తాను. కాని నేను వెళ్ళిపోవాలనుకుంటే తప్ప, నా పనివాళ్ళ జోలికిరాక" అన్నాను. కాని డ్యూరెంటుకి అలాటి అలవాటు పోలేదు. తనకి కావలసిన మనిషి కనుపిస్తే డబ్బుఆశ చూపించే వాడు. తర్వాత ఆ ఏర్పాటు రద్దుచేస్తాననే వాడేగాని అందువల్ల

కార్మికులకి అన్యాయం జరుగుతుందని అవి రద్దుచేసేవాళ్ళం కాదు. అందుకని నేనే "ఇదుగో 12 000 డాలర్లకి నీకు కావలసిన వుద్యోగి" అనేవాణ్ణి.

ఆ మూడేళ్ళల్లోనూ అలాంటి విషయాలమీద బోలెడన్ని వాగ్వివాదాలు జరిగాయి.

ఓసారి అతనితో యిలా అన్నట్లు జ్ఞాపకం. "బిల్లీ! జనరల్ మోటార్స్‌లో నీ పద్ధతులేమిటో చెప్పు. అవి ఎలాంటివైనా సరే అమలు జరుపుతాను. వాటిని సాధించేందుకు ప్రయత్నిస్తాను. నిర్మాణము, క్రయ విక్రయాలు, కార్మికులు మొదలైనవన్నీ నాకు వదిలెయ్యి—కాని నీ పద్ధతులేమిటో చెప్పు?"

బిల్లీ నన్ను చూసి నవ్వాడు. "వాల్ట్! తరుచు నా పద్ధతులని మార్చటంలో నాకు నమ్మకముంది" తలవిదిలించి "నీకూ నాకూ ఎప్పుడూ పొసగదు" అన్నాను. అతని స్వభావం చాలా విచిత్రమైంది. మేమిద్దరం పోట్లాడుకునేవాళ్ళం. వెంటనే అతను నా జీతాన్ని ఎక్కువచేస్తాననే వాడు. మోటారుకారు పరిశ్రమ డ్యూరెంటుకి యింకా చాలా ఋణపడి వుంది. కొన్ని విషయాలలో డ్యూరెంటుని ఆ పరిశ్రమయొక్క మేధావిగా భావించవచ్చు. చార్లీ, నాష్ అతని హెచ్చరికలు గుర్తుకొచ్చినప్పుడల్లా, "నాకు కావలసినంత డబ్బు సంపాయిస్తున్నాను. జీతంకోసమని కాదు. దయచేసి బ్యూక్ కంపెనీని నాకు వదిలెయ్" అని అతనితో నెమ్మదిగా మాట్లాడేవాడను.

---

# కార్మికులు, మోటార్లు, నా భార్య

"నేను తిరిగి పనిలోకి వెళుతాను."

బ్యూక్ మోటారు కంపెనీని చాలా చక్కని పద్ధతిలో నిర్మించా మని బిల్లీ అనుకునేవాడు. కాని జనరల్ మోటార్సులోని యితర వ్యాపారా లన్నింటినీ అది కప్పి పుచ్చేస్తోందని కలవరపడ్డాడు. కనీసం అతను నాతో చెప్పేవరకి. బ్యూక్‌లో లాగే పాంటియాక్, ఓల్డ్సు, కాడలిక్, మొదలైన వాటిలో విజయం సాధించాలనీ. వాటిని పరిపూర్ణత చెందేట్లు చేయాలనీ అన్నాడు. ఆ విషయమై అప్పుడప్పుడు మేము చర్చించుకునే వాళ్ళం. కొంతెప్పుడు సరదాగా మాట్లాడుకునేవాళ్ళం. సామాన్యంగా మాకు కావలసినదేదైనా కనుపించగానే మేమే స్వయంగా వెళ్లో లేక మనుష్యుల్ని పంపో వాటిని తెప్పించుకునే వాళ్ళం. కొన్ని పరిస్థితుల్లో అవి డబ్బుతో లభ్యమయేవి కావు.

డేటన్‌లో చార్లెస్ ఎఫ్. నాష్ అనే యంత్ర పరిశోధకుడుండే వాడు. అతను చాలా తెలివిగలవాడు. ఆ మేధావి డెట్రాయిట్‌లో మాకు చాలా అవసరం. కెటరింగు. అతని స్నేహితుడు ఎడ్వర్డు ఆంద్రు డీడ్సు కలసి డెల్కో అనే డేటన్ ఇంజనీరింగు లాబరేటరీ కంపెనీని నడుపు తుండేవారు. కెటరింగ్ మొదటి విద్యుచ్ఛక్తి యంత్రాన్ని చేసిన కొద్ది రోజులకి, వాళ్ళ దగ్గరనుంచి డ్యూరెంటు ఆ కంపెనీని కొన్నాడు.

నేను బ్యూక్ కంపెనీ అధ్యక్షుడను కాకముందే డ్యూరెంటు దాన్ని కొనటం జరిగింది. ఆ వ్యవహారం పూర్తయ్యాక ఫ్లింట్ కి వచ్చి, నాష్‌తో నా సమక్షంలోనే ఆ విషయం చర్చించాడు. డెల్కో వారు తయారు చేస్తున్న ఏర్ కండీషన్ కారు (శీతోష్ణస్థితి వున్న కారు) గూడా ఆ కంపెనీతో బాటు కొనవలసి వచ్చిందని బిల్లీ చెప్పాడు. ఆ కారు బజారు లోకి వస్తే, తక్కువ ధరకి అమ్ముడు పోతున్న కార్ల వ్యాపారాన్ని నాశనం చేస్తుందనే పుకారు బయలు దేరింది. డ్యూరెంటు నా వైపు తిరిగి "కొత్త కారుని ఏం చెయ్యదలుచుకున్నావ్" అన్నాడు.

"ప్లేట్లో తగలేస్తాను" అన్నాను. ఆరోజుల్లో నాకు మొరటుగా మాట్లాడే అలవాటుండేది. నవ్వుతూ నా అభిప్రాయంతో ఏకీభవిస్తున్నట్లు డ్యూరెంటు తల వూపాడు. డెల్కోని కొనటంలో అతను చాలా తెలివైన పని చేశాడనుకుంటాను. కార్లు వాటంతటవే బయలుదేరటానికీ, దీపాలు వెలగటానికీ యిగ్నిషన్ యూనిట్సుకి మాకు చాలా ఖర్చయేది. బిల్లీ ఆ పథకం వేశాడు. మోటారు కార్ల వ్యాపారం ప్రారంభించి నప్పటి నుంచి ఖర్చులు తగ్గించేందుకే మేము ప్రయత్నిస్తుండే వాళ్ళం. అందుకే అమెరికాలో కార్లు కొనుక్కోవాలంటే పెద్ద శ్రీమంతుడు కానవసరం లేదు. కారు కొనలేని పేదరికం ఏ కొద్ది మందికో వుండేది. ఇందుకు మరో కారణం కూడా వుంది. మోటారు కార్లు వృద్ధి పొందుతున్నా, పరిశ్రమ వాటిని తక్కువ ధరకి విక్రయించటానికే ప్రయాస పడింది. కెటరింగ్ లాంటి మేధావుల కృషి ఫలితంగానే ఆ అభివృద్ధి కలిగింది.

నేను బ్యూక్ అధ్యక్షుడు, జనరల్ మోటార్సు ప్రథమ ఉపాధ్యక్షుడు అయిన తర్వాత కెటరింగ్ డెల్కో నిర్వహణం ఎవరికైనా వదిలేసి డెట్రాయిట్ వచ్చేయాలనీ ఆతురత పడ్డాను. చార్లే కెటరింగ్ తన గారాబు వ్యాపారాన్నీ, స్నేహితుల్నీ, పొలాన్నీ వదిలేసి డెట్రాయిట్ రాడనీ, అందుకు అతన్ని ఒప్పించలేననీ నా స్నేహితులు చాలా మంది అన్నారు. డబ్బుతో అతన్ని ఎక్కువ ఆశ పెట్టలేనని నాకు తెలుసు. నిజానికి చార్లీ డబ్బు విషయం ఏమాత్రం లక్ష్యపెట్టేవాడు కాదు. కాని చక్కని వుద్యోగమిస్తాననే ఆశ చూపించాను.

"నువ్వే జనరల్ మోటార్సు ఇంజనీరింగు నడిపించగలవు" అన్నాను. వరుసగా యంత్రశాస్త్ర, సాంకేతిక సమస్యలని పరిష్కరించే అవకాశాన్ని యిచ్చాము. అతని కళ్ళు ఆశతో మెరిశాయి. వుద్యోగం అంగీకరించాడు. ఆ తరువాతనుంచీ జనరల్ మోటార్సుకి డెల్కోతోపాటు మరో ముఖ్య సాధనము లభించింది. కెటరింగ్ కంపెనీలో ఒక భాగస్థుడయాడు.

మానవాళి ఉపయోగార్థం, ఆధునిక వ్యాపార సంస్థలని వృద్ధిపరచటంలో పారిశ్రామికులు అత్యుత్తమమైన ఒక సృజనాత్మకశక్తిని

కనిపెట్టారు. ఈ సంస్థలేవీ యింకా పరిపక్వత చెందనిమాట నిజమే. కాని వాటి లోపాలని విమర్శించేముందు అవి యింకా ప్రారంభ దశలో వున్నా యనే విషయం గుర్తుంచుకోవాలి. మానవ సంపదను పెంపొందించటం లోనూ, ఏ మార్గంలోనైనా మానవశక్తుల్ని విస్తరింపజేయటంలోనూ ఈ సంస్థానాధిపతులు చక్కటి నైపుణ్యాన్ని ప్రదర్శించారు. చరిత్రలో ఇటువంటి దెన్నడూ జరగలేదనే విషయం మరచిపోకూడదు.

కెటరింగ్ గొప్ప శాస్త్రజ్ఞుడయాడు. అతను యంత్రాలకి రూప కల్పన చేసేవాడు. ఆ చిత్రాలకోసమే మేమతన్ని వుద్యోగంలో పెట్టు కున్నాము. అంతేకాదు, అతని ద్వారా మా కార్యాలయంలో పెద్ద కార్యాలు నిర్వహించవచ్చు ననుకున్నాము.

జనరల్ మోటార్సులోని కెటరింగ్, లేక-క్రిస్లర్ కార్పొరేషన్‌లోని ఫ్రెడ్ జెడార్‌వంటి మేధావుల కృషి ఫలితంగానే ఒక పెద్ద సంస్థలోని వివిధ సమాచారశాఖలూ వృద్ధిపొందగలుగుతాయి. కాని కెటరింగ్ లాటి వ్యక్తికి తోడ్పడటానికి యింకా ఉత్పత్తి దారులు, వ్యాపారస్తులు, యంత్ర శాస్త్రజ్ఞులు, ప్రకటనదార్లు, లెక్కలేనన్ని యితర వ్యక్తుల తెలివితేటలు కావాలి. ప్రత్యేక నైపుణ్యమున్న అలాటి మేధావులని కలిపి నిర్మాణాత్మ కంగా ఒక సంస్థగా రూపొందిస్తే ఐంద్రజాలన్నే సృష్టించవచ్చు. అమెరి కాలో లాగా విస్తారముగా ఐశ్వర్యమున్న దేశంగానీ, అమెరికను ప్రజల వలె ఆర్థిక స్థోమతవున్న ప్రజలుగానీ ప్రపంచంలో మరెక్కడా లేరు. నిస్సందేహంగా కొద్దిమంది మేధావుల వల్లనే ఈ తారతమ్యం రాలేదు. ఒక పెద్ద వ్యాపార సంస్థలో వివిధ రకాల నిపుణుల మేధస్సు ఉపయోగించే పద్ధతిలోనే ఈ తారతమ్యం ఇమిడివుంది. ఒక సారి డ్యూరెంటుతో యుద్ధ వ్యాపారాన్ని గురించి మాట్లాడాలని ఉబలాట పడ్డాను. వెంటనే డెట్రా యిట్ నుంచి న్యూయార్కు వెళ్లే రైలందుకుని మర్నాటి ఉదయం అతని కార్యాలయంకి వెళ్ళాను.

అతని గదిలో వివిధ వయసులలో వున్న నెపోలియను లాటి వ్యక్తులు కనపడ్డారు. అక్కడినుంచి వెళ్ళిపోవాలనుకున్నాను.

డ్యూరెంటు కార్యాలయంనుంచి వెళిపోయి, వాషింగ్టన్ వెళ్లే రైలెక్కి తిన్నగా ఎడ్వర్డు డీడ్సు కార్యాలయానికి వెళ్ళాను. డెలోక్యాలో కెటరింగ్ స్నేహితుడైన డీడ్సు ప్రస్తుతం హిక్ డిపార్టుమెంటు ఉత్పత్తి దారుడిగా వున్నాడు.

"క్రిస్లర్ ! మాకు బ్యాక్ యంత్రాగారం కావాలి. మేము విమానాల యంత్రాలు నిర్మించి తీరాలి. నువ్వు ఎప్పుడిక్కడికి వచ్చి సాయ పడతావా అని ఎదురు చూస్తున్నాను."

"ఇదిగో వచ్చానుగా"

నేను తిరిగి వచ్చేసిన మూడు గంటలలోపున, 3000 లిబర్టీ మోటార్లు కావాలని ఒక ఉత్తరువు వచ్చింది.

'డీడ్సు నాతో యిలా అన్నాడు "ఇంతకు మూడు నాలుగు నెలల క్రితమే కొన్ని కంపెనీలకి ఉత్తరువు లిచ్చాము. కాని అవి యంత్రాలు తేవటంలో ఆలస్యం చేయటంవల్ల సరిగ్గా ఉత్పత్తి చేయలేకపోతున్నాము. మీరు అంతకంటె బాగా చెయ్యగలరా ?" మా సామర్ధ్యాన్ని సవాలు చేస్తున్నట్లున్నాయి ఆ మాటలు. అందుకని ఆ మాటలు మా సంస్థకి జారీ శాను. కంపెనీలో నా కార్యాలయాలే ఒక నమోదులు వేసే గదిగా తయారయాయి. 24 గంటల జాబితాతో పని ప్రారంభించాము. ఆఫీసులకి మంచాలు తెప్పించుకుని వేళ ఎంతయిందో గూడా తెలీనంత గాఢంగా నిద్రపోయేవాళ్ళం. రెండు వారాలు అసలు ఇంటికే వెళ్ళనట్లు జ్ఞాపకం.

ఈ పనికి క్రొత్త పనిముట్లని ఉపయోగించవలసివచ్చింది. కె. టి. కెల్లర్ అనే యంత్రాధికారి అధీనంలో పనిముట్లున్నాయి. ప్రస్తుతం అతను క్రిస్లర్ కార్పొరేషన్ అధ్యక్షుడు. ప్రథమ పరిచయంలోనే కెల్లర్ మీద నాకు సదభిప్రాయం ఏర్పడింది. పిట్సు బర్గునుంచి మోటారుకారు వుద్యోగం ప్రారంభించేందుకు ఫ్లింటు వచ్చిన కొద్ది రోజులకే అతను నాకు పరిచయమయాడు. అంతకు ఒక నెల క్రితమే అతను జనరల్ మోటార్సు కేంద్ర కార్యనిర్వాహక వర్గంలో ఒక సభ్యుడిగా చేరాడు. ఎక్కువగా కేడరిక్ పనితోనే కాల యాపన చేసేవాడు. అప్పటి కతనికి 27 సంవత్స

రాలు. కాని మోటారు కారు వ్యాపారంలో మంచి అనుభవం సంపాదించాడు. నాలాగే అతనికీ యంత్రాలంటే చాలా యిష్టం. వెస్టింగ్ హౌస్ కర్మాగారంలో నిర్మాణము, ఇంజనీరింగు, నమోదులు వేయటంలో అతను ప్రత్యేక శిక్షణ పొందాడు. అది మా ఇద్దరినీ మరింత సన్నిహితుల్ని చేసింది. 24 సంవత్సరాలకే అతను వెస్టింగ్ హౌస్ మోటారు కారు యంత్రి శాఖకి సహాయ సూపరింటెండెంటు అయాడు. అప్పటినుంచీ స్వశక్తితో జ్ఞానం అలవరచుకుని అనేక వుద్యోగాలు చేశాడు. మోటారు కారు ఇరుసులని తయారుచేసే డెట్రాయిట్ కార్ఖానాకి ముఖ్య తనిఖీ దారుడిగానూ, మెట్జర్ మోటారు కారు కంపెనీ కర్మాగారానికి ముఖ్యాధికారిగానూ పనిచేశాడు. అంతేకాదు; అడుగు చట్టాల పరీక్ష, యితర మరమ్మత్తులు చేస్తున్న హడ్సన్ మోటారు కంపెనీ వుద్యోగం చేశాడు. తర్వాత మాక్స్‌వెల్ కంపెనీ తనిఖీ దారుడిగా కూడా పనిచేశాడు. కెల్లర్‌కి చాలా ధైర్య సాహసాలుండేవి. కాని చిక్కుల్లో యిరుక్కునే వాడు కాదు. అతని పట్టుదల వర్ణించరానిది. నేను వుద్యోగంలోకి తీసుకుంటున్నప్పుడు అతను జనరల్ మోటార్సుని వదిలిపెట్టి ఇండియా పోలీస్‌లోని కోల్ మోటారు కంపెనీలో చేరాడు. నేను బ్యూక్ యంత్రాధికారి అయినప్పుడు అతనికి 30 సంవత్సరాలు కూడా లేవు. అతని వల్లనే మేము లిబర్టీ కార్లని ఉత్పత్తి చేయగలిగాము. ఏ పనిని వప్పగించినా అతను అద్భుతంగా నిర్వహించేవాడు.

కెల్లర్ చాకచక్యం వల్ల పనిముట్లు వేగంగానే తయారయాయి. కాని కొన్ని నిర్మాణ కార్యక్రమాలు యితరచోట్ల జరగటంవల్ల యిబ్బందులొచ్చాయి. ఉదాహరణకి సిలండర్ కాస్టింగ్సుని ఫోర్డు చేసేటట్టు ఏర్పాటు జరిగింది. అంటే ఫోర్డు వాటిని యిచ్చేంతవరకూ మేము యంత్రాలని తయారుచేయటానికి వీలు లేదు. అవి వేగంగా తయారు కావని నాకు భయము వేసింది. సిలండర్ కాస్టింగ్సుని చెయ్యటానికి ఫోర్డు అవస్థ పడుతోందని తెలిసింది. వాటిని మేము సులువుగా చేసేవాళ్ళం. అందుకని ఫోర్డు కంపెనీకి వెళ్ళి హెరాల్డు విల్సన్‌తో ఒక ఒడంబడిక చేశాను. ఆ రోజుల్లో హెరాల్డు ఫోర్డులో ఒక ప్రముఖ పాత్ర వహించేవాడు. ప్రస్తుతం

క్రిస్లర్ కంపెనీలో వున్నాడు. పనిముట్లని లోపరహితంగా తయారు చేయ టమేకాదు, అతనికి రసవాద శాస్త్రం, లోహ పరిశోధనా, కూడా వచ్చు. అతని పరిశోధనవల్ల మా కంపెనీకి అనేక లాభా లొచ్చాయి. వాటిలో మోలో ఉక్కు అనే మిశ్రమ లోహమొకటి వచ్చింది. కాని యుద్ధ సమయంలోని తొందరవల్ల మేము భవిష్యత్తుని గురించి ఆలోచించలేదు. మా సంస్థ అప్పటికింకా ప్రారంభదశలో వుండేది.

"విల్సు! నువ్వు హెడ్ సిలండర్‌లని చెయ్యలేకుండా వున్నావు. మా కవి చెయ్యటం వచ్చు. అందుకని పరస్పరం సిలండర్‌లు అమ్ముకుని వ్యాపారం చేద్దాం" అన్నాను. తయారుగా వున్న పనిముట్లని నాతోబాటు తీసుకెళ్ళాను. హెరాల్డు అ విషయం గురించి హెన్నీ, ఫోర్డుతోనూ కొందరు ప్రభుత్వోద్యోగులతోనూ సంప్రదించవలసి వచ్చింది. కాని ఒడంబడిక ఒక వారంలో పూర్తి చేసి వేగంగా ఉత్పత్తి ప్రారంభించాము. వాషింగ్టన్ వెళ్ళొచ్చిన రెండు నెలలకే లిబర్టీ యంత్రం తయారయింది.

మొదటి ఉత్తరువు ప్రకారం 3000 12- హెడ్ సిలండర్ లిబర్టీ యంత్రాలనిచ్చిన తక్షణమే 8- హెడ్ సిలండర్ విమాన యంత్రాలక మరో ఉత్తరువు వచ్చింది. అప్పటికే యుద్ధానికి కావలసిన చాలా రకాల యంత్రాలని తయారు చేస్తున్నాము. ఇనుప టోపీలు, ఆసుపత్రి సామాన్లు, బండీలు, తొట్టెలూ, యింకా యితర లోహపు పనిముట్లు తయారుచేశాము. ఆలోచించడానికి గూడా వ్యవధిలేకుండా ప్రతిరోజూ బోలెడంత పని చేసేవాళ్ళము.

బిల్లీతో యుద్ధపు వ్యాపారాలని గురించి చర్చించాలనుకున్నా అతనితో సంప్రదించకుండానే ఆ పని సాగించేశాను. అయినా అతని కందుకు కోపం రాలేదు. మేము తీరిక లేనంత పనిలో వున్నామని అతనికి తెలుసు. అతనికీ చాలా పనులుండేవి.

డ్యూరెంటు ఒకసారి పనిమీద నన్ను న్యూయార్కుకి పిలిచాడు. వెంటనే వెళ్ళాను. చాలా రోజులు అతని కార్యాలయం దగ్గిర కాచు కున్నాను. కాని అతనికి నాతో మాట్లాడేందుకు తీరుబడిలేకపోయింది.

అతని బల్ల మీద వరుసగా 8 లేక 10 టెలిఫోనులుండేవి. సగం భూమండలంతో అతను వ్యవహారం పెట్టుకుంటున్నాడా అనిపించింది. గొడ్డులాగా పనిచేసేవాడు. అద్భుతమైన ధైర్యశాలికూడా. వున్నదంతా పోగొట్టుకునే అపాయాన్నయినా ఎదుర్కొనేవాడుగానీ అధైర్యపడి వెనక్కి తగ్గేవాడు కాదు. అతని ఊహాచిత్రంలోవున్న ఒక పెద్ద సంస్థకి సంపూర్ణ రూప కల్పన చేయటానికి ప్రయాసపడేవాడు. అతను ఆజ్ఞాపిస్తే హేమాహేమీలే వచ్చివెళ్ళేవారు. "డ్యూరెంటు కొంటున్నాడా" అంటే చాలు ఆర్థిక రంగంలో ఆ వ్యాపారానికి పేరుప్రతిష్ఠలు వచ్చేవి.

కొంత తెరిపి అయిన తర్వాత ఒక నిముషం అతన్ని చూడగలిగాను. "ఫ్లింటుకి వెళ్ళిపోయి పనిచేసుకుంటే నయమనుకుంటాను ఇక్కడికి తర్వాత రావచ్చు" "లేదు. లేదు. ఇక్కడే వుండు." నాలుగురోజులు కాచుకు నుండి ఫ్లింట్ కి వెళ్ళిపోయాను. ఈ రోజువరకూ న్యూయార్కుకి నన్ను బిల్లీ ఎందుకు రమ్మన్నాడో తెలీదు. ఫ్లింట్ లో నా బాధ్యతతో పోల్చిచూస్తే అతనికింకా పెద్ద బాధ్యతలుండేవని నాకు తెలుసు.

పై సంవత్సరానికి చట్రాలు కొనేందుకు మిల్వీరీ సంస్థతో ఒకనెల పైగా బేరాలు సాగించాము. కొద్ది కొద్దిగా ధర తగ్గిస్తూ ఒక ఏర్పాటుకి వచ్చాము. ఆ వ్యాపారం చెయ్యాలని మిల్వీరీ అధికారులు చాలా తహ తహలాడారు. రాబోయే సంవత్సరాలలోకూడా మేము చట్రాలు కొన వలసివస్తుందని చెబుతూ వారితో ఒక సంతృప్తికరమైన వ్యాపారం సాగించాలని ఉబలాటపడ్డాము. ఒక రోజు ఆ విషయాన్ని గురించే ఆలోచిస్తుంటే కార్యదర్శివచ్చి వ్యాపారస్థుల విందుభోజనానికి వేళయిందని చెప్పింది. బ్యాంక్ అధ్యక్షుడనుగా అవేళ నేను ప్రసంగించవలసివుంది.

యుద్ధకాలంలోనూ, ఆ తర్వాతా ఫ్లింట్ లో ఇల్లు దొరకటం ఒక పెద్ద సమస్యయిపోయింది. మంచి జీతానికీ, పనికీ ఆశపడి కొన్ని వేలమంది పల్లెలనుంచి అక్కడికి వచ్చేవారు. విందులో అవేళ నా సమీపంలో డెల్లా డోర్ట్ కూర్చునున్నాడు. అతను ఫ్లింట్ లో చాలా కాలంనుంచీ వుంటున్నాడు. పూర్వం బండీ వ్యాపారంలో డ్యూరెంటుకి భాగస్థుడుగా

వున్నాడు. ప్రస్తుతం వ్యాపార సంఘానికి అధ్యక్షుడు. "అబ్బాయిలూ! మీకో ముఖ్యవిషయం చెప్పబోతున్నాను" అని డెల్లా ప్రకటన పత్రికకి మళ్లీ ఒక తంతిని చేతితో వూగిస్తూ కేకవేశాడు. అందరూ నిశ్శబ్దంగా కూర్చున్నాక "విలియమ్ డ్యూరెంటు దగ్గరనుంచి ఈ తంతి వచ్చింది. 6,000,000 డాలర్లతో జనరల్ మోటార్సుకి ఈ వూళ్ళో చట్రాలుచేసే యంత్రాగారాన్ని నిర్మించేందుకు ఉత్తరువు యిచ్చాడు."

ఫ్లింట్ వ్యాపారస్థులకు చాలా కోపమువచ్చింది. అందుకు ఒక కారణముంది. ఆ రోజుల్లో ఫ్లింట్ ఆర్థిక పరిస్థితి బాగుండేది. అందుకని అందులో చాలా కోట్ల డబ్బు వారిచేతులమీదుగా దాటిపోయే అవకాశ ముంది. కాని నేను మటుకు చాలామండిపడ్డాను. నేనే ఒక ఎద్దునై. డార్ట్ చూపించిన తంతి ఒక ఎఱ్ఱజండా అయినా నాకు అంత ఆగ్రహం కలిగేదికాదు. బహుశః అతిథుల్ని వుత్సాహంగా వుంచేందుకనుకుంటాను, ఆహ్వానాధ్యక్షుడు నన్ను మాట్లాడేందుకు పిలిచాడు.

కూర్చున్న చోటునుంచే, "చెప్పడానికేమీ లేదు— కాని నేను ఇక్కడుండేంతవరకూ జనరల్ మోటార్సు ఆ వ్యాపారాన్ని సాగించలేదు. ఉద్యోగానికాశపడి ఈ వూరువచ్చిన పురుషులకీ, స్త్రీలకీ ప్రస్తుతం ఇళ్ళ సౌకర్యాలేలేవు. ఇంకో పెద్ద గుంపు ఫ్లింట్ కొచ్చేట్లయితే ఎంత గందర గోళంగా వుంటుందో ఆలోచించండి" అంటూ అక్కడనుంచిలేచి వెళ్ళి పోయాను.

ఆ మర్నాడు డెట్రాయిట్‌లో జనరల్ మోటార్సు సర్వసభ్య సమావేశమొకటి జరిగింది. బిల్లీ నవ్వుతూ ఫ్లింట్‌లో చట్రాల వ్యాపారాన్ని నిర్మించే ప్రస్తావన తీసుకువచ్చాడు. నేను అతని మాటలకడ్డువస్తూ. "ఈ విషయమై నాతో ఎందుకు మాట్లాడలేదు? అలా చేసివుంటే న్యాయంగా వుండేది" అన్నాను.

బహుశః నేను లౌక్యంగాగానీ, మర్యాదగాగానీ మాట్లాడలేదను కుంటాను. కానీ చాలా ఆగ్రహంలోవున్నాను. మనసు నొచ్చుకోవటమే కాదు, నా బాధ్యతలూ నిర్లక్ష్యింపబడ్డా యనిపించింది.

"సంస్థకి కావలసిన..........."

"దీనికి 6,000,000 ఖర్చవుతుందని నీ కెలా తెలుసు?"

"అంచనా ఇదిగో" అంటూ బిల్లీ నావైపు కాగితాల కట్టనితోశాడు. అవసరమొస్తే అతనూ ఆగ్రహపడగలడు.

"అంచనా ఎవరు వేశారు?"

చాలాకాలంగా అతని ఆంతరంగిక స్నేహితుడిగావున్న ఒకడిపేరు చెప్పాడు. అతను కష్టపడి పనిచేసేవాడు. "60 లక్షల డాలర్లు ఖరీదుచేసే ఈ యంత్రాగారాన్ని నిర్మించే ప్రణాళిక నీదగ్గర లేదని పందెం కడతాను." నిజానికి నా సవాళ్ళకి బిల్లీ ఎలాటి సమాధానాలిచ్చాడో జ్ఞాపకంలేదు కాని ఈ వ్యాపారంతో ఇంకా పెద్ద ఎత్తున పథకాలు వెయ్యొచ్చని అతను భావించాడు. అందులోమటుకు సందేహంలేదు.

నేను ఇంకా యిలా చెప్పుకుపోయాను. "ఇది నిర్మించటానికి రెండు సంవత్సరాలు పడుతుంది. నిర్మాణం పూర్తిగా దానంతటదే సాగిపోయే మాట నిజమే. కాని దాన్ని నడపటం తెలియటానికి మూడు సంవత్సరాలు పడుతుంది. ఆ రకం సామర్థ్యమున్న వుద్యోగుల్ని ఒక్క రాత్రిలో సంపాయించలేము. అలాటి యంత్రశాస్త్రజ్ఞులు ఈ ప్రాంతాల్లో దొరకరు. మనం 10 సంవత్సరాలలో చట్టాలు కొనేందుకు చేసే ఖర్చుకంటే దీనికి 5 సంవత్సరాలలో చేసే ఖర్చు ఎక్కువవుతుంది. సంవత్సరానికి లక్షన్నర డాలర్లు ఆదాచేసే పద్ధతిలోనే మనం కొరు విభాగాలని కొందాము. ఇలాగే కొంటుంటే నష్టం రాదుకదా ఏడాదికి 10 లక్షలు మిగులుతాయి. నేను చాలా తీవ్రమైన చర్చలో వుండగా మమ్మల్ని శాంతపరిచేందుకు జొనతాన్ ఎమారో హేస్కెల్ యిలా చెప్పటం మొదలెట్టాడు.

"నువ్వు చెప్పింది సబబుగావుంది వాల్టర్! ప్రస్తుతం నువ్వే ఉత్పత్తి దారుడివి గనుక నీ మాటలు వినాలనుకుంటాను." తర్వాత రాస్కెల్, హేస్కెల్, నేను కలసిన ఒక ప్రత్యేక సంఘాన్ని నియమించమని డ్యూరెంటుకి సూచించాడు. చట్టాల పరిస్థితిని పరిశోధించేందుకూ, ఒక్కసారి చట్టాలు కొనేందుకు చేసే ఖర్చుతో నేను చెప్పినంత మొత్తం ఆదా

చెయ్యవచ్చునేమో చూసేందుకు, ఆ సంఘాన్ని ఏర్పాటు చెయ్యమన్నాడు. బిల్లీ సరేనన్నాడు.

ఇప్పుడా విషయం తల్చుకుని మేము నవ్వేయవచ్చు. కాని అప్పట్లో మటుకు అలా బహిరంగంగా అవమానించినందుకు చార్లీ కి నామీద చాలా కోపమొచ్చింది. బహుశః అతను తన ముఖ్య పథకాలకి నేను అడ్డుతగిలా ననుకునుంటాడు. బహిర్గతం కాని, సాఫల్యం పొందని అనేక విషయాలతో అతని మనసంతా నిండిపోయింది.

తర్వాత బ్రేక్ చట్రాలని తయారుచేస్తున్న ఒక కంపెనీ ముఖ్యాధికారికి కబురుపంపి, సంతృప్తికరమైన ధరకే పెద్ద ఎత్తున చట్రాలు తయారు చేసేటట్లు ఒక ఒడంబడిక తయారుచేశాను. అది అంగీకరించబడింది. దాని ప్రకారం ఆ కంపెనీ అయిదు సంవత్సరాలపాటు చట్రాల పరిమాణాలు హెచ్చిన కొద్దీ ధర తగ్గిస్తూ జనరల్ మోటార్స్ కార్ల చట్రాలని తయారు చేసి యివ్వాలి. ఆ విధంగా అంచనా వేసికోవటం వల్ల క్రితం సంవత్సరం చేసిన ఖర్చులతో పోల్చిచూస్తే, కంపెనీపై సంవత్సరానికి 1,750,000 ఆదాచేసింది. అయిదేళ్ళు పూర్తయిన తర్వాత మరో 5 సంవత్సరాలకి ఆ ఒడంబడికని పునఃప్రారంభించారనుకుంటాను. ఆ తగాదా అయిన కొద్ది నెలలకి జనరల్ మోటార్స్‌తో నా సంబంధం తీరిపోయింది. ఆ తర్వాత బిల్లీ నాతో స్నేహంగానే వున్నాడు. కాని నిజానికి అతన్ని తీవ్రంగా ఎదిరించినందుకుమటుకు నన్ను క్షమించలేదని అనిపించింది.

1919 వ సం॥లో నాకూ డ్యూరెంటుకీ మధ్య కొన్ని వాగ్వివాదాలు జరిగాయి. ఒకసారి విస్కాన్‌సెన్, జెన్వ్సల్లీలోని కంపెనీ గురించి నేను దాఖలు చేసిన సమాచారం విషయమై అభిప్రాయ భేదం వచ్చింది. జనరల్ మోటార్స్ ఆ బండీల వ్యాపారంలో కొంత పెట్టుబడి పెట్టింది. కంపెనీ సామగ్రిని చూసి వచ్చేందుకు నన్ను రాయబారిగా పంపారు. బహుశః వాటి విషయమై నా అభిప్రాయాన్ని లౌక్యంగా తెలియపరచలేదనుకుంటాను.

1919 వ సం॥ వేసంగిలో సర్వసభ్య సమావేశం జరిగింది. అప్పుడు నేనిలా ప్రశ్నించాను. "జెన్‌స్విల్ కంపెనీకి అధిక వ్యయం చేశారు.

నాకు ఆ కంపెనీ గురించి తెలుసు. కంపెనీ మొత్తం చూసి వచ్చాను. కొత్త కార్ఖానా నిర్మిస్తున్న 122 ఎకరాల స్థలం చూశాను. మన కంపెనీ సగం డబ్బుని ఆ వ్యాపారానికి పెట్టడం నాకు ఇష్టం లేదు. ఎందుకనంటే మన డబ్బు తిరిగి రావటానికి చాలా కాలం పడుతుంది. కనీసం 3 లేక 5 సంవత్సరాలు కాచుకోవాలి. ఆ రకం వ్యాపారంలో ఆరితేరిన సంస్థలకే దాన్ని వదిలెయ్యండి."

నేను చెప్పినట్లుగానే కంపెనీ ఆ వ్యాపారంలో చాలా నష్టపోయింది. కాని ఆ సమయంలో ఖర్చుల పట్టీలో వున్న చాలా పద్దులు నాకు నచ్చ లేదు. బిల్లీ గూడా అందులో కొన్ని తనకి నచ్చలేదని చెప్పాడు. అతనితో యిలా వాదించాను.

"ఈ కంఠ శోషంతా ఎందుకను కుంటావ్? ఒక పెట్టుబడి భాగస్థుడిగా నేను మొర పెట్టుకుంటున్నాను. నాకీ ప్రపంచంలో వున్న దంతా ఈ కంపెనీలో పెట్టాను. దాన్ని వదులుకో దల్చుకోలేదు."

సమావేశం తర్వాత హాస్కల్ నన్ను చూట్టానికి వచ్చాడు. "ఇవేళ నువ్వు చాలా ఉద్రేకంగా మాట్లాడావ్. మేమూ అలాగే చేస్తాము. బిల్లీ గూడా అంతే. జరిగినదంతా బిల్లీ నిన్ను మర్చిపొమ్మంటున్నాడు."

"అలాగే."

"రేపు మళ్ళీ వస్తావుకదూ! సమావేశం పూర్తి చెయ్యాలను కుంటున్నాము."

"అలాగే వస్తాను."

వాళ్ళంతా నాతో స్నేహంగా వుండేవారు. ఇప్పటికీ మేము స్నేహితులమే. కాని 1919 వ సం॥లో మా వ్యాపారం చాలా వేగంగా సాగుతూ వచ్చింది. ఆ సంవత్సరం పెట్టుబడి 370,000,000 నుంచి 1,020,000,000 డాలర్ల వరకూ అధికమయింది. అందులో దాదాపు ముక్కాలి వంతు భాగాల్ని యిచ్చేశాము. అయినా వ్రాత మూలకంగా చూస్తే కంపెనీకి లక్షకోట్ల డాలర్లున్నాయి. కంపెనీ వైశాల్యాన్ని పెంపొం దించటానికే నా అభిప్రాయాలూ, ఆరోపణలూ తోడ్పడ్డాయి. ధూమ

యంత్రం వ్యాపారమే గాక యింకా అనేక రకాల నిర్మాణాత్మక వ్యాపారాలన్నీ కంపెనీ సాగించింది. ఉత్పత్తికి కావలసిన వివిధ వస్తువులనీ. యితర పద్దులనీ కంపెనీయే స్వయంగా తయారు చేసేది. మేము కొత్త కార్ఖానాలనీ, ఉద్యోగస్థుల ఇళ్ళనీ నిర్మించేవాళ్ళం. కంపెనీ 20.000 000 డాలర్లు ఖరీదుచేసే ఒక కార్యాలయాన్ని నిర్మించటం మొదలెట్టింది. ఇంకా ఇతర వస్తువులని కొనటం, ఒక్కొక్క శాఖకీ పై సంవత్సరానికి రాబడి, ఖర్చులు లెక్కవేయటం చూస్తుంటే కంపెనీ మొత్తం దివాలా తీస్తుందేమో- అనిపించింది. దాని ఆదాయానికి సగం బిల్లీయే కారణం. కాని మేము సంపాయించగలిగిన దానికంటె అధికంగా కంపెనీ వ్యయం చేస్తూ వచ్చింది. అందుకని "బిల్లీ! నా పని పూర్తయింది." అంటూ అక్కడ నుంచి వెళ్ళిపోయాను. ఆల్‌ఫ్రెడ్ స్లోన్ అనే వ్యక్తి డ్యూరెంటికి హయట్ రోలర్ బేరింగ్ కంపెనీని విక్రయించి, దాని ఆధారంగా వున్న మరో కంపెనీకి అధ్యక్షుడయాడు. ఆల్‌ఫ్రెడ్, మరొకతను నన్ను చూట్టానికి వచ్చారు. నేను వుండిపోయేట్లు చేసేందుకు ప్రయత్నించారు.

"లేదు. నాకు దీని జోలివద్దు. ఈ కంపెనీ నడిచే విధానాన్ని నేను భరించలేను. ప్రస్తుతం పెట్టుబడిలో నా భాగాలని విక్రయించాలనే ఆదుర్దా తప్ప నాకు మరో చింతలేదు."

మళ్ళీ హాస్కల్ నన్ను చూట్టానికి వచ్చాడు. అతను చాలా మర్యాదస్తుడు.

"వాల్ట్! ఫ్రాన్సులో సిట్రన్ యంత్రాగారాన్ని కొంటున్నాము. వ్యాపారం చేసేందుకు కావలసినన్ని నాణ్యాలనీ కొన్నాము. త్వరలోనే వ్యాపారం ప్రారంభిస్తున్నాము. ఆ వస్తువులనిచూసి యంత్రశాస్త్రరీత్యా ఒక అభిప్రాయాన్ని వెల్లడించేందుకు నువ్వు అక్కడికి వెళ్ళాలి."

"మీకు తెలుసా! నేను వుద్యోగానికి రాజీనామా పెట్టాను. జనరల్ మోటార్స్‌కి నేను ఏవిధంగానైనా సాయపడగలిగితే వెళ్ళాలనుంది. కాని నేను వుద్యోగం మానేస్తున్నానని మటుకు మీరు తెలుసుకోవాలి."

"ఆ విషయం గురించి తర్వాత మాట్లాడదాం" అన్నాడు హాస్కెల్.

"పడవలో ప్రయాణం ఎలా వుంటుంది?"

"నువ్వు ఎలా ఊహించుకుంటే అలా వుంటుంది. పద వాల్ట్."

డెల్లాకి ఆ విషయం చెబితే "యూరప్‌కి వెళ్ళాలని చాలా రోజుల నుంచి అనుకుంటున్నాను. మీరు వెళ్ళేట్లయితే నాకూ రావాలనివుంది" అన్నది.

"అలాగే. నేను వెళితే నువ్వూ వొద్దువుగాని."

ఆ విషయం హాస్కెల్‌తో చెప్పాను. "మనకి పాసుపోర్టు లెలా వస్తాయి?" అనడిగాడు. నేను మాట్లాడక వూరుకున్నాను. ఆ సమస్య అతనికి వదిలేశాను.

నాకూ నా భార్యకే కాదు హాక్,- స్లోన్, కెటరింగ్ కంపెనీ ఉపాధ్యక్షుడు చార్లెస్ స్టీవర్ట్ మోట్ భార్యలకీ అతను పాసుపోర్టులు ఏర్పాటుచేశాడు. ఛాంపియన్ స్పార్క్ ప్లగ్ కంపెనీకి ముఖ్యాధికారి ఆల్బర్టు ఛాంపియన్ కూడా మా గుంపులో వున్నాడు. అతను ఫ్రెంచి దేశస్థుడు. ఫ్రెంచి మాటాడేవాడు.

పడవలో వెళుతూ కంపెనీలో నేను వుండటం గురించే చాలా సార్లు మాట్లాడుకునేవాళ్ళం. అందరిలోకి హాక్కే నన్ను ఎక్కువ వొత్తిడి చేయటానికి ప్రయత్నించాడు. అతను చాలా విచిత్రమైనవాడు. "బిల్లీ అభిప్రాయాలతో ఏకీభవించటానికి రెండు మూడుసార్లు ప్రయత్నించాను. బహుశః అతని భావాలు సరియైనవై యుండొచ్చు. కాని నేను వెళ్ళి పోతున్నాను. మోటారుకారు వ్యాపారంలో ఇన్ని సంవత్సరాలు ఇంత కష్టపడి పనిచేసుకుండావుంటే నేను సాధించినదంతా వ్యర్థమైపోవటం మానివుండేనాన్ని కాదు అన్నాను."

ఆ పడవ ప్రయాణం చాలా సరదాగావుంది. ఓడలోనూ, హోటలుకీ, విహారాలకీ వెళ్ళినప్పుడూ నా భార్యా, స్లోన్ భార్యా బాగా సన్నిహితు లయారు. వారు ఇప్పటికీ స్నేహితులుగానే వున్నారు.

స్ట్రిటన్ కంపెనీ ప్రతి అంశాన్నీచూసి, 15 లేక 20 పైపు కాగితాలలో నా అభిప్రాయాన్ని వెల్లడించాను. సూక్ష్మంగా చెప్పా లంటే అందులో యిలా వ్రాశాను. "ఈ కంపెనీ కొనటంలో మీరు చాలా పొరబాటు చేస్తున్నారు. అమెరికా ప్రమాణాల ప్రకారం ఈ పాత కంపెనీని నవీనవంగా తయారుచేయాలి. ఆ వ్యయంతో మన పరిమాణము - ఉత్పత్తి విధానంతోనే ఒక కొత్త కంపెనీని నిర్మించవచ్చు. అంతే కాకుండా ఫ్రాన్సులో వ్యాపారం సాగేందుకు పరిస్థితులు అనువుగా లేవు." నేను రాసినదానిఫలితంగా కంపెనీ స్ట్రిటన్ కొనకూడదని నిశ్చయించింది. ఈలోపు ఫ్రాంకులకంటె డాలర్ల విలువ హెచ్చింది. అందువల్ల కంపెనీ మా ప్రయాణంలో 140,000 లాభం చేసుకుందని విన్నాను.

1919 వ సం॥లో బ్యూక్ అధ్యక్షుడినేగాక జనరల్ మోటార్సు ఉపాధ్యక్షుడనయాను. నా తర్వాత హిక్కీ బసట్ బ్యూక్ కార్య నిర్వాహకుడయాడు. అతను చాలా సమర్థుడు. 1916 వ సం॥లో ఎస్టటిన్ మోట్ కంపెనీ బ్యూక్‌తో కలసినప్పుడు, అతను వుద్యోగంలో చేరాడు. అప్పట్లో నాకు సహాయకుడిగా వున్నాడు. నాతోపాటు అతనికీ పై వుద్యోగాలు లభించాయి. నేను రాజీనామా యివ్వగానే అతను బ్యూక్ అధ్యక్షుడు, జనరల్ మోటార్సు ఉపాధ్యక్షుడయాడు. 1926 వ సం॥లో అతను మరణించాడు. అది కంపెనీకి తీరని లోటు కలిగించింది.

డ్యూరెంటుకీ, పెరీ డ్యూపాంటుకీ వ్యాపారంలో నా భాగాల్ని వదులుకోవటం యిష్టం లేకపోయింది. అందుకని నాతో బేరాలు ప్రారంభించారు. నేను రాజీనామా యిచ్చిన 2 లేక 3 నెలల్లో అనుకుం టూను ఆ వ్యవహారం పూర్తయింది.

అప్పటికి నాకు 45 సంవత్సరాలు. వుద్యోగంనుంచి విరమించుకుం టున్నానని నా భార్యతో చెప్పాను. భవిష్యత్తుని గురించి ఏరకం ఆలోచనలూ చెయ్యలేదు. కాని అన్నేళ్ళు పూర్తి వుద్యోగంలో లీనమై పోవటంవల్ల అంతరంగిక వ్యవహారాలని అలక్ష్యంచేశాను. పెట్టుబడి సమస్య వుండటంవల్ల డెట్రాయిట్‌లో ఒక కార్యాలయం స్థాపించాలను

కున్నాను. నిజానికి నేను వుద్యోగం విరమించుకున్నాను. మునపటి చిలిపితనం, ఉత్సాహం మాయమయ్యాయి.

అలవాటు ప్రకారం ఉదయం 6 గంటలకి మెళకువవచ్చేది. 65 మైళ్ళు కార్లో డెట్రాయిట్ వెళ్ళి, కార్యాలయంలో కాస్సేపు కూర్చుని మళ్ళీ రాత్రి ఫ్లింట్ కి వచ్చేవాణ్ణి. వారానికి 4, 5 రోజులు అలా చేసేవాణ్ణి. మిగతా సమయంలో ఇంట్లోనే వుండేవాణ్ణి. పూర్వం నా దగ్గిర పనిచేసిన వారూ, ఎల్లిస్ దుకాణాల్లో పనిచేసినప్పుడు పరిచయమైన చిన్నప్పటి స్నేహితులూ నన్ను చూట్టానికి వచ్చేవారు. ఒక కొత్త హోటలు నిర్మించ దలచుకుంటే చందాదారుల పట్టీలో నా పేరు ముందువుండేది. కొత్త గోల్ఫుఆట ప్రారంభమైతే సర్వసభ్యుల్లో నేను వుండేవాణ్ణి. తీరుబడిగా వున్న సమయంలో తలుపుబైట బంట్రోతు లేకుంటే అలాటి సంఘటనలు అధికమయేవి. పైకి మటుకు మిగతావాళ్ళతోనే నాకు ఎక్కువ పరిచయమున్నట్లు కనబడేది. ఇల్లంతా పొగాకుతో నిండిపోయిందని నా భార్య చెప్పేది. ఎప్పుడూ ఇంటినిండా మగవాళ్ళు కూర్చుని మాట్లాడుతుండేవారు. ఆమె అది భరించలేకపోయింది. చివరికి నాతో యిలా అంది.

"మీరు పనిలోకి వెళితేనే బాగుండును. ఇది ఇల్లులాగాలేదు. మగవాళ్ళ గుంపున్న రైలుస్టేషనులాగా వుంది."

నేను పెద్దగా నవ్వాను. ఆమె మొదటిసారి ఆ మాట అన్నది. నేను మనసు మార్చుకుంటే మాట వెనక్కి తీసినట్లుండదు. ఎలా అనుకుంటే అలా జరగవలసిందే.

"ఏమిటో తెలుసా? నేను తిరిగి పనిలోకి వెళతాను" అన్నాను.

1920 వ సం॥లో విల్లీస్ - ఓవర్ లాండ్ కంపెనీ అధ్వాన్న స్థితిలో వుండడంవల్ల బిల్లీ చిక్కుల్లో యిరుక్కున్నాడు. ఆ సంవత్సరం కంపెనీ ఉత్పత్తిచేస్తున్న కార్ల కొనుగోలు శక్తి తగ్గిపోయింది. కాని 1918, 1919 వ సం॥లలో యంత్రసామగ్రి దొరకటం కష్టమైపోవటం, కార్లు సులభంగా అమ్ముడుపోవటం జరిగాయి. వ్యాపారం బాగా సాగే ఆశాజనకమైన పరిస్థితి ఏర్పడింది. అందువల్ల 1920 వ సం॥లో లెక్కలేనన్ని

బండీలు, చక్రాల ఇనుపకమ్మీలు. యితరభాగాలు. యింకా కొత్త యంత్రపు పనిముట్లు నిర్మించేందుకు వ్యాపార ఒడంబడికలు జరిగాయి. విల్లీస్ కి టొలెడో, ఎల్మిరా, యింకా యితర ప్రదేశాలలో యంత్రాగారాలున్నాయి. ఇవన్నీగాక న్యూజెర్సీ, ఎలిజబత్ లో ఒక కొత్త యంత్రాగారాన్ని నిర్మిస్తున్నాడు. కాని అతని కంపెనీ చిక్కు పరిస్థితిలో యిరుక్కుంది. బ్యాంకివాళ్ళు కంపెనీకి యిచ్చిన పెట్టుబడిని తిరిగియిచ్చేయమన్నారు. అది మొత్తం 50,000,000 డాలర్లకంటె ఎక్కువేవుంటుంది.

బ్యాంకివారు ఒక సభని నియమించి నా దగ్గరకి పంపారు. అందులోని సభ్యులలో నేను మొదట కారు కొనేందుకు అప్పుయిచ్చిన పాత స్నేహితుడు వాక్ వచెక్ కూడా వున్నాడు. జాన్ విల్లీకి ఫ్లింట్ లో రంగులుపూసే కంపెనీ ఒకటి వుండేది. అందుకని నాకు బ్యూక్ లో వుద్యోగమైన తొలిరోజులలోనే అతనితో పరిచయమైంది. అనేకమారు నన్ను అతని దగ్గరకివచ్చి పనిచేయమనడిగాడు. డ్యూరెంటు నన్ను బ్యూక్ అధ్యక్ష్యుణ్ణిచేసి, అరలక్ష డాలర్లదాకా నా జీతం అధికంచేశాక, జాన్ తన ప్రయత్నాలు మానుకున్నాడు. నేను ఎలాగో యిక బ్యూక్ ని వదిలి పెట్టనని అతను తెలుసుకున్నాడు. ప్రస్తుతం విల్లీస్ ఓవర్ లాండ్ సమస్యలో యిరుక్కోవటం నాకేమాత్రం యిష్టంలేకపోయింది. 'బ్యూక్ ని వృద్ధిచేయుటంలో నేను కృతకృత్యుడనయాను. చాలా కీర్తి సంపాయించాను. అందుచేతనే తతిమ్మా వాళ్ళు వాళ్ళ డబ్బు కాపాడటానికి నన్ను సాయపడమంటున్నారు. బహుశః అందులో నేను కృతకృత్యుణ్ణి కాకపోతే అది నా పేరుకి కళంకం తెచ్చిపెడుతుంది.' వెచక్ తో, విల్లీతో అలాగని వాదించాను. కాని కీర్తి ప్రసంగం తీసుకువచ్చేసరికి, నేను పనిలోకి వెళ్ళవలసిన అవసరం లేదనీ, అటువంటి పక్షంలోనే నష్టమొస్తుందనీ వాళ్ళు వాదన వేసుకున్నారు. అప్పుడు సంవత్సరానికి లక్ష డాలర్లు చొప్పున రెండు సంవత్సరాలు వుద్యోగం చేసేట్లు ఒక ఏర్పాటుచేశాను.

ఏదో ఒక వైపరీత్యం జరుగుతేగానీ బ్యాంకివారు వారి డబ్బు తిరిగి రాదనుకున్నారు. అందుకని నా నిబంధలని అంగీకరించామని జాన్ తో

చెప్పారు. అంతే కాదు; నేను పట్టుపట్టడం వల్ల కంపెనీ అధికారమంతా నాకే యిచ్చేందుకు ఒప్పుకున్నారు. జాన్ పదవి అలాగే వుంటుంది. కాని నేను అతని సలహాదారుడనుగా నియమింపబడ్డాను. నన్ను ఎగ్జిక్యూటివ్ ఉపాధ్యక్షుణ్ణి చేశారు. ప్రాతికోతలు పూర్తయిన తర్వాత పనికి వెళ్ళాను. మితివ్యయం చెయ్యాలనే విషయం కంపెనీలో అందరికీ సుస్పష్టమైంది. మొదట బాల్టిమోర్లో వుండేవాణ్ణి. తర్వాత కల్లటక్ హౌస్‌లో ఒక వాటా అద్దెకు తీసుకున్నాను.

ఉద్యోగంలో చేరిన వెంటనే ఒక రోజు జాన్ కార్యాలయంలోకి వెళ్ళాను. అతని కార్యాలయం పెద్ద భవంతికి మల్లే వుండేది. సైకిలు వ్యాపారం ప్రారంభించినప్పటినుంచీ అతను జల్సాగానే వుండేవాడు. అతని గదిలో బంగారంతో అలంకరింపబడిన ఒక పెట్టెదాంట్లో ఖరీదైన పొగచుట్టలున్నాయి. జాన్ నన్ను ఆ పెట్టె దగ్గరకి తీసుకెళ్ళి, మూతి తెరిచి, ఒక చుట్టని తీసుకోమని బలవంతించేశాడు. 50 సెంట్లు ఖరీదుచేసే చుట్ట తీసుకుని వెలిగించాను. చుట్ట కాలుతుంటే యిలా అన్నాను, "జాన్! నీ జీతం తగ్గించటానికి వచ్చాను." అప్పటికలను సంవత్సరానికి 150,000 డాలరు సంపాయిసునా.

"ఇదేమిటి వాల్ట్!" నటుడు తన మాటలు ఇంకోడు చెబుతుంటే చూసినట్లుగా నాకేసి చూశాడు జాన్.

"సంవత్సరానికి 75,000 డాలర్లకి నీ జీతం తగ్గించేశాను."

తలను కొద్దిగా ఆడించి, నవ్వుతూ జాన్ యిలా అన్నాడు. "బహుశః మా సమస్యలన్నీ సమర్థుడిచేతిలోనే పెట్టామనుకుంటాను."

నేను అంగీకరించినది చాలా కష్టమైన పని. ఆ విషయం జాన్‌కీ తెలుసు. జాన్ లేనప్పుడు కంపెనీ బాధ్యతారహితంగా తయారయింది. సక్రమమైన నిర్వహణలేకుంటే అనేకరకాల అనర్థాలు ప్రారంభమవుతాయి. నాకు తెలిసినంతవరకూ, ఆ రోజుల్లోని ఆర్థిక పరిస్థితివల్ల కలిగిన నష్టం మోటారు కంపెనీలన్నిటికీ అవగతమైంది.

నిజానికి యుద్ధకాలంలో మోటారు కార్లకి పోటీలేకపోవటం, ఆదాయం హెచ్చటం మూలాన విల్లీస్ కంపెనీ దెబ్బతింది. కంపెనీ వుద్యోగుల్ని ఐశ్వర్యం బాధ్యతారహితుల్ని చేసింది. అదే ఇంకో మంచి కంపెనీలో అయితే విడ్డూరంగా చెప్పుకునేవారు. విల్లీస్ ఎక్కువకాలం అక్కడ వుండేవాడుకాడు. అతని క్రింది వుద్యోగులు విఱ్ఱవీగటం మొదలెట్టారు. మా కంపెనీల్లో అయితే, అవసరమైన ఖర్చులేవో అనవసరమైన ఖర్చులేవో బాగా తెలిసివుండేవి. ఉద్యోగులు ఖర్చుకిచ్చిన డబ్బుని దుబారా చేసేవారు. కాని కంపెనీకి మేము చేసిన పెద్దసాయమల్లా చక్రాల కమ్మీల దగ్గరనుంచీ బండీలవరకూ ఉత్పత్తినంతా విభాగాలు చేసేశాము. అందువల్ల ఒడంబడికల ప్రకారం వ్యాపారం సాగించటం సులభమయింది. బ్యాంక్‌లో గడించిన అనుభవంవల్ల బ్యాంక్ వుద్యోగస్థుడికంటే నాకు ఆ విషయాలు బాగా తెలుసు. న్యాయానికి యాంత్రిక నిర్మాతలు ఒక పత్రికని రద్దుచేయటాని కంగీకరించినా, భావిలో ఇంకా పెద్ద ఉత్తరువులువచ్చే అవకాశముందని గ్రహించాను. చివర్లో వున్న భాగాదారుడిగా ఒడంబడికని రద్దు, అతన్ని నాశనంచేయటం ఏమంత మంచి వ్యాపార పద్ధతి కాదని తెలుసుకున్నారు. అంతే కాకుండా నాతో వ్యవహారం చేస్తున్నా రద్దుచేయటంవల్ల ఇబ్బందులొస్తాయని అబద్ధాలు చెప్పి లాభంలేదు. ఆ విషయం వ్యాపారస్థులకి తెలిసిపోయింది. విల్లీస్ - ఓవర్ లాండ్ కంపెనీలో యంత్రపు భాగాలు తయారవుతున్న స్థలాలన్నీ తిరిగాను. సరకునిస్తున్న వారితో గొంతు బొంగురుపోయేంతవరకూ టెలిఫోనులో మాట్లాడాను. వాదించాను. మంచి మాటలతో నావైపు త్రిప్పుకున్నాను. కొద్దినెలల్లో కొన్ని డాలర్లు కంపెనీ ఋణం తీర్చేశాను.

విస్తారమైన ఆ పెద్ద కంపెనీలో కార్యనిర్వాహక వర్గంవారి దృష్టిని పడకుండా అనేక విషయాలు జరుగుతుండేవి.

ఒకరోజు వ్యాపారాన్ని గురించి ఆలోచిస్తుంటే కార్యదర్శి వచ్చి "మీ కోసం ఒక సైనిక వుద్యోగి వచ్చాడు" అని అతని పేరు చెప్పింది.

నాకు అతను బాగా జ్ఞాపకమున్నాడు. యుద్ధం జరిగినప్పుడు వాషింగ్‌టన్‌లో అతన్ని కలుసుకున్నాను. ఎఱ్ఱని జుత్తుతో. భీకరమైన

చూపుతో మొరటుగా వుండేవాడు. ఒకసారి ఫిరంగి గుండ్లు వ్యాపారం విషయములో 3 రోజులు అతనితో హోరాహోరీ పోట్లాడాను. అప్పుడు నేను వ్యాపారస్థుడిగా వున్నాను. అతను సైనికోద్యోగి. వ్యాపార ఒడంబడిక నేను అమలు జరపాలన్నాను. అతను అక్ఖరలేదన్నాడు. ఎన్నివిధాల చర్చించినా అతన్ని లొంగదియ్యలేకపోయాను. చివరికి అతని కార్యాలయం నుంచి వెళిపోతూ, చనువుగా యిలా అన్నాను

"నాకు కాకపోతే మరొకరికి ఈ ఒడంబడికను తక్కువ వ్యయానికి ఇయ్యి. కాని ఒక్క విషయం చెప్పవలసివుంది. నువ్వు చాలా చురుకైన వాడివి, తెలివైన వాడివీను"

"థాంక్స్ మిస్టర్ ?"

"యుద్ధం పూర్తయాక, నీ కెప్పుడైనా వుద్యోగం కావలసివస్తే తప్పకుండా నా దగ్గిరకి రా. తీసుకుంటాను."

యుద్ధం పూర్తయింది. సైనిక దుస్తులలో ఆ సేనాధిపతి నా కార్యాలయంలోకి వచ్చి నిలబడ్డాడు. గుమ్మంలో అడుగు పెడుతూనే "నేను జ్ఞాపకమున్నానా ?" అనడిగాడు.

"జ్ఞాపక ముండటమా ! నిన్ను ఎన్నటికైనా ఎలా మర్చిపోవటం ?" అంటూ ఆపేక్షగా బుజం తట్టాను. అతను నవ్వాడు.

"నా కెప్పుడైనా వుద్యోగం కావలసివస్తే ............."

"ఎంత జీతం కావాలి ?"

"సంవత్సరం నుంచీ రబ్బరు వ్యాపారం చెయ్యటానికి ప్రయత్నించి, వున్న డబ్బంతా పోగొట్టుకున్నాను. జీతం మీరే నిర్ణయించండి."

"నిన్ను వుద్యోగంలో పెట్టుకుంటాను."

తక్షణమే అతన్ని ముఖ్య క్రయ ప్రతినిధిగా పెట్టుకున్నాను. అతన్ని గురించి నాకు మూడు విషయాలు తెలుసు. అతను నిజాయితీ పరుడు. విశ్వాస పాత్రుడు, సామర్థ్యమున్నవాడు. ఎవరి దగ్గిరనుంచైనా నేను కోరేది అదే. ఆ శక్తి సమర్థత లేకపోయినా సరే నేను లక్ష్య పెట్టను. అనుభవం

ద్వారా దాన్ని పెంపొందించవచ్చు. నిజాయితీ పరుడు, విశ్వాసపాత్రుడు కాని పక్షంలో నేను ఎవరితోనూ సంబంధం పెట్టుకోను.

మొట్టమొదట సైనికోద్యోగంలో కన్నా కష్టమైన పనిని అతనికి వప్పగించాను. జీతాల పట్టీలో అతని పేరు స్థిరపరిచాను. ఆ తర్వాత మూడు రోజులకి అతనికి కబురు పంపాను. ఒక కంపెనీ పేరిచ్చి, అది ఏ వూళ్లో వుందో, అందులో ఏం జరుగుతోందో చెప్పి. "అదంతా చాలా అధ్వాన్నంగా వుంది. అక్కడికి వెళ్ళి 6 వారాలో లేక ఒక నెలో వుండు. తిరిగి వచ్చి కంపెనీ లోపమేమిటో చెప్పు" అన్నాను.

"బాగుంది. ఆ వ్యాపారాన్ని గురించి నాకు పూర్తిగా ఏమీ తెలియదు. అందుకని ఈ పని సరదాగా వుంటుంది."

"నాకు తెలిసినంతా నీకూ తెలుసు. ఇంకా కొన్నేళ్ళు పోతే యింకా ఎక్కువే తెలుస్తుంది. నేను చెప్పేదల్లా కంపెనీ సరిగ్గా లేదు. నీకు చాతనయినప్పుడు అది ఎందుకలా వుందో తెలియాలి."

కొద్ది రోజులకి ఆ కంపెనీ అధ్యక్షుణ్ణి తీసేసి అతని స్థానంలో సేనాధిపతిని నియమించాను. అతని ఆధ్వర్యంలో కంపెనీ చక్కగా నడిచిపోయింది. అతను వ్రాసి యిచ్చిన సమాచారం నేను చూడలేదు. కాని అతను కంపెనీ లోపాలని చాలా మటుకు కనిపెట్టాడని తెల్సుకున్నాను. ఆ తర్వాత క్రిస్లర్ కంపెనీలో డాడ్జ్ కలసిన తర్వాత అతను కంపెనీ ముఖ్య వ్యయ ప్రతినిధి అయాడు. కంపెనీకి కొన్ని లక్షల డాలర్లు వ్యయం చేసేవాడు. 1917 వ సం॥లో లాగే 1936 సం॥లో కూడా అతను చురుకుగా వుండేవాడు. 1929 సం॥ తర్వాత క్రిస్లర్ కంపెనీ బండి వ్యాపారాన్నీ, యితర విభాగాలనీ సహాపుతుండేవాడు. అతను ఎటువంటి పనైనా చెయ్యగలిగేవాడు.

ఎ. సి. డన్‌నీకి వుద్యోగమిచ్చినప్పుడు నా మనసులో రూపొందిన భావాల్ని నా స్నేహితుల్లో ఎవరైనా వివరించగలరు. నిజాయితీపరులు, పూర్తి విశ్వాసమున్న వారితోనే నాకు పనిచేయాలని వుండేది. ఫ్లింట్ నుంచి న్యూయార్కుకి వెళ్ళిన రోజునుంచే నా సంకల్పానికి కావలసింది మనుష్యులు

అని తెలుసుకున్నాను. ఫ్లింట్ వదలి వెళ్ళినప్పటి నుంచీ నా మనసులో కెల్లర్ విషయం బాగా నాటుకు పోయింది. నా తర్వాత ఆ యువకుడికే ఉత్పత్తి పని చేతనవును. అయినా కెల్లర్‌నీ, ఇంకా అక్కడున్న వారిని గురించి గానీ నేను ఎక్కువగా ఆలోచించలేదు. నేను ఒక్క పనిమటుకు చెయ్యకుండా వుండవలసింది. ఒక కంపెనీని నిర్మించటానికి మరో కంపెనీని నాశనం చెయ్యకుండా వుండవలసింది. విశ్వాస పాత్రుడిగా అంగీకరించిన ఏ పనైనా బాధ్యతాయుతంగా చేసేవాణ్ణి. భావిలో నేను ఎటువంటి వుద్యోగం చేసినా ఫ్లింట్‌లో లాటి వ్యక్తులు నాకు మళ్ళీ లభించరు. వారి స్వభావమూ, సామర్థ్యమూ, సాహచర్యమూ మరెక్కడా నాకు కనుపించదు. వారిని పోలిన వ్యక్తులకోసం నేను తప్పక తహతహ లాడుతానని నాకు తెలుసు. అయినా బ్యూక్‌లో వున్న కార్మికులనే నేనెప్పుడూ పనిలో పెట్టుకునేవాణ్ణి. రోజులు గడిచినకొద్దీ అందులో చాలామంది నన్ను చూట్టానికి వచ్చి వుద్యోగాలడిగేవారు. వాళ్ళకి వుద్యోగాలివ్వాలని ఎంతో అనిపించినా, "అక్కడే వుండటం నయం, మంచి వుద్యోగంలో వున్నారు. ఇక ముందు నా కంపెనీ ఏమవుతుందో చెప్పలేను" అనేవాణ్ణి. ఎక్కువ చాకచక్యమున్న వారితో మటుకు యింకా యిలా అనేవాణ్ణి. "కాని మీకు ఎప్పుడు వుద్యోగాలు పోయినా నన్ను వచ్చి చూడండి. చూట్లాడుకుందాం"

కాని ఫ్లింట్ వదలిన మొదట్లో యింకా బైట వాళ్ళని కొందర్ని కల్పుకున్నాను.

విల్లీస్ కంపెనీ ఒక విమాన యంత్రాగారాన్నీ, పంటకోసే యంత్రాల కంపెనీని, యితర చిల్లర వ్యాపారాలని ప్రారంభించింది. వాటివల్ల ఏమీ ప్రయోజనం వుండేది కాదు. కాని కంపెనీ మోటారకార్లకంటె విమాన యంత్రాలు, కోతకోసే యంత్రాలు చాలా నయమనిపించేవి. వ్యాపారం నిలబడాలంటే కంపెనీ యింకా మంచి కార్లని నిర్మించవలసి వుంది. ఎలిజబత్‌లో వున్న యంత్రాగారం యింకా పూర్తి కాలేదు. ఆ పెద్ద కంపెనీకి కొందరు బ్యాంకివాళ్ళు చాలా డబ్బు వ్యయంచేశారు. కాని కంపెనీ అమ్ముడుపోయేంతగా ఏమీ నిర్మించలేకపోయింది. ఒక కొత్త

కారుని నిర్మించటానికి జాన్‌తో అంగీకరించాను. ఆ విధంగానే జెడార్, స్కెలిటన్, బ్రీర్‌లని కల్సుకోవటం జరిగింది.

ఫ్రెడ్. ఎమ్. జెడార్, ఓవెన్ స్కెలిటన్. కార్ల బ్రీర్‌లు ముగ్గురూ మోటారుకారు ఇంజనీర్లు, యువకులు, మేధావులు. కట్టుకథలోని త్రీ మస్కటీర్సు తప్ప సామాన్యంగా వాళ్ళంత అన్యోన్యంగావున్న స్నేహితులు ఎక్కడా కనుపించరు.

జెడార్ మెకిగామ్ విశ్వవిద్యాలయంలో పట్టభద్రుడై, 1909 వ సం॥లో స్టూడీబేకర్ కార్పొరేషన్‌లో ముఖ్య ఇంజనీరు అయాడు. అప్పుడే అతను బ్రీర్‌ని కల్సుకోవటం తటస్థించింది. అప్పటికి బ్రీర్ లెలండ్ స్టాఫర్డు జూనియర్ విశ్వవిద్యాలయంలో చదువు ముగించి విల్లీస్ - చలమర్సులో తర్ఫీదు ప్రారంభించాడు. స్కెలిటన్ ఓహియోస్టేట్ విశ్వ విద్యాలయంలో ఇంజనీరింగు పట్టభద్రుడై పాకడ్ కంపెనీలో నమూనాలు వేస్తుండేవాడు. యంత్రాలని మార్చటములోనూ, ఇరుసుల పనిలోనూ నిపుణుడని పేరు తెచ్చుకున్నాడు. 1905 వ సం॥లోనె పోన్‌టీలెడా కంపెనీలో వుద్యోగం సంపాయించాడు. జెడార్ వీళ్ళిద్దరినీ స్టూడీబేకర్ ఇంజనీరింగు శాఖలోకి తీసుకువచ్చాడు. అక్కడ 1920 వ సం॥ వరకూ ముగ్గురూ పనిచేశారు. మోటారుకారు నమూనాలు వేయటంలో వాళ్ళు అఖండులని నాకు తెలుసు. ఎలిజబత్ యంత్రాగారంలో ఒక మూలను విభజించి వారికిచ్చాను. అందులో క్రొత్త కారు నమూనా వేసేందుకు ఏర్పాటుచేశాను. మేము మొదట ఉత్పత్తి చేయాలనుకుంటున్న యంత్రంతో విల్లీస్ కంపెనీ పూర్తి నాశనమైపోతుందని, దాని బదులు మరో కారుని నిర్మించదలచాను. ఆ తర్వాత తరుచు న్యూజెర్సీకి వెళ్ళేవాణ్ణి. పరస్పరం మాట్లాడుకోకుండానే ఆ ఇంజనీర్లు ఒకరినొకరు అర్థంచేసుకునే వారు. అన్నిటికంటె ఆశ్చర్యకరమైన విషయం వాళ్ళు నన్నూ అర్థం చేసుకునేవారు. ఒకొక్కప్పుడు కంపెనీ సమస్యల్ని క్రొత్త మరలతోనూ, రంగుపూతతోనూ పరిష్కరించవచ్చుననుకునేవాడు విల్లీస్. నేనుమటుకు అంతవరకు దేశంలోవున్న కార్లన్నిటికంటె మంచిదాన్ని ఉత్పత్తి చేయవలసిన ఆవశ్యకత వుందని నమ్మాను.

భవిష్యత్తుని గురించి నాకేమీ పాలుపోలేదు. విల్లీస్ యంత్రాగారం నిర్మించలేనటువంటి కొత్త యంత్రాన్ని ఎక్కడైనా, ఎలాగైనా నిర్మించాలని నిశ్చయించుకున్నాను. జైడార్. స్కెలిటన్, బ్రీర్ కలలుగంటున్న మోటారుకారు నమూనాని సాగించమని వారితో చెప్పాను. వాళ్ళు న్యూయార్కు మెకానిక్ స్ట్రీటులో ఒక మేడ అద్దెకు తీసుకుని, సలహాదారు ఇంజనీర్ల సంస్థని నెలకొల్పారు. వారి వుద్యోగుల్నీ, నమోదులు వేసే పనిముట్లనీ, యితర సాధనాలనీ అక్కడికి మార్చారు. ఆ మేడలోనే వాళ్ళని నేను కల్సుకునేవాణ్ణి. మేము చాలా ఉత్సాహపూరితమైన విషయాలని గురించి మాట్లాడుకునేవాళ్ళం. వాస్తవానికి ఎలిజబెత్‌లో వేసిన నమూనాలన్నీ వాళ్ళు అక్కడే వదిలిపెట్టేశారు. అనేక విధాల కొత్త కారు చాలా ఉపయుక్తమైనదనిపించింది. కాని కనీసం కొన్నాళ్ళ పాటు దాని విషయమై ఆలోచించటం మానుకోవలసివచ్చింది. తర్వాత దాన్నే విల్లీ డ్యూరెంటు కొన్నాడు. ఈ లోపు బ్యాంకివారు ఇంకో చిక్కు పరిస్థితిలో వారికి సాయపడమని నన్ను అడిగారు. ఈమాటు అవస్థల పాలయింది మాక్స్‌వెల్ మోటారు కంపెనీ.

---

# యంత్రశాస్త్రజ్ఞుడి ప్రతిఫలం

"ఈ కారు పెద్ద సంచలనం బయలుదేరతీస్తుందని వాళ్ళకి తెలుసు."

యుద్ధానంతరం తక్షణమే మోటారుకార్ల కొనుగోలు శక్తి అధికమయింది. దాదాపు అన్ని కంపెనీలు ఆ పరిస్థితిని ఎదుర్కొన్నాయి. "కార్లని అందజేయగలవా?" అని. విక్రేతలని ఒక్కటేగడ్డు ప్రశ్న అడిగేవారు. మోటారుకార్లు అందజేయగలిగితే అవి అమ్ముడుపోయేవి. కొన్ని కంపెనీలు ఉన్నట్లుండి ప్రభుత్వ ఒడంబడికల్ని రద్దుచేశాయి. మోటారుకార్ల కొనుగోలుశక్తి హెచ్చవటంవల్ల ఆ ఫలితాలు విషమించలేదు. అప్పటి పరిస్థితులు నచ్చటంవల్ల బ్యాంకివాళ్ళు మొత్తం 26.000 000 డాలర్లవరకూ అప్పుయిచ్చారు. తర్వాత ఉజ్వలంగా ప్రారంభమైన వ్యాపారస్థితి యుద్ధానంతర నష్టంలో కూలిపోయింది.

బ్యాంకివాళ్ళ తరఫున జేమ్సు కౌన్సుబ్రాండ్ నా దగ్గరకి వచ్చాడు. అతనూ అతని సోదరుడునికొల్సన్ నా సన్నిహితులయారు. విల్లీస్‌లో పని చేస్తూనే నేను మాక్స్వెల్ పునర్నిర్మాణానికి పూనుకునేట్లు వాళ్ళు విల్లీ అనుమతిపొందారు. నన్ను ఎక్కువ వత్తిడిచేయటం ప్రారంభించారు. వాళ్ళకి సాయంచేయాలని నాకూ ఆతురత కలిగింది. తర్వాత కార్య నిర్వాహక సభకీ, పునర్నిర్మాణానికీ సభాధ్యక్షుణ్ణయాను.

బ్రాండీలు మాక్స్వెల్స్‌లో నన్ను యింకా వుండమన్నారు. కాని నాకుమటుకు ఆ విషయమై నమ్మకం లేకపోయింది. మాక్స్వెల్ కి చామర్స్‌లో ఒక కాలువుంది. రెండు కంపెనీల మధ్య తగాదాలువచ్చి, చిక్కులు ఏర్పడ్డాయి. అందువల్ల మాక్స్వెల్‌తో ఆట్టేకాలం సంబంధం పెట్టుకోవటం మంచిదికాదని అనిపించింది. ఒకసారి సమావేశం వదిలేసి వచ్చేస్తూ "పది అడుగుల కఱ్ఱతోగూడా దీన్ని ముట్టుకోను" అన్నాను. ఆ తర్వాత నేను ముట్టుకోనన్నది నా జీవితంలోకల్లా పెద్ద అవకాశమనే

విషయం తెలిసింది. ఎంతైనా బ్రాండీలు నేను మాట నిలబెట్టుకునేట్లు చేశారు. ఈలోపు నా స్నేహితుడొకడు యిలా సలహాయిచ్చాడు.

"నువ్వు ఇన్నేళ్ళుగా అన్వేషించింది మాక్స్వెల్ కంపెనీ అనుకుంటాను. ఇప్పుడది సరిగ్గా నీ అధీనంలో వుంది. కాని ప్రతిఫలాన్ని గురించి నీ భావాలు మార్చుకోవాలి. బ్యాంకివాళ్ళు నిరాశ చెందటంవల్ల, జనరల్ మోటార్స్‌లో అర్ధలక్ష, క్రిస్లర్‌లో సంవత్సరానికి లక్ష సంపాయించావు. కాని ఇప్పటి పరిస్థితివేరు. ప్రస్తుతం నువ్వు ఉత్పత్తిదారుడివే కాదు, వ్యాపారస్థుడివీను. పెట్టుబడిలోకూడా నీ ప్రతిభ కనబరుస్తున్నావు. భాగంలో సొంతదారుడివై ధనం ఆర్జించగలిగితే మునుపటికంటెకూడా వృద్ధిపొందే అవకాశముంది. కాని జీతం 100 000 డాలర్లకంటె ఎక్కువ వుండటానికి వీల్లేదు."

నేను అందుకు అంగీకరించాను. అంతేకాదు ఒక పెద్ద సరకుల మొత్తాన్ని ఎంచుకునే అధికారాలు, ఒక ప్రత్యేక ఒడంబడిక యిచ్చారు.

ఒక సంవత్సరం న్యూయార్కునుంచి డెట్రాయిట్‌కి చాలాసార్లు రాత్రి ప్రయాణాలుచేశాను. నాతో తరుచు నిక్కీ, జిమ్‌కూడా వచ్చేవారు. మేము చాలా సరదాగా గడిపేవాళ్ళం. మాక్స్వెల్ కంపెనీలో డబ్బు పెట్టినందుకు బ్యాంకివాళ్ళు చాలా విచారించారు. బ్యాంకివాళ్ళు వారి డబ్బుని కంపెనీలోంచి తిరిగి సంపాయించే మార్గం చెప్పినప్పుడు బ్యాంకి నిర్వాహక సభవారు ప్రదర్శించిన ఆదుర్దా ఎన్నటికీ మర్చిపోలేను.

"ఏమిటి? మాక్స్వెల్‌కి మరో 15.000 000 డాలర్లు అప్పా? న్యాయంగా మాట్లాడు వాల్ట్!"

"నే చెప్పేది వినేంతవరకూ ఒక నిముషం ఓపిక పట్టండి. అప్పుల వాళ్ళకి రొఖ్ఖరూపంలో 5 లక్షల డాలర్లు యిచ్చేయదలచుకున్నాను. మిగతా అప్పు 6% (పర్సెంటులకి) చొప్పున 3 సంవత్సరాలలో తీర్చేస్తాను. ఈ లోపు కంపెనీ కొంత తెరిపిన పడుతుంది. మాక్స్వెల్‌ని కాపాడాలంటే—"

"మిగతా 15 లక్షల డాలర్ల సంగతేమిటి?"

"నేను చెప్పేంతవరకూ ఓ నిముషం ఆగండి. మీ డబ్బు తిరిగి రాబట్టుకోవాల నుందికదూ ?"

"తప్పకుండా. ఇంతకుముందు అప్పుయిచ్చిన 26 లక్షలు తిరిగి కావాలి."

"ఆ డబ్బు కంపెనీలో వస్తు రూపాల్లోవుంది. చాలా కారు భాగాలు పూర్తయాయిగూడా. విక్రయార్థం వీటితో మోటార్లు నిర్మించిన తర్వాత మీ డబ్బు తిరిగిరావటం ప్రారంభిస్తుంది."

"కాని నువ్వు ఇప్పుడు అప్పు అడగుతున్న మిగతా లక్షల సంగ తేమిటి ?"

"ఆ డబ్బు కంపెనీ నడపటానికి కావాలి. ప్రస్తుతంవున్న కారు అమ్ముడుపోదు. దాన్ని మరో నమూనాలో తయారుచేసేందుకు ఏర్పాట్లు చేస్తున్నాను. ధర తగ్గించి వేస్తున్నాను."

"ఎంత ?" అంటూ అందరూ పెన్సిళ్ళు బైటికితీశారు. కొత్తకారు ధర 995 డాలర్లు వేశాను. అంటే 5 డాలర్ల లాభమే వస్తుందన్నమాట.

"వాల్టర్ ! నీకు మతిపోయింది. మోటార్లని 5 డాలర్ల లాభానికి అమ్మలేవు."

"ఒక జాబితా అప్పులని తీర్చేస్తున్నాను."

"కాని బ్యాంక్ కారుమీద 5 డాలర్ల లాభమా ! 100 డాలర్లు వుండాలి."

"నాటిని 995 డాలర్లు అధికం చెయ్యొచ్చు. ఇంకా 100 డాలర్ల ఖరీదు వెయ్యొచ్చు. కాని అవి అమ్ముడుపోవు."

మాక్స్వెల్ కీ చామర్సుకీ మధ్య తగాదా కోర్టు ద్వారా పరిష్కారమైంది. తర్వాత నేనూ హార్ బ్రోనర్ కలసి కంపెనీ పునర్నిర్మాణం, కార్య నిర్వాహక సభకోసం కంపెనీ ఆస్తులన్నీ మళ్ళీ కొన్నాము. 995 డాలర్లకి తిరిగి నమూనా వేసిన కార్లు సంతృప్తికరమైన ధరకే అమ్ముడుపోయాయి. కొన్ని లక్షల పెట్టుబడి జతపరచటంవల్ల కంపెనీ పరిస్థితి బాగా వృద్ధి

పొందింది. అయినా దాన్ని వ్రాతమూలకంగా తయారుచేసేటప్పుడు తరుచు మేము ప్రతివాదన చేయవలసివచ్చేది.

1922 వ సం॥ వేసంగిలో నా స్నేహితుడు బి. ఇ. హడ్సన్ కంపెనీ కోశాధ్యక్ష్యుడయాడు. అప్పటినుంచీ ప్రతివాదనంతా దాదాపు అతనే చేసేవాడు. మేము యిచ్చిన జాబితాలో మొత్తం 11,000,000 ఖరీదు పద్దులని కొట్టేస్తూ పనిప్రారంభించాము. ఆ మొత్తం లేకుంటే మేము అప్పు అడగటం అంత బాగుండేదికాదు. కాని బ్యాంకివాళ్ళకి ఓ విధమైన గౌరవం ఏర్పడటం మొదలెట్టింది. అందుకు కంపెనీ హాక్ కి చాలా ఋణపడివుంది. అప్పటికతను బాగా చిన్నవాడు. 34 సంవత్సరా లుంటాయి. అతని స్వస్థలం చికాగో. 16 సంవత్సరాలప్పుడు హైడ్ పార్కు హైస్కూలునుంచి మెసచ్యూటిస్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీకి వెళ్ళాడు. అక్కడ రెండు సంవత్సరాలున్నాడు. అందులో ఒక సంవత్సరం బోస్టన్ గ్లోబ్ కార్యాలయంలో సమాచార ప్రతినిధిగా పనిచేసాడు. తర్వాత ఇలియన్సుకి తిరిగి వచ్చి గ్రాండ్ క్రాసింగ్ టన్ కంపెనీ ఉక్కుకొలిమి దగ్గిర పాఅతో పనిచేసేవాడు. 22 సంవత్సరాలప్పుడు నిప్పురాజేసే శాఖకి పై విచారణాధికారి అయాడు. 1918 వ సం॥లో ఎర్నెస్టు & ఎర్నెస్టు జమాఖర్చులు వుద్యోగంలో చేరాడు. ఆవిధంగా పరిశ్రమలోని వివిధరంగాలలో అనుభవం సంపాయిం చాడు. ఎప్పుడైనా పాతస్నేహితుడి కొడుక్కి సలహా యివ్వవలసివస్తే హాక్ ని మనసులో పెట్టుకునేవాణ్ణి. ఇటీవల అలాటి కుర్రాడే విమానాల కంపెనీలో వుద్యోగం సంపాయించేందుకు నన్ను సాయపడమని అడిగాడు.

సలహాకోసం నా దగ్గిరకొచ్చావా?"

"అవునండీ."

"అలాగయితే చెప్తా విను. నువ్వు అన్నట్లు విమానాల పరిశ్రమ వృద్ధి పొందుతున్న మాట నిజమే. కాని నేను విన్నంతవరకూ లెక్క లేనంతమంది యువకులు అందులో వుద్యోగాలకోసం ప్రాకులాడు తున్నారు. అందులో అయితేనేం మరెక్కడయితేనేం అవకాశాలుండే

చోట ప్రవేశించరాదా? మన దేశంనిండా అనేక పరిశ్రమలు వృద్ధి పొందు తున్నాయి. అంతులేని అవకాశాలున్నాయి. ఆ విషయాలు తెలివిగా గ్రహించాలి. నేనే నీ స్థానంలోవుంటే జమాఖర్చులు వేయటం నేర్చుకుంటాను. వర్తక సంఘంవాళ్ళు ప్రతిచోటా కంపెనీ పుస్తకాలు తనిఖీ చేసేందుకు జమాఖర్చులు వేసేవాళ్ళని పంపుతున్నారు. వ్యాపారం సాగటానికి లెక్కలు వేసేవారి చాకచక్యమెంతో అవసరం. వాళ్ళు లేనిదే వ్యాపారం జరగదు. తరుచు పుస్తకాలు తనిఖీచేసిన కంపెనీల్లోనే వారికి అవకాశాలు లభిస్తాయి."

నా వాదనకి సరియైన దృష్టాంతంగా హట్ బసన్ ని తీసుకోవచ్చు. యోగ్యత వుండటంవల్లే, 1918 వ సం॥లో ఎర్నస్టు & ఎర్నెస్టు అతన్ని అమెరికన్ రైటింగ్ పేపరు కంపెనీ జమాఖర్చు పునర్నిర్మాణాధికారిగా పంపింది. తర్వాత కొద్ది రోజులకి ఆ ఒడంబడిక పూర్తయింది. అతను కంపెనీ కోశాధికారి అయాడు. కాని మాక్సువల్ కంపెనీ పునర్నిర్మాణమప్పుడు అతనికి పెద్ద అవకాశం లభించింది. ఇన్ని అవకాశాలున్న దేశం ప్రపంచ చరిత్రలో మరెక్కడాలేదు. ఒక అవకాశం జారవిడుచుకుంటే విచారపడవలసిన అవసరంలేదు. చురుగ్గావుండి. యోగ్యత సంపాయిస్తే తప్పక మరో అవకాశం లభిస్తుంది.

1922 వ సం॥ వసంతకాలంలో నేనూ ఒక పెద్ద అవకాశాన్ని పోగొట్టుకున్నాననుకుంటాను. అప్పటికి విల్లీస్ లో నా వుద్యోగం పూర్తయింది. బ్యాంకివాళ్ళు 16.500,000 డాలర్ల అప్పుతో విల్లీస్ అప్పుని స్థిరపరిచేందుకు ఏర్పాటుచేశారు. కంపెనీ చిక్కు కోర్టు ద్వారా పరిష్కారమవుతోంది. అప్పు తీర్చివేసేందుకు ఎలిజబత్ లోని పెద్ద యంత్రాగారాన్ని వేలంలో విక్రయించేయాలనుకున్నారు. బ్యాంకివాళ్ళకి అందులో దాదాపు 14,000.000 డాలర్లదాకా వారి డబ్బు వుంటుందని తెలుసు. కాని వేలంలో దానికి ఎంత డబ్బు వచ్చినా తీసుకునేందుకు సిద్ధపడ్డారు. దాంతోపాటు జెడార్, స్కెలిటన్, బ్రీర్ వారి అనుచరులు నమూనా వేసిన మా కారూ అమ్ముడుపోతుంది.

"వాల్టర్! మాక్స్వెల్‌కి దాన్ని తక్కువ ధరకే కొనవచ్చు" అని నిర్వాహక సభ్యుడొకడు నన్ను ఆశపెట్టాడు. మాక్స్వెల్, విల్లీస్ అంతర్గత పరిస్థితులు అతనికి తెలుసు. పెట్టుబడిదార్లకీ, జామీనుదార్లకీ, యితర అప్పులవాళ్ళకీ మధ్య చాలా కలహాలుండటంవల్ల నాయకత్వం వహించటం కష్టమని అతనికి తెలుసు. బహుశః విల్లీస్ కార్పొరేషన్ వారు కారుని నిర్మించలేనందుకు నేను ఆశాభంగం పొందానని అతను గ్రహించ లేదనుకుంటాను.

నేను స్వయంగా వేలంకి వెళ్ళలేదు. కాని ఒక ప్రతినిధిని సిద్ధంగా వుంచాను. 5,000,000 డాలర్లకంటె ఎక్కువే వేలంపాడమని ఆజ్ఞాపించాను. కాని వేలంపాటగాళ్ళలో బిల్లీ డ్యూరెంటుగూడా వున్నాడు. ఆ రోజుల్లో నలుగురికీ తెలియకుండానే బిల్లీ అనేకసార్లు ఎలిజబత్‌కి వచ్చాడు. అక్కడతను కార్లన్నీ చూశాడు. వాటిలో అతను ఈ కొత్త కారులోనే ఎక్కాడు. జనరల్ మోటార్సు, మాక్స్వెల్ ప్రతినిధులు పాట ఆపేంతవరకూ, బిల్లీ ఎక్కువగా పాడుతూనే వున్నాడు. చివరికి 5,525,000 డాలర్లు యిచ్చి దాన్ని కొన్నాడు.

అదేవిధమైన కారుని మరి కొంత పెద్దదిగా నమూనా వేసేట్లు జెడార్, స్కెలిటన్, బ్రీర్, అతని సహచరులతో ఏర్పాటుచేశాడు. హార్సు పవర్ (గుఱ్ఱపుశక్తి) అధికంగా వుండేందుకు కారు పెద్దదిగా వుండాలని అతననుకున్నాడు. దాన్నే ఫ్లింట్ కారుగా తయారుచేశాడు. అది అద్భుతంగావుంది. చిక్కల్లా దాని ఖరీదు అధికమవవలసిన ఆవశ్యకత ఏర్పడింది. ఫోర్డుకి పోటీగా అతను ఎలిజబత్‌లో మరో కారు నిర్మాణానికి పూనుకున్నాడు. అది స్టార్ కారు. బిల్లీని యితర యిబ్బందులు చుట్టముట్టేలోపు దాదాపు 1,500,000 స్టార్ కార్లు తయారయాయి.

నేను నిరాశ చెందటం నా మంచికే అయింది. బిల్లీ ఆ మొదటి కారుని నిర్మించటంవల్ల, నేను, జెడార్, స్కెలిటన్, బ్రీర్ కలసి మరో కారు నిర్మాణంపై మనసు కేంద్రీకరించటానికి వీలయింది. కారు భాగాలని నిర్మించేటప్పుడు కొంత నిరాశ చెందినా కొన్ని కార్లని తయారుచేశాము.

వాటి ఖరీదు అధికంచేశాము. రోడ్లమీద వాటిని నడిపించి పరీక్షచేశాము. ఆ రోజులు ఉత్సాహపూరితంగా వుండేవి.

ఒక పాత కారు ముందరిభాగం దుమ్ము పట్టివుండేది. దాని అడుగున నొక్కే యంత్రా (హై కంప్రెషన్ ఇంజను) న్ని దాచేవాళ్ళం. ఆ కొత్త యంత్రం ఎవరికీ కనుపించేదికాదు. జెడార్ అతని పనికత్తెాళ్ళు దాన్ని అతినైపుణ్యంతో దాచేవారు. ఆ కార్లో వెళుతుంటే, పోలీసు వుద్యోగి చెయ్యెత్తి కార్ల మధ్య మా కారునే ఆపేవాడు. కాని ఏమీ తెలుసుకో లేకపోయేవాడు. కారు చక్రాల దగ్గిర మేము మురికిదుస్తులతో కూర్చు నుండేవాళ్ళం. పెద్ద కార్ల మధ్య మా పాత కారూ ఆగటం తమాషాగా వుండేది. ఈల వినబడుతూనే పోలీసుని దాటుకుని వేగంగా వెళ్ళిపోయే వాళ్ళం. మా వెనకాతలవున్న కార్లు యింకా నెమ్మదిగానే వస్తూండేవి. వాళ్ళు మమ్మల్ని నోర్లు వెళ్ళబెట్టి చూసేవారు. 1923 వ సం॥లోవున్న కార్లతో పోల్చిచూస్తే మా కారు చాలా వేగంగా నడిచేది. అప్పటికింకా క్రిస్లర్ కారుని గురించి ఎవరికీ తెలియదు. మేముమటుకు ఆ కారుని గురించి కలలు కంటూవుండేవాళ్ళం. క్రిస్లర్ మా ప్రేయసికి మల్లే మరి దేన్ని గురించీ మేము ఆలోచించలేక పోయేవాళ్ళం.

శుక్రవార మెప్పుడైనా న్యూయార్కునుంచి మెకానిక్ స్ట్రీటులోని కార్ఖానాకి వెళ్ళేవాణ్ణి. అది నాకు ఒక అలవాటయిపోయింది. ఆ కార్ఖానా చాలా చిన్నది. లోపలంతా చీకటిగా వుండేది. అక్కడికి వెళ్ళితేమటుకు శని ఆదివారాలు తిరిగి ఇంటికి వచ్చేవాడినికాదు. భార్యని పిలిచి, క్షమాపణ వేడుకుని, జరిగినదంతా వివరించటం మొదలుపెట్టేవాణ్ణి. ఆమె నాకడ్డు వస్తూ, "నాకు తెలుసు. న్యూజెర్సీకి వెళతారు. ఆదివార మంతా వుండబోతున్నారు" అని వెంటనే కంఠం మార్చి, "నాకు అర్థ మయింది. వెళ్ళిరండి" అనేది.

చామర్సులో జెడార్, స్కెలిటన్, బ్రీర్ వుద్యోగాలు సంపాయిం చారు. చామర్సు యంత్రాగారాన్ని బాగుపరచి పునర్నిర్మాణం చేశాము. పాడయిన కంపెనీల గురించి ఆదుర్దాపడటం మానేశాము. యంత్రా

గారాన్ని ఉపయుక్తంగా చేయటం విషయమే ఆలోచించేవాళ్ళం. జెడార్ నోక్కే యంత్రాన్ని మాక్స్వెల్ కార్యనిర్వాహక సభ కొనటం సంభవించింది. ఓటమిని ఎదుర్కొంటూనే చాలా సంవత్సరాలు ధైర్యంతో పని చేసి ఆ యంత్రాన్ని నిర్మించాము. కారు ధర చెల్లించమనీ, యంత్రాన్ని నడిపే విధం తెలిపేందుకు ఇంజనీర్లని ఒక జట్టుగా రమ్మనీ కంపెనీ ఆజ్ఞాపిస్తూనే ఇంజనీర్లు చాలా సంతోషపడ్డారు. అప్పటికి నేనూ ఆ సాహస కృత్యంలో మనఃపూర్వకంగా పాల్గొన్నాను. మేము ఆశాపూరితంగా నిర్మించిన ఆ కారుకి క్రిస్లర్ అనే పేరు పెట్టాలని అప్పటికే నిశ్చయంచేశాము. ఆ సమయంలోనే మిత్రుడు నిక్ బ్రాడీనుంచి ఒక విషాదవార్త విన్నాను.

"వాల్టర్! జిమ్మీకి చాలా సుస్తీచేసింది. ఇటువంటప్పుడే నేను మోటారు వ్యాపారం చిక్కుల్లో యిరుక్కుంటాను. స్టూడీబేకర్ కంపెనీతో ఒక బేరం సాగించాలని అనుకుంటున్నాము."

నేను చాలా బాధపడ్డాను. కాని చాండీలు నా స్నేహితులవటం వల్ల మనసు మార్చుకోవలసి వచ్చింది. ఇతర పెట్టుబడి భాగస్థులు అంగీకరించే ఒక ఏర్పాటుచేస్తే నా వుద్యోగ ఒడంబడికని రద్దుచేసుకుంటూ నన్నాను. స్టూడీబేకర్ బ్రాండీస్‌ని కొనేట్లయితే, స్టూడీబేకర్ సభాధ్యక్షుడు ఫ్రెడరిక్. ఎస్. ఫిష్. రెండు కంపెనీలకీ స్టూడీబేకర్ అధ్యక్షుడు ఆల్బర్టు ఆర్. ఎరస్కియిన్ని అధికారి చేస్తాడనే విషయంలో సందేహంలేదు. నేనూ, ఎరస్కినూ కలసి ఒక చోట పనిచేయటమనేది అసంభవం.

నా అదృష్టం కొద్దీ ఆ వ్యాపారం సాగలేదు. మళ్ళీ చామర్సని గురించి తహతహలాడిపోవటం మొదలెట్టాను.

తర్వాత నిజంగా ఒక చెడువార్త విన్నాను. 1924 వ సం॥ జనవరిలో న్యూయార్కు ఆటోమొబైలు ప్రదర్శనం జరగకముందే, 92 డాలర్ల చొప్పున 6,000,000 డాలర్లకి మాక్స్వెల్ కంపెనీ పత్రాలని కొనేందుకు రెండు బ్యాంకి సంఘాలు అంగీకరించాయి. అంటే ఖర్చులు

పోగా మాకు 5,520,000 డాలర్లు మిగులుతాయన్నమాట. నేనూ హచ్ ఆ విషయం స్థిరపడిందనే అనుకున్నాము. కాని అనేక క్షమాపణలతో, పశ్చాత్తాపాలతో బ్యాంకివాళ్ళు ఆ ఏర్పాటుని రద్దుచేస్తామన్నారు. అలా చేయటమే వివేకమని మమ్మల్ని భావించమన్నారు. దాంతో మాకు క్లిష్ట పరిస్థితి ఏర్పడింది.

ఇవేగాక మరో విచారకరమైన వార్త తెలిసింది. 1924 వ సం॥లో మాక్స్వెల్ కార్ల నమూనాలని ప్రదర్శించేందుకు అమెరికన్ ఆటో మొబైల్ కామర్సు ఛాంబరు స్థలాన్ని యిచ్చింది. కాని నిబంధనల ప్రకారం, ఉత్పత్తిచేసి, విక్రయింపబడని నమూనాలకి స్థలం యివ్వటానికి వీలులేదు. ప్రదర్శనంనుంచి క్రిస్లర్ నమూనాలు నిషేధింపబడ్డాయి. కొత్త కారు సంచలనం కలిగించటం గురించి ఎన్నో ఆశలు పెట్టుకున్నాము. కాని కార్లు నిర్మాణమైన తీరూ, దాని శక్తీ చూసిన తర్వాత ప్రజలు ఏ విధమైన భావాలు ప్రకటిస్తారో చూసి అప్పు విషయమై బ్యాంకివాళ్ళ మనసు మార్చాలని ఆశించాము. అప్పటికే కార్ఖానాలో పనిముట్లుపెట్టి పెద్ద ఎత్తున ఉత్పత్తి చేయటానికి అధిక వ్యయమయింది. అందుకని అప్పులో చాలా భాగం ఖర్చయిపోయింది. ఎన్నో నెలలు ఏర్పాట్లు చేసుకుంటేనే గానీ నిర్మాణము పూర్తవదు. క్రిస్లర్ కార్లు నిర్మిస్తేగానీ నాటిని అమ్మలేము. బ్యాంకివాళ్ళు మరి కొంత అప్పు యిస్తేగానీ ఆనాటి నిర్మాణం ప్రారంభించ లేము. ఇంకా ప్రారంభదశలో వుండగానే మా వ్యాపారం నాశనమయి పోతున్నట్లు అనిపించింది. నిజానికి నా స్నేహితులెవరికీ వెళ్ళిపోవటం అనే మాట కర్థం తెలీదు. కాని మా పోరాటంలో అదే పెద్ద గండంగా తయారయింది.

నిక్ బ్రాండీ నాతో ఆ మాట చెప్పినప్పుడు కంపెనీ కార్యనిర్వాహక వర్గమంతా అక్కడేవుంది. హచ్ నాకేసి గంభీరంగా చూశాడు. హచ్ కంపెనీని ఎంతో వృద్ధిచేయటానికి శ్రమపడిన మాట నిజమే. కాని ఆ ఒడంబడిక మా ఆర్థిక పరిస్థితికి పెద్ద అవాంతరం తెచ్చిపెడుతుందనే విషయం స్పష్టమయింది. కంపెనీ అంతా ఆ చెడువార్త పాకిపోయింది. జెడార్, స్కెలిటన్, బ్రీర్ని చూసేందుకు భయపడ్డాను. నాకూ మనసుకి

కష్టంగావుంది. కనుక వాళ్ళు ఎలా బాధపడతారో అర్థంచేసుకోగలిగాను. మోటారుకారు నిర్మాణానంతరం స్నేహితులు, పోటీదార్లు, చుట్టూ గుమి కూడి వింతగా చెప్పుకుంటూంటే దాన్ని ప్రదర్శించటం ఎంతో గర్వంగా వుంటుంది. ఆ ముగ్గురి ఇంజనీర్ల నైపుణ్య ఫలితంగా కారుకి ఒక చక్కని తీరూ, అందమూ, శక్తీవచ్చాయి. దాన్ని ప్రదర్శించకపోతే వాళ్ళు చాలా నిరాశచెందుతారు. అది వ్యాపార నష్టంకంటెగూడా నాకూ ఎక్కువ విచారాన్ని కలిగిస్తుంది.

ఉన్నట్లుండి జో జ్ఞాపకమొచ్చాడు. అతనికోసం వేట ప్రారంభిం చాను. అతను మా కంపెనీ విక్రయ నిర్వాహకుడిగా వున్నాడు. వస్తువులు బాగా అమ్మేవాడు. చూట్టానికి బాగుండేవాడు. ప్రస్తుతం అతను క్రిస్లర్ కంపెనీ ఉపాధ్యక్షుడిగానూ, కార్యనిర్వాహక వర్గంలో ముఖ్యుడిగాను వున్నా, డడ్ ఫార్గోనార్తు డకాటలో యంత్రాలు విక్రయించటం ప్రారంభించి నేషనల్ కాష్ రిజిస్టర్ కంపెనీకి వెళ్ళాడు. 1909 వ సం॥లో చామర్సు కంపెనీని నిర్మించటానికి హచ్ కి అతను సాయపడ్డాడు. తర్వాత జో హంప్ మొబైలుకి వెళ్ళాడు. కాని నేను మాక్సువిల్లీ అధికారిని అయినప్పుడు తిరిగి వచ్చేశాడు. అతనికి అమెరికాలోని వర్తకు లందరూ తెలిసివుండటం వల్ల కంపెనీలో పెట్టుకున్నాము. ఏదైనా చేసి పెట్టమనడిగితే "వీల్లేదు" అని సమాధానం చెప్పేవాడుకాదు. అందుకనే జో దగ్గరకి వెళ్ళాలనుకున్నాను.

న్యూయార్కు ఆటోమొబైలు ప్రదర్శనం గ్రాండ్ సెంట్రల్ పాలెస్ లో జరిగింది. కొత్త కార్లని చూసేందుకు జనం అక్కడికే వెళ్ళే వారు. కాని మోటారుకారు పరిశ్రమ వుద్యోగులు మటుకు సమీపంలోని ఏ హోటల్లోనో గుమికూడేవారు. ఆ సంవత్సరం వాళ్ళు హోటలు కమొడోర్ అనే స్థలంలో చేరారు. "జో! నువ్వెంతకుమునుపు చాలా హోటళ్ళు అద్దెకు తీసుకున్నావు. కమొడోర్ వసారా అద్దెకు తీసుకో. ప్రదర్శన నడుపుదాం."

ప్రశ్నలేమీ వెయ్యకుండానే జో వెళ్ళిపోయాడు. తిరిగివచ్చి హోటలు కాయితమొకటి చూపిస్తూ, "అద్దెకు తీసుకున్నాను" అన్నాడు.

ప్రదర్శనంలో మేము లేకపోయినా విడిగా ప్రదర్శనం సాగించాము. పొద్దుటనుంచీ రాత్రివరకూ మా చుట్టూ ఒక పెద్ద గుంపు చేరారు. మొదటి రోజునే గ్రాండ్ హాలులోని ప్రదర్శనం వాటికంటె మా నమూనాలే ప్రజల్ని ఎక్కువ ఆకర్షిస్తున్నాయని తెలుసుకున్నాము. మోటారుకారు వ్యాపారంలో స్నేహితులంతా మమ్మల్ని చూట్టానికివచ్చి కరచాలనంచేసి, మాట్లాడేవారు.

"గంటకు 70 మైళ్ళు సరిగ్గానేవుందా వాల్ట్?" అంటూ కొందరు తెలివిగలవాళ్ళు సూక్ష్మంగా కారువైపు చూసేవారు. అప్పుడప్పుడు కార్లోని ముఖమల్ గుడ్డ బహుశః గజం 6 డాలర్లుంటాయని లెక్క వేసుకుంటూ, పోటీదార్లు దాన్ని ముట్టుకు చూసేవారు. ఆ కారు అందర్నీ ఆకర్షిస్తోందని వాళ్ళకి తెలుసు. కాని ముఖ్యంగా దాని ధర తెలుసుకోవాలని ఉబలాటపడ్డారు. మోటారు కంపెనీలన్నిటికీ నొక్కే యంత్రంలో వుండే లాభం తెలుసు. కాని అప్పట్లో దాన్ని మామూలు కార్లలో పెట్టడం కష్టమనుకున్నారు. అందుకని మా కార్లో ఆ యంత్రం చూసే టప్పటికి ధర తెల్సుకోవాలని తొందరపడ్డారు. కాని మేమావిషయాన్ని రహస్యంగా వుంచాము.

తర్వాత మేము కాచుకునున్న బ్యాంకి స్నేహితుడొచ్చాడు. అతను లావుగా వున్నాడు. చాలా మంచివాడు.

"నీ కొత్త కారు అందర్నీ ఆకర్షిస్తోంది వాల్టర్!"

"మీకు నచ్చిందా?"

"ఊ! బాగుంది. అడుగు చక్రం కొంచెం పొట్టిగావుంది."

"పొట్టిగాలేదు. మొత్తం 160 అంగుళాలుంది. కారు ఆపేటప్పుడు అలా వుంటేనే ఉపయోగకరంగా వుంటుంది."

ఎటువంటి ఆతురతా కనబరచకుండా వుండేందుకు ప్రయత్నించాను. కాని ఆ బ్యాంకి వుద్యోగికి మాకు కావలసినంత ధనసహాయం చేసేటంత స్తోమతవుంది.

కమోరడ్ వసాకాలో పెట్టినది కారు ప్రదర్శనాల్లో ఒక భాగమే నని చెప్పాను. మిగతావన్నీ తయారులో వున్నాయన్నాను. ఆ రోజున నిర్విచారమైన వ్యక్తికి మల్లే మాట్లాడాను. కాని బ్యాంకి వ్యక్తి గొంతు సరిచేసుకుని, "మాక్సువల్ పత్రాలని 5 లక్షల డాలర్లకి తీసుకుంటాము."

"ఎంత ధరకి?"

"70."

నా గుండె నిలువునా నీరైపోయింది. వెంటనే పట్టలేనంత కోప మొచ్చింది. 70 కా? దానిప్రకారం 5 000,000 డాలర్లు తాకట్టు పెట్టినా మాక్సువల్ మీద 35,000.000 డాలర్లే వస్తాయి. కొద్ది నిమి షాలకి అతను వెళ్ళిపోయాడు. అడిగిన దానికి నాకు ఎంత ఆగ్రహం కలిగిందో అతను తెలుసుకోలేదు. అక్కడ యింకా కొంతమంది బ్యాంకి వాళ్ళు నాతో మాట్లాడారు.

తర్వాత బెన్ సెక్యూరిటీ కార్పొరేషన్ అధ్యక్షుడు ఎడ్, టింకర్ నాతో సంప్రతించాడు. మేము కార్లో ఎక్కి తలుపు తీసేసుకున్నాము. బైట జనమంతా పళ్ళెంలోని చేపకేసి చూసినట్లు మాకేసి ఆశ్చర్యంతో చూడటం మొదలెట్టారు. నాకు 96 కావాలని టింకర్‌తో చెప్పాను.

"కొద్ది రోజుల క్రితమైతే నీకు 99 వచ్చేది."

"వీళ్ళందరినీ కారు బాగా ఆకర్షించింది. 5.000 డాలర్ల కారు కంటెగూడా ఇది చాలా మంచిది."

"లాభంలో ఒక వంతైనా వస్తే 94 యిస్తాను."

"ఊహూ. 96 లాభం నిబంధన వీల్లేదు."

ఆ పదలో వున్న స్త్రీకి మల్లే కీచుగొంతుక పెట్టి, "తక్షణమే కార్లోంచి బయటకి పోనివ్వకుంటే కేక పెడతాను" అన్నాడతను అల్లరిగా.

"96"

"94. ఇప్పుడే వూళ్ళోకి వెళ్ళుతున్నాను."

టింకర్ వెళ్ళిపోయాడు. నాకు భయమేసింది. బహుశః టింకర్ మనసు మార్చుకుంటాడేమో, అతని కంపెనీవాళ్ళు నిరాకరిస్తారేమో, 94

యివ్వనంటారేమో అని పరిపరివిధాల అనుమానించాను. ఆ పరిస్థితి నాకు అతీతమైపోయింది. వ్యవహారం అప్పుడే, అక్కడే, ఏర్పాటు చేసేయాలనుకున్నాను. శోకాధికారికోసం వెదికాను.

"హచ్! మనం బయల్దేరి వెళ్ళి ఈ బేరం పోగొట్టుకోకుండాచూడాలి."

వ్యాపారం జరిగే ఆవరణలోకి వెళ్ళాము. వీధిలోకి వెళ్ళే గుట్టమీద నిలబడ్డాము.

"నేను ఇక్కడే వుంటాను. నువ్వు వెళ్ళిరా" అని అతన్ని పంపాను.

అతను వీధిదాటి వెళ్ళిపోయాడు. నేను అక్కడే నిలబడ్డాను. అది జనవరిమాసం. ఆ రోజు బాగా చలిగావుంది. కాని నాకు వణుకుపుట్టింది మంచువల్లమటుకుకాదు. ఏదో భయమేసింది. అలా చాలాసేపు కాచుకున్నాను.

హచ్ వెళ్ళేసరికి టింకర్ కార్యాలయంలో లేడు. మంగలి దుకాణానికి వెళ్ళాడు.

అతన్ని వెదుక్కుంటూ హచ్ ఆ దుకాణానికి వెళ్ళాడు. ముఖం నిండా సబ్బునురుగుతో టింకర్ అక్కడ ఓ కుర్చీలో కూర్చునున్నాడు.

"94 కి తీసుకోవటానికి అంగీకరించాము. ఇతర ముఖ్య వ్యవహారాలుండటంవల్ల తక్షణమే మీ సమాధానం కావాలి. అటో ఇటో తేల్చుకు రమ్మని క్రిస్లర్ నన్ను పంపాడు" అన్నాడు హచ్.

టింకర్ సబ్బు తుడిచేసుకుని హచ్‌ని తీసుకుని తన కార్యాలయానికి వెళ్ళాడు.

"3 గంటలకి అన్నాడు" హచ్.

"అలాగే. స్థిరం చేసేద్దాం" అని టింకర్ మాటయిచ్చాడు.

"కాని క్రిస్లర్ కి 3 గంటలకల్లా తెలియచెయ్యాలి."

హచ్ తిరిగివచ్చి నా కాసంగతి చెప్పాడు. అతని కళ్ళు సంతోషంతో మెరుస్తున్నాయి. వెంటనే మేమిద్దరం టెలిఫోనుకోసం సమీపంలో వున్న చుట్టల దుకాణానికి వెళ్ళాము. ఫోనులో లార్కినియిన్‌లోని రాతం

బోర్ కోసం అడిగాను. అతను నావకీలు. కాని అతని బదులు అతని సహ వకీలు నికోల్సన్ కెల్లీ సమాధానమిచ్చాడు.

"కెల్లీ! తాకట్టు పత్రం 5 గంటలకల్లా సంతకం పెట్టించి సిద్ధం చెయ్యాలి."

"ఇప్పుడే 3 గంటలయింది క్రిస్లర్."

"అసంతా నాకు అనవసరం. ఇక అలస్యంచేసి లాభంలేదు. అంతా దీనిమీదే ఆధారపడివుంది."

"అలాగే. వెంటనే చేసేద్దాం. కాని ఒడంబడిక తయారుచేసేందుకు కొంతసేపు పడుతుంది."

"వెంటనే ప్రారంభించండి."

ఆవేళ సాయంత్రమంతా చెన్ బ్యాంకి వకీళ్ళు, రష్మోర్, బిస్టీ టీస్టర్సు వుద్యోగులతో కలసి హచ్, కెల్లీ, సమాలోచన జరిపారు. అర్ధ రాత్రి ఎలన్ కిచ్చీగూడా వాళ్ళతో కలిశాడు. తెల్లని దుస్తులతో విందు భోజనంనుంచి తిన్నగా అక్కడికి వచ్చేశాడు ఎలన్. ఉదయం 6 గంటలయినా వాళ్ళింకా పనిచేస్తూనే వున్నారు. బాగా పొద్దెక్కింది.

కాస్సేపటికి ఒడంబడిక తయారయింది. మాక్స్వెల్ కంపెనీపేరుతో అది తయారయినా, అప్పటికి నా మనసులో దాన్ని క్రిస్లర్ కంపెనీ చెయ్యాలనివుంది.

కొత్తకారు ధర చెప్పమని ఆ వారమంతా జో నన్ను పీడిస్తూనే వున్నాడు. ఆతురత పడటమేకాదు అతనికి అసలు సంగతిగూడా తెలుసుకోవాలనుంది.

"పొట్టిగావున్న ఆ అడుగు చక్రంతోనే టింకర్ వాళ్ళు వ్యాపారం చెయ్యగలమనుకుంటున్నారు. "అది 1123/4 అంగుళాలుంది."

"జో! వాళ్ళు లాభం చేసుకోబోతున్నారు. బాగా నిడుపుగా వుండటంవల్ల కార్లని ఆపటం సులభం. నీ వ్యాపారస్థులతో ఆ విషయమే చెప్పు."

"సరియైన ధర తెలిస్తే రాయలేక చెయ్యి నొప్పి పుట్టేటన్ని ఉత్తరు వులని తక్షణం తేగలను."

కాయితంమీద ధర రాసి అతనిచేతి కందిచ్చాను. నేను వెళ్ళి పోతుండగా, అతను ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవిచేసి కాయితంకేసి చూడటం గమనించాను. దానిమీద 1595 డాలర్లకి బ్యూక్‌లో ధర వేశాను.

ఆ తర్వాత అదేమంత పెద్ద ధర కాదని ఋజువయింది. కొద్ది నెలల్లోనే అతను కార్లని వేగంగా విక్రయించాడు. కాని పై సంవత్స రాలలో యింకా మేలురకం కార్లని అందివ్వగలమని నాలో ఒక దృఢ విశ్వాసం ఏర్పడింది.

1925 వ సం॥లో జరిగిన ఆటోమొబైలు ప్రదర్శనంలో క్రిస్లర్ కారుకి స్థలం యిచ్చే ప్రసక్తే రాలేదు. ఒక సంవత్సరంలో 32000 కార్లు విక్రయించారు. ఇదిగాక మాక్స్వెల్ కార్ల అమ్మకంలో బాగా లాభ మొచ్చింది. ఆ సంవత్సరం 500,000 డాలర్ల అప్పుతో ప్రారంభించిన కంపెనీకి మొత్తం 4115000 డాలర్లు లాభమొచ్చింది. కంపెనీ ఆకృతిని మార్చేందుకు అది మంచి సమయమవటం వల్ల 1925 వ సం॥లో మాక్స్వెల్‌ని క్రిస్లర్ కంపెనీ చేశాము. అప్పట్లోనే అనుకుంటాను కొంతమంది బ్యాంకి స్నేహితులతో చాలా ముచ్చటైన సంభాషణలలో పాల్గొన్నాను.

కంపెనీ పునర్నిర్మాణమప్పుడు పాతబాకీలు తీరిపోగానే బ్యాంకి వాళ్ళు వారి పెట్టుబడి భాగాలు తీసేసుకున్నారు. న్యాయప్రకారం వారికి ఆ హక్కు వుంది గనుక నేనెంత బ్రతిమాలుకొన్నా వినలేదు.

"ఈ కంపెనీ వృద్ధిపొందటం చూశారు. లాభాలు వచ్చేసమయానికి భాగాలు అమ్ముకోవటం అవివేకం కదూ?" అన్నాను.

"మేము వ్యాపారం చేసే పద్ధతి అదికాదు. అప్పు యిచ్చాం. తీరి పోయింది. ఇప్పుడు బయట పడదల్చుకున్నాము."

వాళ్ళు అలాగే చేశారు. వారి పెట్టుబడి భాగాలని నేను కొన్నాను. తర్వాత వాటిమీద లాభాలు చేసుకున్నాను.

అప్పుడే కె. టి. కెల్లర్‌ని క్రిస్లర్ కంపెనీలో చేర్చుకున్నాను. బ్యూక్, జనరల్ మోటార్సు నుంచి నేను వచ్చేసినప్పుడే అతను నా వెంట వస్తానన్నాడు. కాని నేనే "ఇక్కడే వుండు. బాగా జీతమిచ్చే ఉద్యోగం కనపడినప్పుడు నేనే నీ కోసం కబురు పంపుతాను." అన్నాను. ఆతర్వాత అతను చెవర్‌లెట్ కంపెనీ ఉపాధ్యక్షుడూ, జనరల్ మోటార్సు కెనడియన్ డివిజన్ కార్యనిర్వాహకుడూ అయాడు.

1926 వ సం॥రం శీతాకాలంలో అతను కెనడా వచ్చాడు. చికాగో ఆటోమొబైల్సు ప్రదర్శనంలో నన్ను కల్సుకోమని అతనికి కబురుపంపాను.

కెల్లర్ వచ్చినప్పుడు మా కారు ప్రదర్శనశాల పక్కనే నిలబడి వున్నాను. పైవాళ్ళు ఎవరైనా మేము మామూలుగా మాట్లాడుకున్నామనుకుంటారు. కాని మేమిద్దరం ప్రాణస్నేహితులము. ఆవేళ అలా కల్సుకున్నందుకు ఉభయులం చాలా ఆనందపడ్డాము.

"ఇంతవరకూ నీకు ఎటువంటి వుద్యోగమూ యివ్వలేకపోయాను. కాని ప్రస్తుతం ఒక వుద్యోగముంది" అంటూ ఎంత జీతమివ్వగలనో చెప్పి "చేరుతావా?" అనడిగాను.

"తప్పకుండా" అన్నాడు. అతను మంచి ఉత్పత్తిదారుడు. సరిగ్గా మా కంపెనీకి అలాటి వ్యక్తే కావాలి. అందుకని క్రిస్లర్ కంపెనీకి అతన్ని ముఖ్య కార్యనిర్వాహకుణ్ణి చేశాను.

అసలు క్రిస్లర్ నమూనాని కొంతమార్పుచేసి, ఒక "50", "60", "70" కాక ఒక ఇంపీరియల్ "80" తో కలిసి 1926 వ సం॥లో 4 క్రిస్లర్ నమూనాలు తయారు చేశాము. మరుసటి సంవత్సరం 192,000 మోటార్లని విక్రయించి మోటారు పరిశ్రమలో 5 వ స్థానాన్ని పొందాము. అది పదేళ్ళ క్రితం అంటే 1927 వ సం॥లో జరిగింది. బహుశః పైకి మా పరిస్థితి చాలా బాగా వున్నట్లే కనబడవచ్చు. నిజానికి నాకప్పుడు ఆనందంగానే వుండేదని ఒప్పుకుంటాను. మా కంపెనీ కీర్తి ప్రపంచమంతా వ్యాపించింది. అయినా నెలనెలా పోటీ ఎక్కువై క్లిష్టపరిస్థితి ఏర్పడింది.

"అమెరికాలోని కుటుంబాలన్నిటికీ అందుబాటులో వుండేట్లు ఉత్పత్తి చేయండి." అనేది మోటారుకారు వ్యాపారంలోని ముఖ్యసూత్రం. అప్పుడప్పుడూ కొందరు ఉత్పత్తిదార్లు ఆ సూత్రాన్ని మరచిపోయేవారు. కాని మేము మట్టుకు అది మఱచిపోయేవాళ్ళం కాదు. మా కంపెనీకి కావలసిన కొన్ని మోటారు భాగాలని పై వ్యాపారస్థుల దగ్గరనుంచి కొనవలసివచ్చేది. కాని క్రమంగా వాటి ధర తగ్గించేటట్లు చేసి కంపెనీని వృద్ధి పరచాము. ఉత్పత్తి విధానంలోని దుబరా ఖర్చులని క్రమంగా తగ్గించు కుంటూ పోవటంవల్లే మోటారు వ్యాపారం వృద్ధిపొందింది. చామర్సు దగ్గిర కెరచవల్ యంత్రాగారాన్ని కొని కారు ముఖ్య భాగాలని నిర్మించటం మొదలుపెట్టాము. కాని అందులో చాలా భాగాలు బైట కంపెనీలలో కొనవలసివచ్చేది. డాడ్జితో పోటీగా క్రిస్లర్ "50" ని నిర్మించదలచాము. కాని ఆ ప్రయత్నాన్ని పూనుకున్నప్పుడల్లా మా దగ్గిర తగినన్ని కారు భాగాలు లేని విషయం పదే పదే గుర్తుకొచ్చేది.

మా దగ్గిర ఇనుమును కరిగించే కొలిమిలేదు. డాడ్జికి చాలా పెద్ద కొలిమి వుండేది. అంతేకాదు. మా కంపెనీలో లోహాలను కరిగించే కర్మాగారం వుండేదికాదు. డాడ్జికి పెద్ద కర్మాగారముండేది. ఈ కొరతలవల్ల మేము అధిక వ్యయం చెయ్యవలసి వచ్చేది. డాడ్జి కంపెనీలో చాలా యంత్రాగారాలుండేవి. అందుకనే మాలాగ ఉత్పత్తికి అనవసరపు ఖర్చులయేవికావు. అయినా పెద్ద యంత్రాగారాలుండి, ఖర్చులు తగ్గించుకుంటే తప్ప, మాకు చెవర్లెట్తో పోటీకి దిగే అవకాశం లేదని తెల్సుకున్నాను. నిజానికి ఆ రోజుల్లో డాడ్జికి పోటీగా వున్న కారు చెవర్లెట్ ఒక్కటే.

ఎన్నో అంచనాలు వేసి, 75000,000 డాలర్లు ఖరీదుచేసే యంత్రాగారాన్ని నిర్మిస్తే ఉత్పత్తి అభివృద్ధి చెయ్యొచ్చని తెలుసుకున్నాము. కాని అంత డబ్బుని ఎక్కడ పుట్టించగలమనేదే సమస్య అయింది. ఆ విషయం గురించి ఆలోచించినప్పుడల్లా డాడ్జి సోదరుల యంత్రాగారాలు కళ్ళముందు కనబడేవి. అప్పటికి డాడ్జి సోదరులు చనిపోయారు. కాని మోటారు పరిశ్రమలో వారికి చాలా కీర్తి వుంది. మొదట్లో వాళ్ళు ఫోర్డుకారు భాగాలని తయారుచేసేవారు. ఆ సంవత్సరమే యూరపులో యుద్ధం

ప్రారంభమైంది. డాడ్జి సోదరులు డాడ్జి కారు నిర్మాణం మొదలెట్టారు. కాని వారి మనసు యింకా ఫోర్డు కారుమీదే లగ్నమయివుంది. డాడ్జ్ యంత్రాలు చాలా మొరటుగా వుండేవి. నాటు రోడ్లమీద పోయేందుకు గుట్టలమీద పోయేందుకూ ఆ యంత్రాలు పనికొచ్చేవి. డాడ్జ్ సోదరులు బ్రతికున్నప్పుడు ఫోర్డు కారుకంటె డాడ్జి కారు ధర ఓ 100 డాలర్లు ఎక్కువ వుండేది. అందరికీ ఆ కారుమీద మహామోజుగా వుండేది. అందువల్లే అవి బాగా అమ్ముడుపోయేవి. కాని విల్లీస్-ఓవర్‌లాండ్‌కి నేను అధికారినైన సంవత్సరం 10 లేక 11 నెలల తేడాలో డాడ్జి సోదరులు చనిపోయారు. 4 సంవత్సరాలతో డిలియన్ న్యూయార్కు బ్యాంకి సంస్థ రీడ్ & కంపెనీ డాడ్జిని విక్రయించటానికి డాడ్జి సతీమణులు సమ్మతించారు. క్లారెన్సు డిలియన్ 146,000,000 డాలర్లు యిచ్చి, ఆ కంపెనీని కొన్నాడు.

ఆ సంఘటన జరిగిన కొన్నాళ్ళకి క్లారెన్సుతో నాకు పరిచయమైంది. ఒకరోజు అతను నా కార్యాలయానికి వచ్చి, నా కేదయినా వ్యాపారం చెయ్యాలనుందా అని అడిగాడు.

"క్లారెన్సు! నీ యంత్రాగారం మటుకు నాకు వద్దు. దాంతో నేనేం చేసుకుంటాను?"

క్లారెన్సు మంచి విక్రేత. నాదగ్గిరనుంచి వెంటనే వెళిపోలేదు. నిజానికి మాకు అలని కంపెనీ యంత్రాలు కావాని. ఆ విషయం అతను గ్రహించగలిగాడు. అతన్ని రెండు మూడు గంటలు మాట్లాడనిచ్చాను. క్లారెన్సుకంటె కూడా మాకు ఆ యంత్రాగారం విషయం ఎక్కువ తెలుసు. కాని డాడ్జి కంపెనీ నుంచి స్థాపించిన ఆ చిన్న కంపెనీని గురించి అతను గప్పాలు కొడుతుంటే శ్రద్ధతో విన్నాను. మోటారు పరిశ్రమలో కంతా ఆ కంపెనీలోనే ఎక్కువ విక్రయాలు జరుగుతాయని కంపెనీవారు గర్వపడేవారు. అయినా అతను మటుకు నా ఆతురత కనిపెట్టనివ్వకుండా చేశాను. చివరికి వెళిపోవటానికి అతను లేచి నిలబడ్డాడు.

"వాల్టర్! వూళ్లోకి వెడుతున్నాను. ఈవిషయమై నా అనుచరులతో మాట్లాడుతాను."

"అలాగే. ఎప్పుడైనా మళ్ళీ రా."

3,4 రోజుల్లో మరికొన్ని విషయాలు చెప్పటానికి అతను తిరిగి వచ్చాడు. నాకు కోపం, చిరాకు కలిగాయి.

"అది చాలా పెద్ద మొత్తం. మాకు అంత మొత్తం పెట్టి కొనవలసిన అవసరంలేదు. ఇదేమీ బేరం కానప్పుడు మాట్లాడి లాభమేమిటి?"

"వాల్టర్! ఈ విషయమై నువ్వు పూర్తి అలక్ష్యం చెయ్యకు. హెన్రీ ఫోర్డుతోనూ, జనరల్ మోటార్సుతోనూ పోటీగా ఇక క్రిస్లర్‌ని ఎలా నిర్మిస్తావు?"

"మా కంపెనీ బాగానే నడుస్తోంది. వ్యాపారంలో మా కంపెనీతో పోల్చతగ్గ కంపెనీని మరొక్క దానిని చూపించగలవా? సంవత్సరం సంవత్సరానికీ మేము వృద్ధి పొందుతూనే వున్నాము."

"నిజమే. అన్ని కంపెనీలకంటె మీరు ఎక్కువ విక్రయించటం చూస్తూనే వున్నాను. కాని—"

"ఖరీదు ఎక్కువ క్లారెన్సు. ముందు డాడ్జి విషయం కనిపెట్టివుంచు. పై సంవత్సరమో ఆ తర్వాతో డాడ్జి ధర బాగా పడిపోవచ్చు. అంత పెద్ద కంపెనీ దివాలా తీయటం మొదలెడితే వేగంగా నాశనమైపోతుంది."

"డాడ్జి ధర తగ్గటంలేదే?"

"నేను అలాగని విన్నాను."

"డాడ్జికి మంచి పేరుంది. ప్రతి సంవత్సరం చక్కని ఉత్పత్తి చేస్తోంది."

"నా కాసంగతి తెలుసు. ఆ కంపెనీ ప్రతిష్ఠకే. మీరు 30,000,000 డాలర్లు యిచ్చారు. కాని అప్పట్లో కంపెనీ బాగా డబ్బు చేసుకునేది. ఇప్పుడెలావుంది?"

"అద్భుతంగావుంది. కాని మీరు దాన్ని యింకా బాగా ఉపయోగించగలరనుకుంటాను."

ఒక నెలో లేక ఆరువారాలో క్లారెన్సు ఆ విషయాలని చెబుతూనే వున్నాడు. తర్వాత ఒక రోజు నా కార్యాలయానికి వచ్చి వృత్తినే ఆపసోపాలుపడటం ప్రారంభించాడు.

"వాల్టర్! పెద్ద పారిశ్రామిక వ్యాపారాన్ని నడపటంలో బ్యాంకి వాళ్ళు కృతకృత్యులు కాలేకపోయారు. మోటారుకార్లు ఉత్పత్తిచేయటం. విక్రయించటం నాకేం తెలుసు? అది నీకు బాగా తెలుసు. డాడ్జి వ్యాపారాన్ని నువ్వు తీసుకోకూడదూ?"

జవాబు చెప్పేలోపు అతనికేసి ఒక నిముషం చూశాను. "క్లారెన్సు! నిరంతరంగా మాట్లేడందుకు నాకు ఓపికలేదు. నీ కాలం నా కాలంగూడా వృధాచేస్తున్నావు నువ్వు. నీకు నిజంగా వ్యాపారం చెయ్యాలనుంటే ఒక ఒడంబడికని తయారుచెయ్యి. అందులో తక్కువ ధర వెయ్యాలని గుర్తుంచుకో. ఈ వ్యాపార ప్రసంగాన్ని ముందు నువ్వే ప్రారంభించావనే విషయం మరచిపోక. ఒడంబడికని సరిగ్గా తయారుచెయ్యి. నీ ధర ఎంతో వ్రాయి. అంగీకరించేదీ లేనిదీ చెబుతాను."

అతను ధర నిర్ణయించుకుని తిరిగివస్తానని చెప్పాడు.

అప్పటికే అతను మనసులో అంచనాలు వేసేసుకుంటున్నాడని గ్రహించాను. అతను కార్యాలయంనుంచి వెళ్ళిపోయిన తక్షణమే హచ్‌తో మాట్లాడాను. అది సామాన్యమైన వ్యాపారంకాదు. హచ్‌కి చాలా పెద్ద అంచనాలువేసే పనే అప్పగించాను. అతనికి హెచ్. ఎ. డేవిస్ అనే వ్యక్తి సాయపడ్డాడు. నేను మాక్‌విల్లీ నిర్వహణ తీసుకున్నప్పుడు డేవిస్ సహాయ కోశాధికారిగా వుండేవాడు. తర్వాత అమెరికా బ్యాంకులతో మేము అప్పు రూపకంగా సంబంధాలు పెట్టుకున్నప్పుడు అతను హచ్‌కి సాయపడ్డాడు. డాడ్జి కంపెనీని గురించి తెలిసినదంతా హచ్, డేవిస్ అంచనాలు వేసేసారు. మళ్ళీ 10 రోజుల వరకూ క్లారెన్సు రాలేదు. తర్వాత అంచనాలన్నీ వేసేసుకుని, పైపు కాయితాలు పట్టుకుని నా దగ్గరకి వచ్చాడు. అక్కడికి హచ్‌నీ, మా వకీలు అల్బర్టు రంతంబోర్‌నీ పిలిచాను. క్లారెన్సు నా బల్ల పక్కగా కుర్చీ లాక్కొబోయాడు.

"ఇక్కడ కాదు క్లారెన్స్"

"ఏమిటి ?"

"ఇక్కడకాదు. ఈ సమావేశానికి నేను ఇద్దర్ని తీసుకువస్తున్నాను. నువ్వూ కావాలంటే ఎవరినైనా తెచ్చుకో. ఇది పూర్తిచేసే లోపు నీ గొంతు బొంగురు పోయేవరకూ ఎంతైనా మాట్లాడుకో"

"ఎక్కడ మాట్లాడదామంటావ్ ?"

"రిట్జు హోటల్లో గదులు తీసుకుందాము. సమావేశం పూర్తయి, వ్యవహారం అటో ఇటో తేలేంతవరకూ అక్కడే వుందాం."

వ్యవహారం మొదలు పెట్టినప్పటినుంచీ, ఆ ఒడంబడికకి పెట్టుబడి భాగస్థులలో 99 వంతు భాగస్థులు అంగీకరించేటట్లు చేయాలని పట్టు బట్టాము. మాట బలం లేని కొద్దిమంది భాగస్థులతో మేము వ్యాపారం సాగించ దలుచుకోలేదు.

"క్లారెన్స్! 99 వంతు భాగస్థులు, లేదా..........."

"అలాగే వాల్ట్ ! తగినంత వ్యవధి యివ్వండి"

"రెండు నెలలు యిస్తాను. అంతకంటె ఆలస్యమైతే మేము కారు నమూనాలు వేసెయ్యవలసి వస్తుంది."

రిట్జు హోటల్లో 5 రోజులు గడిపాము. క్షణం తీరిక లేకుండా గడిచిపోయాయి ఆ 5 రోజులు. భోజనం, నిద్దర, వాదన, మిట్ట త్రాగటం, వ్యాపారం సాగించటం— యిదే వరస. ఆ సమావేశం పూర్తయిన తర్వాత అలసట వల్ల, మా కళ్ళు ఎఱ్ఱబడ్డాయి. కాని మాలో విజయం సాధించా మనే ఒక అనుభూతి కలిగింది. నిబంధనల ప్రకారం క్రిస్లర్ కంపెనీ డాడ్జి అప్పుపత్రాల్లోనూ, కొత్త క్రిస్లర్ పెట్టుబడిలోనూ 170.000 000 డాలర్లు పెట్టాలి. అయినా క్లారెన్స్ భాగస్థుల అనుమతి తెచ్చేంతవరకూ 2 నెలల పాటు ఒడంబడిక అమలు జరగదు. రిట్జు సమావేశం మే నాలుగున జరిగింది. జూలై మాసాంతంలో క్లారెన్స్ చాలాసార్లు నా దగ్గరకివచ్చి ఒడంబడిక పూర్తయేందుకు నియమించిన గడువు తేదీ పొడిగించమని అడిగాడు. గడువు అవధికి యింకా 48 గంటలుందనగా, క్లారెన్స్ యింకా

వ్యవధి కావాలని ప్రాధేయపడ్డాడు. మేము అడిగిన దానికి ఇంకా 60,000 డాలర్ల భాగాలని సేకరించవలసివుందని చెప్పాడు.

"క్లారెన్సు, నేను నీకేమీ సాయం చెయ్యలేను. ఒకవైపు క్రిస్లర్ పెట్టుబడి భాగస్థులు నష్టపోయే అపాయముండగా నీకు సాయపడలేను. నీకూ ఆ విషయం తెలుసు."

"చాలా విచారించతగ్గ విషయం. వాల్టర్! పెట్టుబడిలో 85 వంతు సంపాయించాను. ఇటువంటి వ్యాపారంలో అంత పెట్టుబడి చాలా అరుదుగా లభిస్తుంది"

"ఆ విషయం ఒప్పుకుంటాము క్లారెన్సు. కాని ఇది వేరే వ్యాపారం. మేము 99 వంతు అడిగాము. అందుకు నువ్వు అంగీకరించావు." అన్నాడు ఆల్బర్టు రతెంబోర్.

"కాని వాల్టర్! నువ్వీ వ్యాపారం చెయ్యదలచుకున్నావుకదూ?" అనడిగాడు క్లారెన్సు.

"అవును. అంగీకరించిన నిబంధల ప్రకారం చెయ్యదలచుకున్నాను."

"నా కష్టమేమిటో చెబుతున్నాను వినండి. ముఖ్యభాగస్థుల్లో ఒకరు పారిస్‌లో వున్నారు. అందుకనే రెండు రోజుల్లో ఆ భాగాలు నాకు అందటానికి వీలులేదు. ఆ 60,000 డాలర్ల భాగాలని నేను ముట్టుకోలేను." బ్యాంకి వాళ్ళని ఉద్రేకంలో వున్నప్పుడు చూడాలంటే, ఆవేళ క్లారెన్సు మాట, తీరూ నిజంగా చూసితీరవలసిందే.

"క్లారెన్సు! గడువు తేదీ వచ్చినప్పుడు నీ కోసం ఎదురు చూస్తాము. లేకుంటే ఒడంబడిక రద్దు చేసేస్తాము."

"వాల్టర్! ఈ పని రెండు రోజుల్లో చెయ్యలేను."

"క్లారెన్సు! ఇది 2 రోజుల వ్యవహారం కాదు. రెండు రోజులు తక్కువగా రెండు నెలల కిందట ప్రారంభమైంది. ఈపని నువ్వు చెయ్యగలవనుకుంటాను. కాని నువ్వు చెయ్యలేకుంటే వ్యాపార ఒడంబడిక రద్దయి పోతుంది" అని నొక్కి చెప్పాను.

నిరాశచెందినట్లే కనుపిస్తూ క్లారెన్సు కార్యాలయంలోంచి వేగంగా వెళ్లిపోయాడు. నా వకీళ్ళు నా వైపు కోపంగా చూసినట్లనిపించింది. కాని ఆ వ్యవహారం సంతోషదాయకంగానే ముగిసింది. గడువు వ్యవధి పూర్తికాకముందే ఎలాగో అలాగ క్లారెన్సు 60,000 డాలర్ల భాగాలు తీసుకువచ్చాడు. 1928 వ సం॥ జూలై 31 వ తేదీన ఆ వ్యాపారం పూర్తయింది.

మర్నాటి ఉదయం క్లారెన్సు నా దగ్గరకు వచ్చాడు. సిగరెట్ తాగుతూ, కావాలంటే డాడ్జి కంపెనీ 3 నెలలపాటు దానంతటదే నడవ గలదని చెప్పాడు.

"ఏమిటిది క్లారెన్సు? పోయిన రాత్రే మా పని కత్తెగాళ్ళు అక్కడికి వెళ్ళారు" అన్నాను. కె. టి. కెల్లర్ నాయకత్వాన కార్మికులంతా డాడ్జి కంపెనీకి వెళ్ళిపోయారు. ఒడంబడికమీద సంతకాలు పెట్టిన తక్షణమే కెల్లర్‌తో మాట్లాడేందుకు ఫోను తీశాను.

"డాడ్జి కంపెనీని కొన్నాము. గురుతులు వెయ్యి" అని చెప్పాను.

అంతకు చాలా రోజుల క్రితమే కిత్తనార గుడ్డమీద "క్రిస్లర్ కంపెనీ డాడ్జి శాఖ" అనే గురుతులు కార్మికులు తయారు చేశారు. వాటిని పెద్ద బంగీలలో వుంచారు. నా వార్త వింటూనే డాడ్జి కంపెనీముందు ఆ గురుతులని అతికించమని కెల్లర్ కార్మికులకి ఆజ్ఞాపించాడు. తక్షణమే 6 గుర్ని తీసుకుని అతను డాడ్జి ముఖ్యకార్యాలయానికి వెళ్ళాడు. వెంటనే కంపెనీని స్వాధీనం చేసుకుంటున్నామని డాడ్జి అధ్యక్షుడితో చెప్పాడు. ఆ క్షణం నుంచీ దానికి మేము అధికారులమయాము. ఆ సంఘటనతో క్రిస్లర్ కంపెనీ ప్రాముఖ్యం 5,6 రెట్లు అధికమయింది. తర్వాత 1929 వ సం॥లో కెల్లర్ డాడ్జి అధ్యక్షుడయాడు.

1928 వ సం॥లో న్యూయార్కులోని వారంతా క్రిస్లర్ ఒక నిరుపయోగమైన యంత్రాగారాన్ని కొన్నాడని అభిప్రాయపడ్డారు. పరిశ్రమని గురించీ, ముఖ్యంగా మోటారుకారు పరిశ్రమని గురించీ ఏమీ తెలియనివారి అభిప్రాయమది. నా జీవితంలోకల్లా నేను చేసిన మంచి పని

డాడ్జి కొనటమే. నిజానికి ఆ కంపెనీతో పోలిస్తే మా కంపెనీ నిర్మాణము ఏమీ అంత అధికమైనదికాదు. రెండు కంపెనీలు కలవకముందు క్రిస్లర్ కంపెనీ శక్తివంతంగా నడిచిన మాట నిజమే. కాని డాడ్జితో కలిసిన తర్వాత అది పరిపక్వత చెందింది. 1937 వ సం॥ మేనెలలో రోజుకు 62940 లేక 65,000 కార్లు నిర్మిస్తూవచ్చాము. దీన్నే కొందరు దివాలా అన్నారు. కాని డాడ్జి లేకుంటే ఆ రోజు మా పరిస్థితి ఏమయ్యేదో చెప్పలేము. మాకు ప్లయిమవుతు కారుమటుకు వుండేదికాదని నిస్సందేహంగా చెప్పగలను.

1937 వ సం॥ నాటికి క్రిస్లర్ కి అప్పులులేవు. పెట్టుబడి భాగస్థులకీ, వస్తురూపంలోవున్నవారి 43,000,000 డాలర్లకీ మధ్య తాకట్లులేవు. కంపెనీకి బరువైన వడ్డీ మొత్తాలన్నిటినీ చెల్లించేయటంవల్లే మేము చిక్కుల్లోంచి బైటపడగలిగాము. ప్రారంభదశలో మా కంపెనీ ఎలా వుండేదో కంపెనీలో పనిచేసినవారెవరూ మర్చిపోలేరు.

1929 వ సం॥ మొదట్లో కొంత ఆపద వస్తున్నట్లనిపించింది. కంపెనీ ధర్మకర్తగా నాకు పెద్ద బాధ్యతవుండేది. జనరల్ మోటార్స్లో పని మానేసి డ్యూరెంటు డ్యూపాంటుకి భాగాలు అమ్మేసిన అర్థసంవత్సరం లోనూ నా డబ్బంతా భార్యా పిల్లలకిచ్చేశాను. ఆస్థిరూపాల్లో పెట్టటం వల్ల ఆ డబ్బుని తిరిగి స్వాధీనం చేసుకోవటానికి వీలులేదు. అందుకే విల్లీస్ లో బ్యాంకివాళ్ళ దగ్గిర పనిచేయటానికి వెళ్ళినప్పుడు నా దగ్గిర పెట్టుబడి లేకుండాపోయింది. ఆ సంవత్సరం నా దగ్గిరవున్న డబ్బునే ఎంతో పొదుపుగా వాడుకున్నాను. అయినా నా కొడుకులకిమటుకు మంచి భవిష్యత్తు ఏర్పరచాలని నిశ్చయించుకున్నాను. న్యూయార్కులో పెరగటంవల్ల నా కొడుకులు అక్కడే వుండదలచుకున్నారు. వాళ్ళు పని చేస్తామన్నారు కాబట్టి ఒక కార్ఖానా నిర్మించాలనిపించింది.

పారిస్ లో నేను చూసినదొకటి జ్ఞాపకమొచ్చింది. వాస్తుశాస్త్రజ్ఞులతో, "ఈ కార్ఖానాని ఎఫియల్ టవర్ కంటె ఎత్తుగా నిర్మించండి" అన్నాను. ఆ విధంగానే 77 అంతస్తుల క్రిస్లర్ భవనం ప్రారంభమయింది.

తెల్లని సేల, ఎఱ్ఱని మేడ, బొమ్మ వసారాతో వాస్తుశాస్త్రజ్ఞులు ముందు ఒక ప్లాస్టిక్ నమూనాని తయారుచేశారు.

నమూనా చూసి, "కాస్త యిరుగ్గా వున్నట్లుంది" అన్నాను. అంత వరకూ నిర్మాణములో నేను ఎక్కువ ఆసక్తి కనబరచలేదనుకున్నారు వాళ్లు.

నమూనాలో వున్న ప్రకారం పైబరువు ఎక్కువగావుంది.

"వ్యాపారార్థం ఎవరైనా పెద్ద కార్ఖానాలో అడుగుపెట్టినప్పుడు కొంత మార్పు కనుపించాలి. తత్క్షణమే వ్యాపారం చెయ్యాలనే ఉత్సాహం కలగాలి. ఇదెలా వుంటుంది" అంటూ అడుగు భాగంవైపు చూపించాను.

"తీసేయండి. అక్కడ అతికించినది పలక" అన్నాడొకతను. నేను అది తీసేశాను. ఆ చిన్న మార్పుకే నిర్మాణము చేస్తున్నప్పుడు పాతికలక్షలు ఖర్చయింది.

"ఇలా చేయటానికి వీలుందా?" అన్నాను.

కాగితంమీద బొమ్మ గీస్తున్న ఒకతను దాన్ని పైకెత్తి "వసారా త్రికోణంగా పెట్టి యిలా చెయ్యొచ్చు" అన్నాడు. అప్పటికే కార్ఖానా అడుగుభాగం నిర్మాణం ప్రారంభమయింది. మేము చాలా సరదా అయిన రోజులు గడిపేవాళ్ళం. నా కార్యాలయం మాడిసన్ స్ట్రీటు 347 నెం లో వుండేది. వాస్తుశాస్త్రజ్ఞులిచ్చిన నమూనాలని కార్యాలయంలో నేలమీద వేసి పాకిచూసేవాడిని. వసారాలో వేసే నలువరాళ్ళనీ, లిఫ్టు గదుల కొయ్యలనీ ఏరేవాణ్ణి. చాలా నైపుణ్యమున్న వడ్రంగులు ఆ గదులని తయారుచేశారు.

"ఈ గదులు తిన్నగా వుండకపోతే సిలండర్లలోని కడ్డీలకంటె ఎక్కువ శబ్దంచేస్తాయి. ఇవి సరిగ్గావుండాలి" అని నాలో నేను అనుకునే వాణ్ణి.

అందుకని కూలీలకి నిలువుగీతలెలా తీసుకోవాలో చెప్పాను. ఈ రోజున క్రిస్లర్ భవనంలో చాలా చక్కని లిఫ్టులున్నాయి. మేము ఆ భవనం నిర్మించినప్పుడు వూళ్ళో ఒక నిబంధనవుండేది. దానిప్రకారం లిఫ్టులు నిముషానికి 750 అడుగుల వేగంతోనే పైకి పోవాలి. నేనుమటుకు పట్టుబట్టి నిముషానికి 1 000 అడుగుల వేగంతో వెళ్ళే లిఫ్టులు ఏర్పాటు చేశాను. ప్రస్తుతం వూళ్ళో అటువంటి నిబంధనలులేవు. కార్ఖానాల నిండా

జనం వున్నా లిఫ్టులవల్ల జనం వేగంగా పైకి వెళ్ళిపోతారు. కాని ఇప్పుడా విషయాలన్నీ నా కొడుకు క్రిస్లర్ సమస్యలు. అతనే దాని అధికారి. అధ్యక్షుడు. అతను చక్కగా పనిచేసేవాడు.

వుద్యోగంలో చేరటానికి సిద్ధమైనప్పుడు అతనితో యిలా అన్నాను. "ఆ కార్ఖానాని గురించి ఏదైనా కొంత తెలుసుకోవటం మంచిది. అది నీదే. నాది కాదు."

"ఎక్కడ ప్రారంభించాలంటావ్ నాన్నా ?"

"ముందు మేడ క్రింది భాగానికి వెళ్ళు. కొన్ని నెలలు గీకిచూడు. కార్యాలయాలు శుభ్రం చెయ్యి. ఆ విధంగా నీ చూపులకేకాదు, మిగతా వారి చూపులకీ అది ఎలా కనుపిస్తుందో తెలుసుకోవచ్చు." వాల్టర్ అలాగే చేశాడు. ఆ తర్వాత యితర పనులన్నీ నేర్చుకున్నాక కార్ఖానా నడపటం మొదలెట్టాడు. ఆ కార్ఖానా యిప్పటికీ 1929 వ సం॥లో అంచనా వేసి నట్లే నడుస్తోంది.

కాని ఆ పెద్ద భవనం నిర్మించటం మొదలుపెట్టినప్పుడు భావిలో నాకు గడ్డురోజులున్నాయని తెలియలేదు.

ఆర్థిక మాంద్యంలోని ఘోరమైన అంశం ప్రారంభమవకముందే కార్ఖానా నిర్మాణం పూర్తవటం నిజంగా నా అదృష్టమే అనుకున్నాను.

మా పెళ్ళయిన కొత్తలో నేనూ, డెల్లా తరుచు స్నేహితుల్ని విందుల కాహ్వానించి, వారితో సరదాగా గడిపేవాళ్ళం. సంగీతం వింటూ, నవ్వు కుంటూ కాలం వెళ్ళబుచ్చేవాళ్ళం. ఇప్పటికీ మాకదే అలవాటయి పోయింది. కాని వ్యాపారపరిస్థితి కొంత ఆదుర్దా కలిగిస్తూనే, డెల్లా ఆ విషయమై నాతో మాట్లాడాలంది.

"క్రిస్లర్ కంపెనీకి సాయం కావలసిన సమయం వచ్చింది. ప్రస్తుతం నేనే దీన్ని నిలబెట్టాలి. కనుక వారంలో 5 రోజులు పెందరాళే లేచి పనికి వెళతాను. కావాలంటే శుక్రవారం రాత్రిళ్ళు ఏ విందు భోజనానికో, సినిమాకో, ప్రదర్శనానికో వెళదాం. ఆదివారాలు ఎక్కడికైనా వెళదాం. కాని సోమవారం ప్రొద్దుటే పనికి వెళ్ళవలసివుందిగనుక ఆదివారం రాత్రిళ్ళు

మటుకు పెందరాళే పడుకుంటాను. కష్టకాలం పూర్తయేంతవరకూ మా జాబితా ఇది."

మేము ఉభయులం దాని ప్రకారమే నడుచుకున్నాము. డెల్లా నాకు చాలా ప్రోత్సాహమిచ్చింది. తను ఒక కార్మికుడి భార్యనని ఆమెకి తెలుసును.

1931, 32, 33 సం॥లలో క్రైస్లర్ ఖర్చులు తగ్గించవలసివచ్చింది. జీతాలు తగ్గించటం, నిర్మాణాలు ఆపుచేయటం మొదలైన అనేక మిత వ్యయాలు చెయ్యవలసివచ్చింది. ఉత్తరువులు లేకపోవటం మూలాన కొన్ని నెలలుపాటు కంపెనీ 4% వంతు ఉత్పత్తి చేయవలసివచ్చింది. పరిస్థితి ఎంత నిరుత్సాహకరంగావున్నా ఆదాయవ్యయ పట్టీనుంచిమటుకు ఒక పెన్నీగూడా తగ్గించలేదు. ఈ విషయం పరిశోధనా నిర్వాహకుడైన జీర్ జేటికి చెప్పగలడనుకుంటాను. అతన్ని ఏ విధమైన మితవ్యయం చెయ్య మన్నట్లు జ్ఞాపకంలేదు. దానికి గల కారణమేమిటో ఆధునిక పారిశ్రామికు డెవరైన అర్థం చేసుకోగలడు. పరిశ్రమ అనేది పరిశోధనవలెనే భావిలో ఒక 15 సంవత్సరాలపాటు నిలబడగలుగుతుంది. పరిశ్రమ యొక్క నిర్వహణ చక్కబడి, అది అభివృద్ధి చెందటానికి పరిశోధనే కారణం. దేశంలో ఆర్థిక మాంద్యము అధికమై ప్రజలు విచారగ్రస్తులైపోయారు. కాని మేము మట్టుకు ధైర్యంగా పరిశోధనలు సాగించాము. ఆ కృషి ఫలితంగానే 1936, 37 వ సం॥లలో మా కార్లు బాగా అమ్ముడు పోయాయి. ఈ రోజుల్లోనూ పరిశోధనల మూలంగానే కార్లు అభివృద్ధి చెందుతున్నాయి. అందుకనే భావిలో నిర్మాణమయే కార్లు ప్రస్తుతమున్న కార్లకంటె బాగుంటాయని చెప్పవచ్చు.

కాని ఆ గడ్డురోజుల్లోనే మా కంపెనీలో అతి ముఖ్యమైన ఇతర మార్పులు జరిగాయి. 1927 వ సం॥లో మేము డాడ్జి కంపెనీని కొన్నాము. అప్పటికి మాకు మొత్తం 60,000,000 డాలర్లు అప్పు వుంది. అంటే వడ్డీకి 30,000,000 డాలర్లు అవుతాయి. అప్పు తీర్చేసుకుంటూ పోవ టానికి కంపెనీవారంతా అంగీకరించారు. 1927 వ సం॥లో కంపెనీ అప్పు అధికమైనప్పుడు, క్రిస్లర్, కంపెనీ దాని సమీపంలోని కంపెనీల

కెస్లర్, ఏ. ముహరింగ్ తనిఖీదారుడయ్యాడు. ముహరింగ్ పని ప్రకారం, లెక్కలు వేయటం, తనిఖీచేయటమే కాదు. భావిలో వ్యాపారమెలా సాగుతుందో తెలిపే ఒక మిత వ్యయపట్టీని గూడా తయారు చెయ్యాలి. ముహరింగ్ కార్యాలయంలో సహాయార్థం కొన్ని వేలమంది గుమాస్తాలు నియమింపబడ్డారు. అతను వేసిన ముఖ్య అంచనాలతోనే క్రిస్లర్ కార్యనిర్వాహక సభ తీర్మానాలు చేసుకునేది. కంపెనీ పరిస్థితి ఏమిటో సరిగ్గా తెలియటంవల్ల అప్పులు తీర్చేయటానికి సాహసించాము. డాడ్జి అప్పు పత్రాలు 30.000 000 డాలర్లదాకా తగ్గిపోయాయి. ఆ తర్వాత ఒకసారి 25.000.000 డాలర్ల అప్పు చాలా తక్కువ వడ్డీకే లభించింది. చివరికి 1934.35 సం॥లో కొన్ని లాభాలు చేసుకుని అప్పులన్నీ పూర్తిగా తీర్చేశాము.

బహుశః అంతకంటె గూడా ముఖ్యమైన మరో సంఘటన జరిగింది. 1929 వ సం॥ తర్వాత కొత్త నిర్మాణార్థం కంపెనీ కొన్ని కోట్లు ఖర్చు చేసింది. 1937 వ సం॥లో ఉత్పత్తికంటె మా కార్ల కొనుగోలు శక్తి అధికమైంది. ఆ సమయంలోనే గనుక యంత్రాగారాన్ని పునర్నిర్మించే ఆవశ్యకత ఏర్పడుంటే విపరీతమైన వ్యయం చేయవలసివచ్చేది. అదృష్ట వశాత్తూ కార్ఖానాకి ఒక నూతన నిర్మాణ పథకం వేసేసుకోవటంవల్ల యంత్రాగార అభివృద్ధి విషయమై భయపడవలసిన అవసరం లేకపోయింది. అందుకనే ఆర్థిక మాంద్యమున్న రోజుల్లోనే మాకు అధికంగా అప్పులు లభించటం, మోటారుకారు పరిశ్రమ అభివృద్ధి పొందటం జరిగాయి. కొత్త కారుని యథాప్రకారం 1937 వ సం॥లో కారుకి మల్లె నిర్మించాము.

ఆర్థిక పరిస్థితిని. యంత్రాలని గురించే కాదు మోటారు పరిశ్రమని గురించి చాలా చెప్పవలసివుంది. నేనే కాదు కార్మికులంతా కుటుంబ పోషణకోసమే అన్ని సంవత్సరాలు పనిచేసేవారు. 1937 వ సం॥లో లాగే నేటికీ క్రిస్లర్ కంపెనీ జీతాల పట్టీలో 76,000 మంది కార్మికుల పేర్లు వున్నాయి. కార్మికుల కృషిని నేనెప్పుడూ గౌరవించేవాణ్ణి. నా స్వభావం ఎరిగి ఉన్న వారెవరైనా ఆ విషయాన్ని చెప్పగలరు. నా బాల్యంలో ఒక ధూమ యంత్రం నాకు జీవనాధారంగా వుండేది. అలాగే

ఇప్పుడీ ప్రఖ్యాతమైన కంపెనీ అనేకమంది కార్మికులకు జీవనోపాధి కల్పిస్తున్నది. ఈ కంపెనీ అన్ని విధాలా పెంపొందాలనే నా ఆశయము. ఇది నా సొంత కంపెనీ అయినందుకు నాకెంతో గర్వంగావుంది. కాని దీని అభివృద్ధికి నేనొక్కడినే కారకుణ్ణనుకునేంత మూర్ఖుడను మాత్రం కాదు. ఫ్రెడ్, జెడార్, అతని అనుచరులు కలసి అద్భుతమైన యంత్ర నిర్మాణం సాగించారు. కంపెనీ ఉపాధ్యక్షుడు డబ్ల్యూ. లెడ్‌యార్డ్ మైకెల్ ఆధ్వర్యాన ప్రపంచమంతా చక్కని ఎగుమతి వ్యాపారం జరిగింది. కార్మికులంతా సమిష్టి సాధనకోసం శ్రద్ధాపూర్వకంగా కృషిచేయటం వల్లనే ఏ పారిశ్రామిక సంఘమైనా పెంపొందగలుగుతుంది. డెట్రాయిట్ లోని మోటారు పరిశ్రమ కార్యనిర్వాహక వర్గానికి నేను సభాధ్యక్షుణ్ణయాను. ఆ వ్యాపారం నడుపుతున్న ఆరుగురు యువకులకీ నేను ఒక గురువులా వుంటేవాణ్ణి. నేను, కెల్లర్, జెడార్, హచ్‌సన్, స్కెల్టన్, బ్రీర్ — మేమంతా మొదట్లో సామాన్యమైన కార్మికులుగానే కర్మాగారాలలో చేరాము. వాస్తవానికి ప్రస్తుతం వున్నత పుద్యోగాలలంకరించిన మేమంతా ఒకప్పుడు సామాన్య అమెరికను కార్మికులమే. భావిలో ఉత్పత్తిదారులయేవారుకూడా మొదట్లో మాలాగ కర్మాగారాలలో పని ప్రారంభించవలసివస్తుంది. ఎందుచేతనంటే, శ్రమ, శిక్షణ ద్వారానే వున్నత వుద్యోగాలు చేయటానికి అవకాశ మేర్పడుతుంది. ఆ యోగ్యతలు పొందటంవల్లనే మేము ప్రస్తుతం వున్నతోద్యోగాలు నిర్వహిస్తున్నాము.

